# నొప్పులతో అలిసిపోయిన మీ శరీరానికి క్షణంలో నూతనోత్సాహాన్ని చేకూర్చండి.




పొద్దస్తమానం బస్సుల్లోనూ, ఆటోల్లోనూ, ద్విచక్ర వాహనాల పైననూ, గతుకు, బొతుకు రోడ్లపైననూ ప్రయాణం చేసి, చేసి,డస్సిపోయి, గూటికి చేరుకొనే సమయానికి వొళ్ళంతా హూనమై, నొప్పులతో బాధపడుతూ వుంటారు. ఈ బాధా నివారణకు ఓ చక్కని చిట్కా ఇదుగో! కొద్దిపాటి అశ్విని మజిల్ ఆయిల్‌ను తీసుకొని, వొళ్ళంతా చమిరి, కొద్దిసేపైన తర్వాత,ఒక వేణ్ణీటి స్నానం చేస్తే చాలు. క్షణంలో వొళ్ళు నొప్పులన్నీ మటు మాయమై పోగలవు. బడలిక వదిలి, శరీరానికి నూతనోత్సాహాన్నీ, ఆదమరిచే గాఢ నిద్రను చేకూర్చగలదు. అశ్విని మజిల్ ఆయిల్ వొళ్ళు నొప్పులను, కండరాల నొప్పులను, మోకాళ్ళ నొప్పులను, బెణుకులను నివారించే దివ్యౌషధం.

**మంట పుట్టనిది. ఘాటైన వాసన లేనిది.**

**బాధ తీవ్రముగా వున్నట్లయితే మజిల్ ఆయిల్‌తో మర్దన చేసిన తరువాత వేడి నీళ్ళలో బట్టను తడిపి కాపడం పెట్టవలయును.**




## అశ్విని మజిల్ ఆయిల్

పంపిణీదార్లు :

**వజ్రా మార్కెటింగ్ అసోసియేట్స్**

మూసాపేట, హైదరాబాదు 500 ౦౧౮

**ఇంటింటా వుండవలసిన అద్భుత బాధా నివారిణి.**

## సచ్ఛీలతకు, సమగ్ర వ్యక్తిత్వ వికాసానికి

## విశిష్టమైన విద్య




# శ్రీ వల్లూరుపల్లి రత్తయ్య, సీతమ్మ & విజ్ఞానజ్యోతి రెసిడెన్షియల్ స్కూల్



## విజ్ఞాన జ్యోతి

209, రామకృష్ణ టవర్స్, నాగార్జుననగర్, హైదరాబాదు-500 873.

మియాపూర్ (బొంబాయి రోడ్డు)ను దుందిగల్‌తో కలిపే లింక్‌రోడ్డులో మియాపూర్ జంక్షన్ నుండి 8 కి.మీ. దూరంలో బసుపల్లి వద్ద 18 ఎకరాల సువిశాల ప్రశాంత ఆవరణలో స్కూలు నెలకొని వున్నది.

**శిశువే కేంద్రంగా, విలువలే ప్రాతిపదికగా, జీవితావసరాలు తీర్చే విద్యను బోధించే స్కూలు. ఎదిగే విద్యార్థుల అవసరాలకు, కోరికలకు సరితూగే ఆరోగ్యకరమైన, విద్యార్జనకు అత్యంత అనువైన పరిసరాలలో.**

జ్ఞాన సముపార్జనకు విద్య కార్యదక్షతకు విద్య
వ్యక్తిత్వ వికాసానికి విద్య మానవ మనుగడకు విద్య

అన్న ఉన్నతాశయాలతో విద్యార్థులలో స్వావలంబన, ఆత్మవిశ్వాసం, ఆత్మసాక్షాత్కారం వెల్లివిరిసేలా అంకితభావంతో, ప్రేమాదరాలతో తీర్చిదిద్దగల సుశిక్షితులైన అధ్యాపక బృందం కలిగిన స్కూలు.

**ఒకటినుండి ఐదవ తరగతివరకు రిజిస్ట్రేషన్స్ ప్రారంభమయ్యాయి. సంరక్షకుల కోసం ఉద్దేశించిన హ్యాండ్‌బుక్, రిజిస్ట్రేషన్ ఫారాలను దిగువ చిరునామా వద్ద, హైదరాబాద్‌లో చెల్లించే విధంగా ఏదేని షెడ్యూల్డ్ బ్యాంకు నుండి 'వల్లూరుపల్లి రత్తయ్య & సీతమ్మ చారిటబుల్ ట్రస్టు' పేరిట తీసుకున్న రూ. 150/- డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా రుసుము చెల్లించి తీసుకోవచ్చు.**

వి.ఆర్.ఎస్. దాతృత్వ సంస్థచేత స్థాపించబడి సేవా నిరతులైన వృత్తి నిపుణులు, పారిశ్రామిక ప్రముఖులు, విద్యావేత్తలు, ప్రవాస భారతీయులు కలిసి స్థాపించిన విజ్ఞానజ్యోతి సొసైటి సహకారంతో నడుపబడుతున్న సంస్థ. **విజ్ఞానజ్యోతి సొసైటి హైదరాబాదులో ఒక పబ్లిక్ స్కూలు, సికిందరాబాద్‌లో మేనేజ్‌మెంట్ ఇన్‌స్టిట్యూట్** ప్రాథమికంగా ప్రారంభించి నడుపుతున్నది.

# చతుర ప్రపంచం

## చిత్రమైన ఊహాశక్తి

అతీంద్రియ శక్తులున్నాయంటే ఈ కాలంలో చాలామంది నమ్మకపోయినా, గాఢంగా నమ్మే వాళ్లు కూడా లేకపోలేదు. అయితే ఈ నమ్మకా లవల్ల చిక్కుల్లో పడ్డవాళ్లూ తారసపడుతూనే వుంటారు. ఈ అతీతశక్తులు నూటికి నూరుపాళ్లూ యదార్థమేనేమో అని అప్పుడప్పుడు జరిగే కొన్ని సంఘటనలవల్ల సంశయం కూడా కలుగుతూవుంటుంది.

మామూలుగా నిత్యజీవితంలో మనకెదురయ్యే కొన్ని కష్టాలకి, సమస్యలకి ఏ బాబాలవద్దకో, జ్యోతిష్యుల వద్దకో వెళ్లి కట్నాలు, కానుకలు సమర్పించుకుని సదరు సమస్యకి పరిష్కారా న్నడగడం కొంతమంది చేస్తూనే వుంటారు గానీ, తన ఊహాశక్తితో పెద్ద పెద్ద బందిపోటు దొంగలనీ, హంతకులనీ కూడా పట్టిస్తోంది లండన్‌కి చెందిన నేలా అనే యువతి. ఇది చాలామందికి ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది.

కేసు క్లిష్టంగా తయారయి దొంగ లేదా హంతకుడెవరో పోలీసులకు ఎంత పరిశోధించినా తెలియకపోయేసరికి వెంటనే నేలా సహాయమర్థిస్తున్నారు పోలీసువారు. ఆమధ్య లండన్‌లోని ఓ ప్రాంతంలో జరిగిన హత్యకు సంబంధించి నేలా సహాయమడగక తప్పలేదు పోలీసువారికి. హతురాలు బార్బారా అనే పేరుగల మహిళ. ముగ్గురు పిల్లల తల్లి. రేప్ జరగటంగాని, ఇంట్లోవిలువైన వస్తువులు, డబ్బు పోవటంగానీ లేదీకేసులో. దాంతో పోలీసులకు హంతకుడిని పట్టుకోవడం కష్టమైంది.

'హంతకుడి పేరు రాబర్ట్ అనీ, అతడు బార్బరాకి మాజీప్రియుడని, 15 సంవత్సరాల జైలుశిక్ష అనంతరం తిరిగివచ్చిన ఆ రాబర్ట్, బార్బరా వేరొక పెళ్లి చేసుకుని సుఖంగా బతకడం చూసి ఓర్వలేక ఆమెని హత్యచేశాడనీ నేలా వివరించింది. కేసు గురించి ఆలోచించగానే జరిగిన విషయాలన్నీ తన కళ్ల ముందు సినిమారీళ్లలా తిరుగుతాయంటుంది నేలా. రాబర్ట్‌ని అరెస్ట్ చేశాక విచారిస్తే నేలా చెప్పినవన్నీ యదార్థాలని



తెలింది. ఆమె పోలీసులకు చేసిన సహాయాల కుగాను ఒక్కపైసా కూడా తీసుకోదు.

1994లో జరిగిన 20 లక్షల బ్యాంకు దోపిడి సంఘటన సమయంలో నేలా మొట్టమొదటి సారిగా తనకున్న శక్తిని స్వయంగా తెలుసుకోగ లిగింది. ఆ బ్యాంకుదోపిడీకి సంబంధించిన క్లూ లభించగానే వెంటనే ఆమే స్వయంగా పోలీసులను కలిసి వివరాలన్నీ చెప్పి, దోపిడీ దారులని పట్టించగలిగింది.

మొదట్లో ఆమెను చాలామంది నమ్మలేదు. 1979లో రిప్పర్ అనే హంతకుడిని పట్టివ్వ డంలో తోడ్పడంతో నేలా పేరు మారుమోగింది. రిప్పర్ 11 మంది బాలికలను రేప్‌చేసి, ఆపైన హత్యచేసి పోలీసుల కన్నుగప్పి తిరుగుతుండేవాడు. నేలా రిప్పర్‌ని పట్టివ్వడమే కాక అతడు రేప్ చేసే పద్ధతి, చంపే పద్ధతి కూడా యధాతథంగా వర్ణించి చెప్పి అతడు బ్రాడ్‌ఫోర్డ్ నగరానికి చెందిన వ్యక్తి అని తెల్పింది. ఆవిధంగా రిప్పర్‌ని సునాయా సంగా బంధించగలిగారు పోలీసులు.

ఇప్పటికీ కొన్ని కేసులలో పోలీసులకి నేలా సహాయమందుతూనేవుంది. ఈ కారణంగా నేలా జీవితంలో ఎప్పుడూ ప్రమాదం పొంచి చూస్తూనేవుంటుంది. కక్ష కట్టిన నేరస్థులు ఆమెను అంతంచేసే అదనుకోసం కనిపెట్టివు న్నారన్న సంగతి తెలిసినా 'తన అతీంద్రియశ క్తులవల్లే ఈ దుష్టశక్తుల బారినుండి తను తప్పించుకోగలుగుతున్నా'నంటుంది నేలా.

---

## తిమింగలాల దత్తత

**స్వీ**డన్‌లో ముఖ్యంగా చెప్పుకోదగిన రా జకీయ పక్షాలు అయిదున్నాయి. ఈ పార్టీలు ఒకదానితో ఒకటి ప్రతివిషయంలోనూ విబే ధించుకుంటూనే వుంటాయి. కానీ ఓ తిమింగ లాన్ని దత్తత చేసుకునేవిషయంలో మాత్రం ఐకమత్యాన్ని పాటించాయి. 'తిమింగలాల దత్తత' అన్నమాట వింటే మనకు ఆశ్చర్యం, నవ్వు కూడా రాకమానదు. ఇంతకీ తిమింగలా ల్ని దత్తత చేసుకోడం ఏమిటంటారా?

మానవుల్లాగే తిమింగలాలు కూడా విభిన్న పోలికల్లో వుంటాయి. అంటే మనుషులు అవ యవ నిర్మాణంలోను కార్యకలాపాల్లో ఒక్కలా గే కనిపించినా, ఒక మనిషిని మరో మనిషి గుర్తించడం ఎంత తేలికో, తిమింగలాల విష యంలో కూడా అంతే తేలిక. స్వీడన్‌లో తిమింగలాన్ని దత్తత చేసుకోవడం చాలా మామూలు వ్యవహారం. మనకు నచ్చిన తిమింగలాన్ని ఎన్నుకుని, 5 వేల క్రోనర్లు కట్టి వాన్ని స్వంతం చేసుకోవచ్చు. ఈ డబ్బుని ప్రభుత్వం శాస్త్రీయ పరిశోధనా కార్యక్రమాలకు వినియోగిస్తూ, తిమింగలం స్వంతదారుడికి దాని ఆరోగ్య వివరాలు వగైరా రెగ్యులర్‌గా పంపుతూ వుంటుంది. అతడు సదరు తిమింగ లానికి తండ్రిగానే పరిగణించ బడతాడు. ముఖ్యంగా ఈ తిమింగలాల్లోని కొవ్వు, లివర్, నూనె, మొదలయిన పదార్థాలతో అనేక రకాల మందులు, ఆహారాలు తయారుచేసుకోవచ్చు. తిమింగలాన్ని చక్కగా పెంచిపోషిస్తే అంతా డబ్బే. అయితే ఈ వ్యాపారధోరణి తప్పనీ, తిమింగలాలని స్వప్రయోజనాలకి పెంచడం, చంపడం చట్టవిరుద్ధమని కొన్ని దేశాలు ప్రక టించాయి. వాటికి మద్దతుగా మేజర్ వరల్డ్ వైల్డ్ లైఫ్ ఆర్గనైజేషన్స్ 1988వ సంవత్సరాన్ని 'ఇయర్ ఆఫ్ దివేల్స్'గా ప్రకటించాయి. అప్పటి నుంచీ తిమింగలాల వేట, పెంపకం, దత్తత, సంహారం... వగైరాలు కొంత తగ్గా యని చెప్పొచ్చు.

జపాన్‌లో అయితే ఈ తిమింగలాల వేట అనాదిగా వస్తున్న సాంప్రదాయక వృత్తి. మత్స్యకారుల చేపల వృత్తిలాగానే ప్రత్యే కంగా తిమింగలాల్ని వేటాడే వారున్నారు. దానినుండి కావలసినది పొందాక, దాని పే రున సమాధి కూడా నిర్మిస్తారు జపానీయులు. అక్కడ తిమింగలాలకి దేవాలయాలు కూడా వున్నాయి. అందుకే వరల్డ్ లైఫ్ ఆర్గనైజేషన్ తిమింగలాల వేటపై విధించిన నిషేధాజ్ఞలను

---

**ముఖచిత్రం: జగ్‌మోహన్**




జపాను ఖండించింది. తిమింగలాల వేటని నిషేధించడంద్వారా వారి జీవనోపాధి పడిపోయిందని ఘోషించారు జపనీయులు. కానీ తిమింగల ప్రేమికులు మాత్రం ఈ ఘోషను పెడచెవిని పెట్టడమే కాకుండా, జపాన్‌లాంటి సంపన్న దేశం ఒక్క తిమింగలాలమీదనే బతకాల్సిన ఖర్మేం లేదని నొక్కి వక్కాణించారు.

తిమింగలాలకి కుటుంబవ్యవస్థపై మంచి అవగాహనవుంది అంటున్నారు పరిశోధకులు. ఎందుకంటే ఒక తిమింగలం జబ్బుపడితే మిగిలిన తిమింగలాలన్నీ దానిచుట్టూ చేరి అది కోలుకునేవరకూ సేవలు చేస్తాయి. పిల్ల తిమింగలం చనిపోతే, తల్లి తిమింగలం దాని శరీరాన్ని సాధ్యమయినంతకాలం ఏ జంతువుకీ అందకుండా కాపాడుతూ వుంటుంది.

నిజానికి తిమింగలాలవల్ల ఎన్నో వుపయోగాలు, ఆదాయం వున్నా దేశ సభ్యత, సంస్కారాలని దృష్టిలో పెట్టుకునయినా ఆ జాతిని రక్షించుకోవలసిన బాధ్యత అందరిదీ అంటున్నారు విజ్ఞులు.

## కొత్తరకం చికిత్స

అప్పుడప్పుడు అవయవ నిర్మాణం ఆరోగ్యకరంగా వున్న వ్యక్తులకంటె, అంగ వికలురే చాలా విషయాల్లో విజయాల్ని సాధిస్తున్నారని అనిపిస్తూ వుంటుంది. దానికి ఉదాహరణగా నిలబడుతున్నాడు ధార్వార్‌కి చెందిన మార్షల్ డిసౌజా. ఈయన ఏకకాలంలో, మౌత్ ఆర్గన్‌నీ, గిటార్‌నీ కూడా వాయించగలడు. అలా ఆ కళల్లో నిష్ణాతుడిని చేయగలిగింది అతనికున్న 'నత్తి' అంటే ఆశ్చర్యమే.

డిసౌజాకి చిన్నప్పటినుండీ విపరీతమైన 'నత్తి' వుండేది. ఒక్కోమాట చెప్పడానికి 10, 15 నిమిషాలు కష్టపడాల్సి వచ్చేది అతనికి. స్కూల్లో తోటి పిల్లల అపహాస్యానికి తరచు గురవుతూ వుండేవాడు డిసౌజా. దాన్ని అర్థంచేసుకున్న టీచర్లు అతడిని ఎక్కువ మాట్లాడించడం, ప్రశ్నలడగడం చేసేవారు కాదు.

ఎంతోమంది వైద్యుల్ని సంప్రదించి మందులు వాడినా ఏమీ ఉపయోగం కనిపించలేదు డిసౌజాకి. ఆ పరిస్థితుల్లో జపాన్ నుంచి

బెంగుళూరు వచ్చిన జాన్‌రోమి అనే స్పీచ్ థెరపిస్ట్‌ను కలిశాడు డిసౌజా. ఆయన డిసౌజా జబ్బును 3, 4 ఏళ్ళలో పూర్తిగా నయం చేస్తానని, అయితే... దానికి మందులుగానీ, ఆపరేషన్‌గానీ అవసరం లేదని, కేవలం రోజుకు రెండు మూడు గంటలపాటు ఆపకుండా మౌత్ ఆర్గన్ వాయిస్తే సరిపోతుందని చెప్పాడు. అప్పటినుండీ రోజుకు 4, 5 గంటలపాటు ఆపకుండా మౌత్ ఆర్గన్‌ని వాయించడం అలవాటు చేసుకున్నాడు డిసౌజా. క్రమేపీ అతని నత్తి తగ్గడమే కాకుండా మ్యూజిక్ మీద అతని అభిరుచి పెరగసాగింది. ఈ అభిరుచి అతనికి జాతీయ, అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిపెట్టింది. జర్మనీ ఓ సంవత్సరం నిర్వహించిన 'వరల్డ్ హార్మోనికా ప్లేయర్స్ కాంపిటీషన్'లో 21 మందిని ప్రసిద్ధులుగా సెలెక్ట్ చేసి అవార్డులను ఇచ్చింది. వారిలో ఇండియానుంచి వెళ్ళిన ఒకే ఒక కళాకారుడు డిసౌజా.




పోతే డిసౌజాకున్న మరొక టాలెంటు హార్మోనియం, గిటార్లను ఏకకాలంలో వాయించడం. ఇలా చేసేటప్పుడు దీనికోసం స్పెషల్‌గా తయారుచేయబడిన హార్మోనికా యొక్క ప్రెస్ బటన్స్‌ని ఒక కేబుల్ సాయంతో తన బొటనవేలుకు బిగిస్తాడు. వేలుతో బటన్స్ నొక్కగానే శబ్దతరంగాలు రావడం, దానికనుగుణంగా హార్మోనియం వాయించడం ఒకే సారి జరుగుతుంది. ఆ సమయంలో అతని నోరు, వేళ్ళు, కాళ్ళు అన్నీ ఓ యంత్రంలోని భాగాలుగా పనిచేస్తూ కనిపిస్తాయి.

బొంబాయి, ఢిల్లీ మొదలైన పెద్ద నగరాల్లో ప్రదర్శనలిచ్చాడు డిసౌజా. శ్రీలంక రేడియోలో అతని మ్యూజిక్ ప్రోగ్రాములు ప్రసారం చేయబడ్డాయి. అప్పటి ప్రెసిడెంట్ రాజేంద్రప్రసాద్, డిసౌజాని 'లారీ ఆడ్లర్ ఆఫ్ ఇండియా' అని పొగిగాడు. కర్నాటకా డెయిలీ 'సంయుక్త'లోను 'కస్తూరి' మాసపత్రికలోను కార్టూనిస్ట్‌గా కూడా పనిచేశాడు డిసౌజా. ట్రేడ్ మార్కులు, ఎంబ్లమ్‌లూ డిజైన్ చెయ్యడంలో డిసౌజాది అందెవేసిన చెయ్యి. 'నత్తి'తో బాధపడేవారికోసం, దాని చికిత్సా విధానాన్ని తన అనుభవంతో వివరిస్తూ ఓ ఆడియో కేసెట్‌ను కూడా మార్కెట్‌లో విడుదల చేశాడు డిసౌజా. ఇది నత్తి బాధితులకు చాలా ఉపయోగకరంగా వున్నట్టు తెలుస్తోంది.

# ఖర్చులేని ఎక్స్‌రే

ఈ రోజుల్లో రోగం తక్కువ, వైద్యం ఎక్కువ అన్నమాట చాలాచోట్ల వినిపిస్తోంది. పూర్వం పడిశమో, జ్వరమో వస్తే కరక్కాయ రసమని, తులిశాకు రసమనీ, మిరియాల కషాయమని... ఇలా ఇంటివైద్యంతోనే రోగం తగ్గించుకునేవారు. ఇప్పుడలా చేయడానికి ఎవరూసాహిసించడంలేదు. అథవా సాహసించినా రోగాలు కూడా అంతకన్న మొండిగా కిలం వదిలితేగాని మేము వదలమంటున్నాయి. పైగా పెద్ద పెద్ద స్పెషలిస్టులు కూడా మూత్రపరీక్ష దగ్గరనుంచి మెదడు స్కానింగ్‌దాకా ఎడాపెడా టెస్టులు రాసేసి పరీక్షలయి రిపోర్ట్ వస్తేగాని మేమేమీ చెప్పలేము అంటున్నారు. పూర్వం వైద్యులు కేవలం నాడివట్టుకుని చూసిగాని, లక్షణాలని బట్టిగాని కొన్ని రోగాలని గుర్తించి వైద్యం చేసేవారు. ఇప్పుడు డాక్టర్లు ఒంటిమీద చెయ్యి వెయ్యకుండా వేలకువేలు ఒదిలిస్తున్నారు.

మామూలుగా చేసే మూత్ర, రక్త పరీక్షలయితే కొంతవరకు నయమేగాని, ఏ స్కానింగో, ఎక్స్‌రేనో అన్నాడంటే రోగిపని అయినట్టే.

అయితే ఎక్స్‌రే, స్కానింగ్‌లాంటి ఖరీదయిన పరీక్షలు చేయించుకునే శక్తిలేని పేదరోగులకు అందుబాటులో వుండే ఓ కొత్త ఎక్స్‌రే పద్ధతి వచ్చిందంటున్నారు శాస్త్రవేత్తలు. కలకత్తాలోని జాదవ్‌పూర్ విశ్వవిద్యాలయంలో పదిమంది విద్యార్థుల బృందం డాక్టర్ మోనిషిము ఖర్జీ, డాక్టర్ చౌదరిల నాయకత్వంలో జరిపిన పరిశోధనలో ఈ కొత్త టెన్నిక్ వెల్లడయింది. ఈ పద్ధతి ప్రకారం ఎక్స్‌రేని ఒక తెల్లకాగితంమీద జిరాక్స్‌లాగా తీసుకోవచ్చును. జాదవపూర్ యూనివర్శిటీలోని ఇంజనీరింగ్, ఎలెక్ట్రానిక్, కమ్యూనికేషన్ విభాగాల సంయుక్తకృషి ఫలితమే ఈ కొత్త ఎక్స్‌రే పద్ధతి. ఈ పద్ధతిలో సిలియం పూతపూసిన అల్యూమినియం ప్లేటును, ఎక్స్‌రే ఫిల్మ్‌కి బదులుగా కెమికల్ కోటింగ్‌చేసి ఉపయోగిస్తున్నారు. ఫిల్మ్‌స్థానంలో ఈ ప్లేటును ఎక్స్‌రే మెషీన్‌లో పెట్టి రోగికి ఎక్స్‌రే తీస్తారు. పేషెంట్ శరీరంలో ఏ భాగానికి ఎక్స్‌రే తీయబడిందో సదరుభాగానికి సంబంధించిన మొత్తం చిత్రం ఈ ప్లేటు మీద పడుతుంది. అటుపైన దీనిపై ఒక తెల్లకాగితాన్ని కప్పి వేరొకమెషీన్‌లో పెట్టి స్విచ్ నొక్కగానే ప్లేటుమీదున్న బొమ్మ తెల్లకాగితంపైన పడుతుంది. పేపరుమీద తీసిన జిరాక్స్ కాపీలా కనిపించే ఆబొమ్మ తీసిన శరీరభాగాన్ని స్పష్టంగా చూపిస్తుంది.

ఈ పద్ధతి గురించి దేశంలో చాలా ప్రాంతాల్లో గల పెద్ద పెద్ద ఆసుపత్రులలో చర్చలు, పరిశీలనలు జరుగుతున్నాయి. అత్యంత తక్కువ ఖర్చుతో జరిగిపోతున్న ఈ ఎక్స్‌రేవిధానం అందరికీ ఆమోదయోగ్యమే. ఈ పద్ధతి వల్ల ఖరీదయిన ఎక్స్‌రేఫిల్ములు, దానిని ప్రొసెస్ చేసేందుకు వాడే కెమికల్సుయొక్క ఖర్చు 90 శాతం తగ్గిపోతుందట. దీనికి డార్క్ రూమ్ అవసరం కూడా లేదు.



# చమత్కథలు

## 'రైలింజను సూత్రం'

**ము**కుందం సన్మానసభ జోరుగా జరిగింది.

ముకుందం కాస్త పేరున్న రచయితే! నవలలు, నాటకాలు, కథలు, గేయాలు చాలానే రాశాడు. అందుకని అతని అభిమానులు వాళ్ల




సంస్థ పేరుతోనే సన్మానం చేశారు.

ముకుందంతోపాటు ఆయన భార్యను కూడా సన్మానించి ఘనంగా బట్టలు పెట్టారు. ఆవిడను అద్భుతంగా పొగిడేశారు. ధండలు వేశారు. ఆకాశానికి అతికష్టంమీద ఎత్తేశారు. శృతిమించే పొగిడారు. భార్య శాంతమ్మగారు ఆ భజనలకు ఇబ్బందిగా గింజుకుంటుంటే ముకుందం మాత్రం నిర్లిప్తంగా కూర్చుండిపోయాడు.

హాల్లో వారి కొడుకులూ, కోడళ్లూ వగైరాలు ఆ మాటలకి తప్పనిసరిగా సర్దుకునున్నారు. "ఫలానా నవలలో ఫలానా రసం అద్భుతం, ఓహో ఆ ఘట్టం, ఆ వర్ణనలూ గీటురాళ్లు, ఆహా ఆ నాటకం క్లైమాక్సు సీను వారికి తప్ప మరెవరికి సాధ్యం?" అంటూ సాగదీశారు. శాంతమ్మగారి సాహచర్యంతోనే అది సాధ్యమైందన్నారు.

శాంతమ్మగారికి ఈ పొగడ్తల్తో కడుపుబ్బిపోయింది. మెదడు శూన్యమయింది.

సభలోంచి బయటపడి ఇంటికి 'దగ్గరేగా! వెన్నెల్లో నడిచెళ్దాం' అని చెప్పి సరదాగా, వెన్నెల్లో చిరు చలిలో నడుస్తున్నారు. తమ కోసం ఉంచిన కార్లో పిల్లల్ని పంపేశారు.

అప్పటిదాకా శూన్యమైన శాంతమ్మ కంఠం 'కయ్'మని లేచింది అందరూ దూరం అవగానే! "అసలా వెధవలకు మప్పి నేర్పింది మీరు. వాళ్లననేపన్లేదు, దొంగవెధవలు నేర్చారు. నా ఊసెందుకు వాళ్లకి అహాఁ... ఎందుకూ? అని! రాసేది గిలికేది నేనా? నన్ను ఉబ్బేస్తే వాళ్లకేంగిడుతుందీ... అసలు మీకుండాలి బుద్ధి"

రోడ్డు వంకర తిరిగింది. అడ్డదోవ పట్టిన శాంతమ్మ ఘాటుకు తగ్గట్లు మౌనంగా ము

కుందం అడ్డ రోడ్డుకు దారి తీశాడు. ఆవిడ అరుస్తూనే ఉంది.

"బదులు చెప్పరేం? ఏం తమాషాగా ఉందా! మాట్లాడకపోతే అయిపోయిందా, నంగనాచిమొహం వేసుకుని చూస్తారేం? అహఁ ఆ మీసాలోడికి నా ఊసెందుకు? మీరు- హవ్వ.

ముకుందం ప్రశాంతంగా రైలు కట్టను సమీపించాడు. దూరాన లీలగా పట్టాలమీద రైలు శబ్దం వినిపిస్తోంది.

"ఇటెందుకు?" హీన స్వరంతో అంది. "ఇక్కడేం పనండి?"

ముకుందం మాట్లాడలేదు.

పెద్ద శబ్దంతో రైలు దడదడలాడుకుంటూ వచ్చింది. ముకుందం శాంత చేయిగట్టిగా పట్టుకున్నాడు.

రైలు ఆగకుండా వెళ్లిపోయింది. ముకుందం అతిశాంతంగా అన్నాడు, "చూడు శాంతా! ఆ రైలింజను... చూశావుగా, దాని విలువ కోటి రూపాయలు. దాని వెనుక ఉన్న డబ్బాలు ఇరవై కలిసి ఓ పదిలక్షలు ఉంటుంది. దాని ఇంజన్ శక్తి లక్ష హార్స్ పవర్.

శాంతమ్మ బేలగా వింటోంది.

"అంతగొప్ప ఇంజనది. దానికి రెండే స్విచ్చులు... సింపుల్... డ్రైవరు సుతారంగా నొక్కుతాడు. కదులుతుంది. స్పీడు సుతారంగా నొక్కుతాడు. తగ్గుతుంది- స్టాప్! తెల్సిందా? నువ్ నా స్విచ్చివన్న మాట! అందుకే నీకా పొగడ్తలు, పదపద!

ముకుందం శాంతమ్మ చేయందుకుని ఇంటిదారి పట్టాడు!!

— రుక్మిణి

---

## పారితోషికం

**జో**గారావుకి కోపం ముంచుకు వచ్చింది!

మనీయార్డర్ తీసుకువచ్చిన పోస్టుమాన్‌మీదా, అంత తక్కువ మొత్తం పారితోషికంగా పంపిన పత్రిక యాజమాన్యం మీదా ఏకకాలంలో ఆగ్రహం గట్లు తెగింది. పోస్టుమాన్ రెండు చెంపలూ వాయించాలనుకున్నాడు. ఎమ్.ఓ రిజక్టు చెయ్యాలనుకున్నాడు.

కానీ నిగ్రహించుకొని ఆ రెండు పనులూ విరమించి బుద్ధిగా ఎమ్.ఓ ఫారం మీద సంతకం చేసి పోస్టుమాన్ ఇచ్చిన పాతిక రూపాయలు అందుకున్నాడు.

"మీ కథ చదివాను సార్! చాలా బావుంది'' అన్నాడు పోస్టుమాన్.

అతను నిజంగా జోగారావు రాసిన కథ



చదివాడో లేక రచయితల బలహీనతలు బాగా చదివాడో తెలియదుగానీ జోగారావుకి ఆ మాటలు తగలవలసిన చోటే తగిలాయి. వెంటనే ఐదు రూపాయలు బక్షీషుగా పోస్టుమాన్‌కి అందించాడు. పోస్టుమాన్ పరమానందపడిపోయి రెండు నమస్కారాలు చేసి మరీ సెలవు తీసుకున్నాడు.

జోగారావుకి పత్రికవాళ్ల మీద కోపం ఇంకా పెరిగిపోయింది. ఓ చిన్నకథకు ఇంత హీనమైన మొత్తం ఓ పెద్ద పత్రిక పారితోషికంగా ఇవ్వడం అతనికి మింగుడుపడడం లేదు. ఈ అవమానకర విషయాన్ని పత్రిక యాజమాన్యం దృష్టికి తీసుకు వచ్చి మార్పు చేయించాలనుకున్నాడు.

వెంటనే ఎడిటర్‌గారికి తాను ఎంవో చూసి పొందిన అసంతృప్తిని విశదీకరిస్తూ మిగతా పత్రికలు అతి చిన్న శీర్షికలకు కూడా ఎంత పెద్ద మొత్తంలో పారితోషికం యిస్తున్నదీ ఏకరువుపెడుతూ సృజనాత్మకశక్తికి పరీక్ష లాంటి 'చిన్నకథ'కు న్యాయం చెయ్యమని అభ్యర్థిస్తూ పెద్ద ఉత్తరం రాసి పోస్టు చేశాడు.

వారం రోజుల తరువాత ఆ పత్రిక కార్యాలయం నుండి జోగారావుకి ఓ ఉత్తరం అందింది.

"మా పత్రికలో వచ్చిన మీ కథ 'నిజాయతీ' గత నెల 'శఠగోపం' పత్రికలో వచ్చినట్లుగా మా పరిశీలనలో తేలింది. ఇది క్షమార్హమైన విషయంకాదు. మేము పంపిన పారితోషికాన్ని తిప్పి పంపడంతోపాటు మీ సంజాయషీని కూడా కోరుతున్నాం"

ఉత్తరం చూసిన జోగారావు గొల్లుమన్నాడు.

మొదట 'శఠగోపం' పత్రికకు కథ పంపి ఎనిమిది నెలలు చూసిన తరువాతనే తన కథ ఆ పత్రికలో రాదన్న నమ్మకంతో ఈ పని చేశాడు. 'శఠగోపం' పత్రికవాళ్లు తన కథను ప్రచురణకు స్వీకరించినట్లుగానీ, పోనీ ప్రచురించిన తరువాత కాంప్లిమెంటరీ కాపీ పంపడంగానీ, పారితోషికంగానీ పంపలేదు. తన కథ ప్రచురణ విషయం తెలియని జోగారావు 'శఠగోపం' పత్రికను నిందించుకుంటూ పారితోషికం తిప్పిపంపడానికి పోస్టాఫీసుకు నడిచాడు.

– రతన్‌బాబు

## దొంగ - తేలు

రైలు లయబద్ధంగా పరుగులెడుతూంటే తనకు తెలీకుండానే నిద్రలోకిజారుకున్న ప్రసూన ఆ రణగొణధ్వనులకి కళ్ళు తెరిచింది. ఏదో స్టేషన్‌లో ఆగినట్టుంది రైలు.

ఆవులిస్తూ బెర్త్‌మీద లేచి కూర్చుందామె. ప్లాట్‌ఫారమంతా జనం తెగ హడావుడిగా తిరుగుతున్నారు. కిటికీలోంచి తల బయటపెట్టి చుట్టూ కలయజూస్తున్న ఆమె కళ్ళకి భుజాన వాటర్ బ్యాగ్‌తో హడావుడిగా వస్తున్న రాజు కనపడ్డాడు. ఆశ్చర్యంతో ఆమె కళ్ళు విశాలమయాయి. అదేమిటి, ఆ వాటర్ బ్యాగ్ ఎవరిది? తమది కాదే.

ఇంతలో రాజు కంపార్టుమెంటులోకి రావడం, ఆ ప్రక్క సీట్లో మ్యాగజైన్ చదువుకుంటున్న ఇరవైయేళ్ళ అమ్మాయికి వాటర్ బ్యాగ్ అందించడం, ఆమె నవ్వుతూ థాంక్స్ చెప్పడం, వెయ్యి మతాబుల కాంతితో రాజు ముఖం వెలగడం అన్నీ చూస్తూనే ఉంది ప్రసూన.

సీట్లోకి వచ్చి కూర్చుంటూ అప్పుడు గమనించాడతను భార్య చూపులు. భుజాలెగరేసి, ఓ వెర్రి నవ్వు నవ్వి.

"పాపం, ఆ అమ్మాయి మంచినీళ్ళకోసం చూస్తుంటేనూ..." కిటికీలోకి ముఖం దూర్చాడు. ప్రసూన నిద్రమత్తు పూర్తిగా వదిలిపోయింది.

పెళ్ళైన కొత్తలో ఆడపిల్లలు దేనికీ మగవాళ్ళపై ఆధారపడ కూడదనీ, ఎవరిపనులు వాళ్ళే చేసుకోవాలని రాజు చేసే ఉపన్యాసాలకి ప్రసూన హడిలిపోయింది. కరెంటు బిల్లు,






బ్యాంకుపని, రేషన్ పని అన్నీ అలవాటుచేసుకోవాలి అంటూ తనని ప్రతీపనికి తరిమి చేయించేవాడు. ఆఖరికి ఈ ప్రయాణం టిక్కెట్లు కూడా ఆమె రిజర్వుచేసింది.

మరి ఈరోజు ఒక పరాయి ఆడపిల్లకి అంత ఉదారంగా మంచినీళ్ళు తెచ్చి అందించాడంటే...

దొరికాడు దొంగ!

పోనీ ఏ పసిపిల్ల తల్లికో, వృద్ధురాలికో సాయం చేస్తే అర్థం ఉంది. కానీ...

ఇదన్నమాట! అబ్బాయిగారి బలహీనత.

చల్లటి నీళ్ళతో ముఖం కడుక్కొచ్చి కూర్చుంది రాజు పక్కనే, ఈ కాస్త టైములో రాజు సర్దుకున్నాడు.

స్నేహితుడి పెళ్ళి ఉందని రాజు 'తుని'లో దిగాల్సి ఉంది. అన్న కొడుకు 'బాలసారె'కి విశాఖ వెళ్తోంది ప్రసూన.

'ప్రసూ! రాత్రికి పెళ్ళిచూసుకుని, రేపు బాలసారె టైముకి వచ్చేస్తాను. బోలెడు సామానుతో వెళ్తున్నావు. తీరా మీవాళ్ళకి ఈ రైలు కొస్తున్నట్లు తెలియబరచనైనాలేదు. ఒక్కదానివీ జాగ్రత్తగా దిగుతావుగా'' తునిలో దిగుతూ భార్య గురించి తెగ దిగులుపడ్డాడు రాజు. నవ్వుతూ తలూపింది ఆమె.

  

బాలసారె బ్రహ్మాండంగా జరిగింది.

ఇంటినిండా ఉన్న బంధువుల మధ్య భార్యని పల్కరించేందుకు ఛాన్స్ దొరకలేదు. ఆఖరికి వడ్డనచేస్తూ హడావిడిగా తిరుగుతున్న భార్య వెనుక నేతిజారీతో తనూ బయల్దేరాడు రాజు.

"ప్రసూ! నిన్న దిగేప్పుడు నీకేం ప్రోబ్లమ్ కాలేదుగా'' ఆప్యాయంగా అడిగాడు.

"అబ్బే, లేదండీ. మన ఎదురు సీట్లో కూర్చున్న యూనివర్సిటీ కుర్రాళ్ళిద్దరూ చాలా సాయం చేశారు పాపం. పోర్టర్ని కూడా పిలవనియ్యక, సామానంతా మోసుకొచ్చి మరీ ఆటో ఎక్కించారు నన్ను''

అల్లరి ప్రసూన జవాబుకి రాజు ఉక్కిరిబిక్కిరయ్యాడు.

— అనూరాధ

# రచయితలకు మనవి



- ★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
- ★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.
- ★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**
- ★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.
- ★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
- ★ ప్రతి నవలకు అందజేసే రు: 2,000/- పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్:

# చతుర

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.

# చతుర

సంపుటి : 17 సంచిక : 6 జూలై 1994

"విద్యా! నువ్వు చాలా తెలివైనదానివి. నువ్వు నోరు విప్పకుండా నీ ఫ్రెండ్స్‌తోనే అంతంత మాటలనిపిస్తున్నావు. సరే! ఈ క్షణంనుంచీ కాచుకో! ఏ విషయంలోనైనాసరే నీతో పోటీకి సిద్ధంగా వుంటాను. రాణి అంటే ఏమిటో తెలియజేస్తాను'' అంటూ ఆవేశంగా కారెక్కింది ఎమ్మెల్యేగారి అమ్మాయి.

ఈనాటి యువతరంలో ప్రతిభకి, పలుకుబడికి మధ్య జరిగిన పోటీల నేపథ్యంలో అన్ని రంగాలతోపాటు విద్యారంగాన్ని కూడా పట్టి ప్రభావితం చేస్తున్న రాజకీయ రాక్షసాలను సాక్షరంగా చూపిన తనికెళ్ల కల్యాణి నవల 'భేటీ' ఈ నెల చతుర సమర్పణ.


ఛోటీ
తనికెళ్ల కల్యాణి

వాతావరణం చాలా ఆహ్లాదంగా ఉంది. చల్లటి పిల్లగాలులు వీస్తున్నాయి. సూర్యుడు ఇంకా పశ్చిమాద్రికి వెళ్లకపోవడం వలన చిన్న ఎండమెరుగు కన్పిస్తోంది. ఆ చల్లటి సంధ్యా సమయం ఉదయంనుండీ పడిన శ్రమను మటుమాయం చేస్తోంది.

మధ్యాహ్న సమయంలో పడిన వర్షంవలన పువ్వులమీద, ఆకులమీద వర్షపు బిందువులు నిలిచి మెరుస్తున్నాయి. కొన్ని మొక్కల మీద సన్నటి సూర్యకాంతి పడి అవి పచ్చగా కనబడుతున్నాయి. ఆ ఇల్లు ఆ వీధికే ఒక అందాన్ని సంతరించిపెడుతూ ప్రశాంతతకి మారు పేరులా ఉంది.

వీధిగేటు తీయగానే. లోపలకి వెళ్లడానికి, సన్నటి కాలిబాట కనబడుతుంది. ఆ సిమెంటు బాటకిరుప్రక్కలా, విశాలమైన జాగాలో పచ్చటి మొక్కలు కనువిందు చేస్తున్నాయి.

ఆ కాలిబాటమీదుగా వెళితే చివర్న ఒక చిన్న డాబా ఇల్లు దర్శనమిస్తుంది. వసారాలోని పడకకుర్చీలో కూర్చున్న సారధి ఆ ఇంటికి తగినట్లే నిరాడంబరంగా, ఆకర్షణీయంగా ఉన్నారు తెల్లటిపైజమా , లాల్చీలో అందంగా, ఠీవిగా ఉన్నారు. ఆయన వరస చూస్తే చేతిలోని పేపర్ను చదువుతున్నట్లుగాక కాలక్షేపంకోసం తిరగేస్తున్నట్లున్నారు.

అంతలోనే ఏదో గుర్తు వచ్చినట్లు రాధా అని పిలిచారు. కానీ పిలుపుకి అవతలనుండి బదులేదీ రాలేదు. కొంచెంసేపు గడిచాక, పేపరులోనుండి తల ఎత్తి మళ్ళీ భార్యను గట్టిగా పిలిచారు.

ఈసారి మాత్రం ఆవిడగొంతు సన్నగా మృదుమధురంగా "ఏమిటండీ" అంటూ విన్పించింది.

ఆ స్వరమాధుర్యానికో ఏమో ఇంక అక్కడ కూర్చోలేక పేపరు ప్రక్కన పడేసి, భార్య ఉన్నవైపుకి వచ్చారు.

"విద్య ఇంకా రాలేదా?"

ఆవిడ బదులుగా సన్నగా నవ్వింది.

"ఇప్పటికి మూడుసార్లు అయినా చెప్పి ఉంటాను రాలేదని. అయినా మీకు ఎందుకంత కంగారు? ఏ స్నేహితురాలితోనో కబుర్లు చెబుతూ మీ అమ్మాయి నెమ్మదిగా వస్తోందేమో?"

రాధ సన్నజాజి పందిరి దగ్గర నిలబడి మొగ్గలు కోస్తోంది. దూరంగా ఉన్న మొగ్గలందకపోవడంతో గట్టుమీద మునివ్రేళ్ళపై నిలబడి తంటాలు పడుతోంది.

ఆవిడని చూడగానే ఆయనకి హుషారు వచ్చేసింది. వెనుకనుండి వెళ్ళి ఆవిడ నడుంచుట్టూ చేతులువేసి, పైకెత్తారు.

ఒక్కసారిగా అలా పైకెత్తడంలో ఆవిడ గాబరాపడిపోయింది. పైగా నడుం దగ్గర కితకితలు. ఎలాగైనా ఆయన చేతులనుండి విడిపించుకోవాలని నవ్వుతూనే ప్రయత్నించసాగింది.

"మొగ్గలు అందకపోతే నన్ను పిలిస్తే వచ్చి సాయం చేయనా?" అంటూ చిలిపిగా నవ్వాడాయన.

"మీకూ, మీ సాయానికి పదివేల నమస్కారాలు. ముందు నన్ను దించండి బాబూ! మీకు పుణ్యముంటుంది" అంటూ ఆవిడ బలవంతంగా ఆయనని విడిపించుకొని దిగింది. కొన్ని సన్నజాజి మొగ్గలు ఈ గొడవలో సజ్జలోనుండి కిందపడ్డాయి.

ఆయన వాటిని ఏరి, ఆవిడ సజ్జలో పడేశారు. వెనక్కి తిరిగి నడవబోతున్న ఆవిడను చెయ్యి పట్టి లాగి, దగ్గరకు తీసుకోబోయారు.

ప్రయత్నం గ్రహించిన దానిలాగ ఆవిడ నవ్వుతూ ఇంట్లోకి నడిచింది.

"పిల్లలు పెద్ద వాళ్ళవుతూంటే మీరింకా ఇలాంటి అల్లర్లు ఏమిటి? మీలో ఇంకెప్పుడు మార్పు వస్తుంది?" అంటూ మందలించింది.

ఆయన ఒకసారి తనవైపు, ఆవిడవైపు చూశారు. "ఏం రాధా! నాకు నాలో, నీలో ఏమీ మార్పు కన్పించడంలేదు సుమా!" అంటూ భుజాలెగరేశారు.

 

అద్దం దగ్గర నిలబడి తల దువ్వుకొంటూ, "విద్య ఇంకా రాలేదు. పోనీ అలాగ వెళ్ళి చూసి వస్తాను'' అంటూ బయలుదేరబోయారు. ఆవిడ ఏదో చెప్పబోయేలోగానే గేటు తీసిన చప్పుడైంది. ఆ వెనుకనే విద్య లోపలకి రావడం కన్పించింది.

ఆయన మెట్లదగ్గర నిలబడి కూతురివైపు చూశారు.

పెదవులు బిగించి వస్తున్న కూతురిని చూడగానే ఆయన "విద్యా! ఏమిటమ్మా ఈరోజు ఆలస్యమైందేం?" అని అడిగారు.

విద్య ఏమీ మాట్లాడలేదు. లోపలకి వెళ్ళి పుస్తకాలు తన గదిలో పెట్టుకొని, పెరట్లోకి వెళ్ళి కాళ్ళూ, చేతులూ కడుక్కొని మరీ వచ్చింది.

కూతుర్ని చూడగానే రాధమ్మ పాలు వెచ్చ బెట్టి, బూస్ట్ కలపసాగింది.

విద్య వచ్చి తండ్రి పక్కన కుర్చీలో కూర్చుంది.

కూతురిని ఆయన పరిశీలనగా చూశారు. "ఏం తల్లీ! బడిలో పిల్లలెవరైనా పోట్లాడారా?" అని అడిగారు.

విద్య లేదన్నట్లు చూసింది.

"మరి మేష్టర్లు ఎవరైనా ఏదైనా అన్నారా?" ఆయన అడగలేక అడగలేక అన్నారు. విద్య చదువులో ఎటువంటి అశ్రద్ధ చూపదని ఆయనకి తెలుసును. విద్య మాట్లాడలేదు. "చెప్పమ్మా! ఎందుకలాగ ఉన్నావు?" అని అనునయంగా అడిగారు.

"నాన్నగారూ! నేను ఆ పిచ్చిబడిలో చదవను'' . విద్య ఒక్కమాటలో చెప్పేసింది.

"పిచ్చి బడి ఏమిటమ్మా?" అన్నారు ఆయన తెల్లబోతూ. విద్యని ఆయన పేరున్న పెద్ద హైస్కూలులోనే చేర్చారు.

"అది కాదండీ! ఈరోజు క్వార్టర్లి పేపర్లు సైన్సు ఇచ్చారు. నాకు ఎన్ని వచ్చాయో తెలుసా? 50కి 42 మాత్రమే వచ్చాయి'' విద్య రోషంగా చెప్పింది.

"ఫస్టు మార్కు మరెవరికైనా వచ్చిందా?" ఆయన అసలు విషయం తెలిసికోవాలని అడిగారు.

"ఆ... ఫస్టు యం.ఎల్. ఏ గారమ్మాయి రాణికి వచ్చింది. 46 వచ్చాయి. మరొక అబ్బాయికి సెకెండ్ 45 మార్కులు వచ్చాయి. నేను రాసినవి అన్నీ కరక్టే. కానీ ప్రశ్నలలో మార్కులు తగ్గించేశారు'' అంటూ కోపంగా చెప్పింది.

"మరి మేష్టారిని అడగకపోయావా?" ఆయన చిన్నగా నవ్వుతూ అన్నారు.

"అడగకుండా ఎలా ఉంటాను? అడిగాను. ఎక్కువ మార్కులే వచ్చాయి కదమ్మా! ఇంకా గొడవ చేస్తావేం?" అని మొదట తేలికగా అన్నారు.

నేను అన్నీ కరక్టుగానే రాశాననీ, ఎందుకు మార్కులు తగ్గాయనీ మేష్టారిని వదలకుండా అడిగాను. దానితో ఆయనకి చిరాకు వచ్చింది. "ఏమిటమ్మా ఎన్ని మార్కులు వస్తే ఏమిటిట? ఇదేమన్నా పబ్లిక్ పరీక్షా? అయినా మార్కులు కూర వండుకొంటావా? పులుసు వండుకొంటావా? నన్ను విసిగించక కూర్చో'' అన్నారు. ఆయన అలా అనవచ్చా?" విద్య కంఠంలో అసహాయత, బాధ తొంగిచూశాయి.

సారధి కాసేపు మౌనంగా ఉండిపోయారు.

"నాన్నా! రేపు మీరు మా స్కూలుకి రండి. ఆయనని అడుగుదురుగాని'' విద్య జరగవలసిన దేమిటో తేల్చేసింది.

"అదేమిటమ్మా! చిన్న విషయాన్ని, పెద్దదిగా చేసి నేను అలాగ వచ్చి అడగవచ్చునా? అయినా నువ్వు ధైర్యంగల పిల్లవి. రేపు ఆ మేష్టారినే అడుగు. నేను బాగా రాశానండీ! మార్కులు ఎలా తగ్గాయి అని'' సారధిగారు కూతురు ఏం చేయాలో చెప్పారు.

విద్య చిరాకుగా చూసింది.

"ఆయనకి అన్నీ వేళాకోళాలే నాన్నా! మార్కులు కూర, పులుసు వండుకోవడమేమిటి

చెప్పండి? పైగా ఆ పిల్లలు పేపర్లు నాకు చూపించమన్నా చూపించలేదు''

"నేను చెప్పానని చెప్పమ్మా! ఏ పాయింట్లు నేను మరిచిపోయానో దయచేసి చెప్పండి. లేదా వాళ్ళు ఏం రాశారో ఒక్కసారి చూసి ఇస్తాను ఆ పేపర్లు నాకు ఇప్పించండి అని అడుగు, ఆయనే ఇస్తారు.

మా ఇంట్లో తక్కువ మార్కులు వస్తే మా నాన్నగారు ఊరుకోరు. ఇంక కూరలు, పులుసు, పచ్చడి అన్నీ మా ఇంట్లో మా మార్కుల తోనే చేసుకొంటాము. అందుకే తక్కువ మార్కులువస్తే కూరకి, పులుసుకి చాలవు అంటూ గట్టిగా చెప్పెయ్యి'' అని సీరియస్‌గా అనబోయి, ఆయన ఫక్కుమని నవ్వేశారు.

విద్య కూడా ఆయన నవ్వుతో శ్రుతికలిపింది. దానితో ఆయన అమ్మయ్య అనుకొన్నారు.

రాధమ్మ వచ్చి వాళ్ళిద్దరి దగ్గరా పువ్వులు మాలకడుతూ కూర్చుంది.

విద్య కాస్సేపు తండ్రితో స్కూలు కబుర్లు చెప్పి, "నాకు బోలెడు వర్క్ ఉంది నాన్నగారూ! చేసికోవాలి'' అంటూ తన గదిలోకి వెళ్ళిపోయింది.

ఆయన కూతురిని మురిపెంగా చూసుకున్నారు.

"ఏడే నీ సుపుత్రుడు? చీకటిపడినా ఇంకా ఇల్లు కనబడలేదా?" కొడుకు గురించి భార్యని అడిగారాయన.

ఆవిడ మాత్రం ఏం సమాధానం చెపుతుంది?

మురళికి ఆటలపిచ్చి. తండ్రి ఎంత మందలించినా టైంకు ఇల్లు చేరడు. విద్యకి సరిగ్గా వ్యతిరేకం.

ఆయన చూపులు మాల కడుతున్న భార్య చేతివేళ్ళవైపు నిలిచాయి. విద్యకి వాళ్ళ అమ్మ సౌకుమార్యమే వచ్చిందని అనుకొన్నాడు.

మాల కట్టడం పూర్తిచేసి ఒక ముక్క గిన్నెలో వేసి, మరొక ముక్క కూతురి జడలో పెట్టింది. ఆయన టి.వి. ఆన్‌చేసి వార్తలు వింటూంటే ఆవిడ స్నానానికి లేచింది.

మరికాసేపట్లో మురళి బిక్కుబిక్కుమంటూ ఇంట్లోకి వచ్చాడు. తండ్రి వార్తలు వినడంలో మునిగిపోవడం చూసి నెమ్మదిగా లోపలకి జారుకొన్నాడు.

ఆయన కొంచెంసేపు పోయాక లేచి విద్య గదిలోకి వచ్చారు. మురళి అప్పుడే అలమరలో నుండి పుస్తకాలు తీస్తున్నాడు.

అతడిని చూసి ఆయనకి కోపం వచ్చింది. "ఏరా! ఎంతసేపు స్నేహితులతో తిరుగుతావు? టైమెంతయిందో తెలియడం లేదా? చదువుకోవాలని జ్ఞానం లేదురా?" గట్టిగానే కేకలు వేశారు.

అతడేం మాట్లాడలేదు.

"టెన్త్ క్లాసుకి వచ్చావు. ఎందుకు? శ్రద్ధగా చదవాలన్న జ్ఞానమైనా లేదు. నీకన్నా రెండేళ్ళు చిన్నదైనా విద్య చూడు ఎలా మంచి మార్కులు తెచ్చుకొని చదువుకొంటోందో?" అని కొడుకువైపు చూస్తూ దగ్గరగా వెళ్ళారు.

తండ్రి చేతులలో ఆరోజు దెబ్బలు తప్పవనుకొన్నాడు మురళి.

అతడి భయాన్ని చూసేసరికి ఆయనకి మరి కొట్టబుద్ధికాలేదు. గట్టిగా మందలించి వచ్చేశారు. మురళికి ఉక్రోషమన్పించింది. విద్య అయితే ఆడపిల్ల. దానిలాగ తను ఎలా ఇంట్లో కూర్చోగలడు?

ఇంతలో ఆయనకి మురళి మార్కుల విషయం గుర్తుకి వచ్చింది. ఏవైనా పేపర్లు ఇచ్చారా అని పిలిచి అడిగారు. మురళి మార్కులు చెప్పలేనట్లు తలవాల్చుకొన్నాడు. ఆయనకి మురళి చదువు విషయంలో ఏం చేయడమా అన్న బెంగ పట్టుకొంది.

మురళికి మొదట బయటే ప్రైవేట్లు పెట్టారు. క్లాసు మాష్టార్లదగ్గర చెప్పించుకోకపోతే మార్కులు పడవని కొడుకు పేచీ పెడితే ఆయన దానికే ఒప్పుకొన్నారు. ఆయన ఎప్పుడు చదువు చెపుదామన్నా మురళి దొరకడు.



అది చూస్తే ఆయనకి చిరాకు.

రాధమ్మ వచ్చి అందరినీ భోజనాలకి పిలిచింది. విద్యచెప్పే కబుర్లతో భోజనాలు పూర్తయ్యాయి. మురళి మంచంవైపు నడవబోతూంటే ఆయన చూసి, "చెల్లి చదువుకొంటున్నంతసేపూ కూర్చుని చదువు'' అని ఆజ్ఞాపించారు. మురళి ఏం చేయలేక మళ్ళీ టేబుల్ దగ్గర కూర్చుని చదువుకి ఉపక్రమించాడు.

రాధమ్మ మంచినీళ్ళ చెంబు పుచ్చుకొని ఆయన గదిలోకి వచ్చింది. ఆయన భార్యవైపు తేరిపార చూశారు. ఆవిడ మొహం చాలా ప్రశాంతంగా ఉంది. ఆవిడకి ఏ సమస్యలూ ఉన్నట్టే లేదు.

ఆయన ఆవిడని చూస్తూ అడిగారు, "రాధా! నీకు ఏ విషయంలో బెంగగా అన్పించదా?"

ఆవిడ సన్నగా నవ్వింది. "ఏం! మీకు ఏవైనా బెంగలు ఉన్నాయా?" అని ఆవిడ తిరిగి అడిగింది.

"ఏం! మొదట అడిగినది నేను. కనుక జవాబు నువ్వేముందు చెప్పాలి'' ఆయన బలవంతం పెట్టారు. "మీమీద నాకు పూర్తి నమ్మకం ఉంది. మీరు అన్ని విషయాలూ చూసుకోగలరు. మరి నాకు బెంగ ఎందుకు?" ఆవిడ అతి తేలికగా చెప్పేసింది. ఆయన అప్రతిభులైనట్లు చూశారు.

"అది కాదు... మురళి చదువు గురించో, భవిష్యత్తు గురించో, పాప పెళ్ళి గురించో ఏదో ఒక ఆలోచన, బెంగ ఉండదా?" ఆయన మళ్ళీ రెట్టించారు.

ఆవిడ ఆయనవైపు ఒక క్షణం చూసింది. "మీరు ఇంతగా అడుగుతున్నారు కనుక చెపుతున్నాను. ప్రతీ విషయం ఇలాగ జరగాలని భగవంతుడు ముందుగానే నిర్ణయించి ఉంచుతాడు. దాని ప్రకారం మన చేతలు, ఆలోచనలు జరుగుతుంటాయి అని నా నమ్మకం" ఆవిడ అంత ధైర్యంగా చెపుతూంటే ఆయన సంభ్రమంగా చూశారు. ఆవిడకున్న నిబ్బరానికి ఒక్కక్షణం ఆనందపడ్డారు కూడా.

పైకిమాత్రం నవ్వుతూ "అన్నీ భగవంతుడే నిర్ణయించి ఉంచుతాడంటే నేనేం ఒప్పుకోను. నిన్ను పెళ్ళిచేసుకోవాలని మాత్రం నిర్ణయించుకొన్నది నేనే'' అని ఆయన ఆవిడని దగ్గరకి తీసుకొన్నారు.

"మా అమ్మ ఏమందో తెలుసా? ఆ నల్ల పిల్లలో ఏం అందం కన్పించిందిరా నాయనా! కోడలు నలుపైతే కులమెల్లా నలుపంటారు. నా మాటవిని తెల్లటి అమ్మాయిని చేసుకోరా? చక్కటి, అందమైన పిల్లలు పుడతారు'' అని ఎంతో బోధపరిచింది." ఆవిడ ముంగురులు సవరిస్తూ అన్నారు.

రాధమ్మ ఆయనవైపు ఓరగా చూసింది.

"మరి చేసుకోకపోయారా?"

"ఏదీ! ఈ నల్లటి పెద్దకళ్ళు నా మనసుని బంధించేశాయి. ఇంటికి వెళ్ళినా ఈ కళ్ళే వెంటాడుతూంటే మరొకరిని ఎలా చేసుకోను. నల్ల పిల్లయినా అందమైన పిల్లే అని ఒప్పించాను'' అని ఆయన ఆవిడ నుదిటిపై ముద్దెట్టుకొన్నాడు.

ఆయన సాన్నిధ్యంలో రాధమ్మకి ఏదీ గుర్తుకురాదు. ఆయనతో కలిసి బతకడమే తన అదృష్టం అనుకొంటుంది. ఆక్షణంలో వారిద్దరికీ తమ పెళ్ళిచూపుల ఘట్టం గుర్తుకు వచ్చింది.

మురళి పుట్టినప్పుడు సారధి తల్లి కినుకగా అననే అంది వద్దురా అంటే నల్లటి కోడలిని తెచ్చావు. ఇప్పుడు చూడు నా మనవడు ఎలా పుట్టాడో అని.

రాధమ్మ మొహం చిన్నబోయింది.

సారధికి తల్లికి తెల్లటివాళ్ళంటే ఎందుకంత ఇష్టమో ఇప్పటికీ అర్ధమవదు.

"ఏమిటమ్మా నువ్వు మరీను. రాధ ఏమనుకొంటుంది? అయినా నా కొడుకును నాకళ్ళతో చూడు'' అని మందలించారు.

మురళి ముమ్మూర్తులా తల్లి పోలికే. తల్లి పోలిక వచ్చిన మగబిడ్డ అదృష్టవంతుడవుతా




డంటారు. రాధమ్మ నలుపు అయినా చాలా కళగా ఉంటుంది. పెద్ద కళ్ళు, వత్తయిన పెద్ద తలకట్టు, సుకుమారమైన శరీరం. ఎవరైనా సరే ఆమెని చూసి మెచ్చుకోక తప్పదు. రూపం కన్నా మనసు మరీ మంచిది.

ఆవిడ సహనం చూస్తే సారథికి ఆశ్చర్యం వేస్తుంది. ఏ విషయంలో తొందరపడటం ఆవిడకి అలవాటు లేదు. మాట కూడా మనిషి లాగే మృదువుగా ఉంటుంది.

రాధమ్మ అత్తగారికి తను తెల్లగా ఉంటాననీ, తనకి పుట్టిన ముగ్గురు కొడుకులూ, అమ్మాయి తెలుపేననీ గర్వం. అసలు ఇంత మంది తెల్లవాళ్ళని చూసీ చూసీ బోరెత్తే ఆయనకి రాధమ్మ నలుపులో ఆకర్షణ కన్పించిందేమో!

అత్తగారు కొడుకు రంగు విషయంలో దెప్పినా రాధమ్మ ఏమీ బదులిచ్చేది కాదు. పుట్టిన బిడ్డల్ని ప్రేమించడమే ఆమెకి తెలుసును. అయినా మన పిచ్చిగాని మనకి కావలసిన రంగులో, కావలసినట్లు పిల్లలు పుట్టడం మన చేతిలో పనా! అని అనుకొంటుంది. పెద్దామెను ఎందుకు నొప్పించడమని చిరునవ్వు నవ్వి, ఊరుకొనేది.

విద్య పుట్టాక ఆ ఇంట్లోవారి ఆనందానికి అంతులేదు. విద్య మామ్మ మనసు గ్రహించి పుట్టినట్లు తెల్ల గులాబీలాగ పుట్టింది. తండ్రి రంగు, తల్లి విశాలనయనాలు, పొడవైన తలకట్టు, సౌకుమార్యం కలగలుపుకొని పుట్టింది. తల్లి వినయం, సహనం మాత్రం విద్యలో లేవు.

విద్య పుట్టాక రాధమ్మకి అత్తగారి దెప్పుళ్ళు తగ్గిపోయాయి. మురళికి కూడా చెల్లెలంటే ఇష్టం. అయితే మామ్మ నల్ల వెధవా? అని తిట్టినప్పుడు మాత్రం కోపం వస్తుంటుంది.

చిన్నప్పుడైతే మామ్మ తిట్టినపుడు, "అమ్మా? నన్ను చెల్లిలాగ ఎందుకు పుట్టించలేదే?" అని ఒకటే గోలచేసేవాడు. సారధికి ఇది తెలిసినప్పుడు తల్లిని, పిల్లల్ని అలా చిన్నబుచ్చకూడదని మందలించేవారు.

పెద్దయిన తరువాత మాత్రం మామ్మ తిట్టినపుడు ఊరుకోవడం మానేశాడు. "నువ్వొక తెల్ల దెయ్యానివి" అని ఎదురు వెక్కిరించేవాడు. ఆవిడ వీపు గోకమన్నా, కాళ్ళు పట్టమన్నా అసలు చేసేవాడు కాదు.

ఉదయం లేచిన దగ్గరనుండి విద్యకి ఖాళీ ఉండదు. తండ్రి దగ్గర కూర్చుని తెలియనివి చెప్పించుకొంటుంది. ఆ పిల్లకి ఇంగ్లీషు, లెక్కలు అన్నీ ఆయనే చెపుతారు. ఆ తర్వాత తల్లికి ఏదైనా సాయంచేయాలేమోనని చూస్తుంది.

రాధమ్మ ఎవరికీ ఏ పనీ చెప్పదు. మౌనంగా అన్ని పనులూ చేసుకోవడం ఆవిడకి అలవాటు. విద్యే అది గ్రహించి తను చేయగలిగినవిచేస్తుంది. రాధమ్మ వద్దని వారించినా విద్య వినదు.

ఎన్ని పనులు ఉన్నా, ఎంత కంగారులో ఉన్నా విద్యకి తనే జడవేసి, పువ్వులు మాలకట్టి పెడుతుంది. విద్యని ముస్తాబు చేయడం అంటే ఆవిడకి ఇష్టం. ఆడపిల్ల ఉంటేనే కదా ఇంటికి అందం అని ఎప్పుడూ అనుకొంటుంది.

విద్య కేరేజీ సర్దుకొని, తల్లితో చెప్పి స్కూలుకి బయలుదేరింది.

ఆరోజు సైన్సు మేష్టారు క్లాసుకి రాగానే తండ్రి చెప్పమన్న మాట చెప్పింది.

పేపర్లు ప్రకారం రిజిష్టర్‌లో మార్కులు వేసి, హెడ్ మాష్టరుగారికి ఇచ్చేశాననీ, అవి ఇప్పుడు తీయడం కుదరదనీ చెప్పి తప్పించుకొన్నాడు. కానీ ఆయన మనసులో విద్యంటే భయం పట్టుకొంది.

అసలు అంత పెద్ద స్కూలులో, ఆయన తన సర్వీసులో ఏనాడూ ఏ పిల్లలు మార్కుల కోసం ఆయనను నిలదీయగా ఎరుగడు.

అసలు సంగతి యం.ఎల్.ఏ పద్మనాభనాయుడంటే ఆయనకి చచ్చేంత భక్తి. ఎన్ని రకాలుగానో ఆయనని ప్రసన్నం చేసుకోవాలని తపిస్తాడు. అందుకే ఆయనకి ప్రాణపదమైన

కూతురు రాణిని ఒక దేవతను చూసినట్లు చూస్తాడు. రాణి స్కూల్లో జరిగేవి తండ్రి చెవిని వేస్తుందని అతడికి తెలుసు. రెండు రోజులకో సారైనా ఆయన దర్శనం చేసుకోక మానడు.

ఆ స్కూల్లో అందరూ ఆయనని యం.ఎల్.ఏగారి అంతరంగికునిగానే చూస్తారు. ఎవరు ఏం మాట్లాడినా ఆయనకి చేరవేస్తాడని భయం అందుకే ఎవరూ తమ మనసులో మాట ఏదీ పైకి అనరు.

మార్కుల విషయంలో విద్య మేష్టారుని నిలదీయడం రాణికి వింతగా ఉంది. విద్య స్కూల్లో చేరిననాడు రాణి స్కూలుకి రాలేదు. సారధి విద్యని, మురళిని స్కూల్లో చేర్చి వెళ్ళిపోయాడు

విద్య క్లాసులో అడుగుపెట్టగానే పిల్లలందరూ ఆసక్తిగా చూశారు. విద్య రూపం వారికి అపురూపంగానే అన్పించింది. మొదటి బెంచీలో విద్య నవ్వుతూ వచ్చి ఆ అమ్మాయి పక్కన కూర్చుంది.

కూర్చున్న పావుగంటకే జ్యోతి విద్య విషయాలన్నీ సేకరించింది. వెనుక బెంచీలో కూర్చున్న దీప్తి ఇది చూసి మూతి తిప్పుకొంది. అసలు జ్యోతి విద్యకి స్థలం ఇస్తుందని దీప్తి అనుకోలేదు. విద్య వచ్చినట్లు తమ వెనుక బెంచీలో వచ్చి కూర్చుంటుందని అనుకొంది.

రాణి స్కూలుకి రాకపోతే వీళ్ళకి ఎక్కడ లేని ధైర్యం వస్తుంది అని దీప్తి కసిగా అనుకొంది. దీప్తికి జ్యోతి అంటే అసలు ఇష్టం ఉండదు. జ్యోతి మనసులో ఏమాటా ఉంచుకోదు. మొహంమీదే తెగేసి అంటుంది. అది దీప్తికి ఎంతో చిరాకుగా ఉంటుంది. జ్యోతి చురుకుగా ఉంటుందని కూడా మనసులో బాధ.

జ్యోతి అసలు చాలా చిరాకుగా ఉన్నప్పుడే ఎవరితోనైనా తగాదాకి సిద్ధమవుతుంది. సాధ్యమైనంతవరకు ఎవరిజోలికీ వెళ్ళకూడదనుకొంటుంది. అలాగని ఎవరైనా అకారణంగా అంటే ఒప్పుకోదు.

జ్యోతి తండ్రి ఆర్దైగా పనిచేస్తున్నారు. ఆస్తిమంతులు. ఇంట్లో గారాబం ఎక్కువే అయినా జ్యోతి చదువులో చురుకుగా ఉండటంతో వాళ్ళకి మరీ ముద్దు. టీచర్లకీ బాగా చదివే జ్యోతి అంటే ఇష్టమే.

ఆరోజు ఇంగ్లీషు మేష్టారు క్రితంరోజు అయిపోయిన పాఠంలోని ప్రశ్నలను వేస్తున్నారు. ఆయన ప్రశ్నలకి జ్యోతి, మరొక ఇద్దరబ్బాయిలు సమాధానాలు చెప్పారు. విద్య మౌనంగా కూర్చుని క్లాసుని గమనిస్తోంది.

మేష్టారు అడిగిన ఒక ప్రశ్నకు ఎవరూ సమాధానం చెప్పలేదు. విద్య లేచి నిలబడి, సమాధానం చెపుతానంటే ఆయన చెప్పమన్నారు. విద్య ఆ ప్రశ్నకు సమాధానం చక్కటి ఇంగ్లీషు ఉచ్చారణతో చెప్పింది. మేష్టారు విద్యని అభినందిస్తోంటే క్లాసులోని పిల్లలు ఆసక్తిగా ఆ అమ్మాయివైపు చూశారు.

క్లాసులు అవుతోంటే ప్రతీ మేష్టారూ "రాణి రాలేదా?" అని అడగడం విద్య గమనించింది. ఇంటికి వస్తున్నప్పుడు జ్యోతిని, "రాణి ఎవరు? ఆ అమ్మాయి బాగా చదువుతుందా?" అని అడిగింది.

జ్యోతి ముక్తసరిగానే రాణి యం.ఎల్.ఏగారమ్మాయి అని, రెండురోజులైై ఆ అమ్మాయి స్కూలుకి రాలేదనీ చెప్పింది. విద్య కుతూహలంగా "రాణి మీ క్లాసు ఫస్టా! హిందీ మేడమ్ ఆ అమ్మాయి గురించి ఎన్నిసార్లో అడిగారు కదూ?" అని అడిగింది. బాగా చదివే వాళ్ళంటే విద్యకి ఇష్టం.

"ఫస్టుమార్కులదేం ఉంది? ఎవరు బాగా చదివితే వాళ్ళకి వస్తుంది. అదేం గుత్తకి కొన్నది కాదు కదా? ఇంక ఆ హిందీ మేడమ్‌గారికి డబ్బు, అధికారం ఉన్నవాళ్లంటే గొప్ప మోజు అనేసింది'' జ్యోతి.

అమ్మో! ఈ అమ్మాయికి కోపం కాస్త ఎక్కువలాగే ఉందని విద్య మనసులో అనుకొంది. విద్య అన్నని స్కూలు వాతావరణం నచ్చిందా అని అడిగింది. మురళి తనకి




స్కూలు బావుండలేదని చెప్పేశాడు. అతడికి పాత స్నేహితులను వదిలి వచ్చినందుకు ఎంతో బాధగా ఉంది. విద్యకి మాత్రం స్కూలు నచ్చింది. పెద్ద బిల్డింగు. లైబ్రరీ, ప్లేగ్రౌండ్ అన్నీ ఎంతో బావున్నాయి అని కళ్ళు తిప్పుతూ చెప్పింది.

విద్య తండ్రికి తణుకు నుండి పెదమెదంకి ట్రాన్స్ఫరు అయింది. పిల్లలని ఇబ్బంది పెట్టడం ఎందుకని భీమవరంలో మకాం పెట్టారు.

అనుకోకుండా ఆయనకి ఉండటానికి మంచి ఇల్లే దొరికింది. ఆయన స్నేహితుడు బేంకు ఉద్యోగి. బదిలీమీద వైజాగ్ వెళుతూ తన ఇంట్లో ఉండమని స్నేహితుడికి అప్పచెప్పారు.

విద్య కూడా తండ్రిలాగే స్నేహశీలి. జ్యోతిని చూసిన ప్రథమ పరిచయంలోనే విద్యకి మంచి అభిప్రాయం కలిగింది. కానీ ఆమె సరదా అంతా చల్లారిపోయే పరిస్థితులు ఏర్పడ్డాయి.



ఆ మర్నాడు రాణి స్కూలుకి ముందుగానే వచ్చింది. దీప్తి ఆ పిల్లని చూడగానే ఎంతో సరదా పడిపోయింది. రాణి స్కూలు మానేసిన రెండురోజులూ తనకి ఏమీ తోచలేదంది. సుధ అయితే నువ్వులేవు కానీ మన స్కూలుకి కొత్త అమ్మాయి వచ్చి చేరింది అని చెవిలో ఊదేసింది.

"ఏ క్లాసు'' అని యధాలాపంగా అడిగింది రాణి.

రాణి చాలా ఠీవిగా మాట్లాడుతుంది. మనిషి కూడా ఠీవిగానే ఉంటుంది. పచ్చటి పసిమిరంగు, ఉంగరాల జుట్టు. అయితే జుట్టు చాలా పొట్టి. రకరకాలుగా జడవేసికొని వస్తుంది. ఫాషన్లంటే చెప్పలేని పిచ్చి. మార్కెట్లోకి వచ్చిన ఏ కొత్త డ్రెస్సు అయినా సరే మొదట ఆమె దగ్గర ఉండవలసిందే.

ఆ రోజు పోనీటెయిల్ కట్టుకొని, పంజాబీ డ్రెస్ వేసికొని క్లాసుకి వచ్చింది. మెడలో చైను, ఒక చేతికి వాచీ, మరొక చేతికి నాలుగు బంగారు గాజులు వేసుకొంది.

"మన క్లాసే తల్లీ! ఏ మాటకి ఆమాటే చెప్పుకోవాలి. మనిషి బావుంటుందిలే" శైలజ ఉన్నది ఉన్నట్లు చెప్పేసింది.

"ఇది నల్లగా ఉంటుంది కదా, దీని కళ్ళకి అందరూ అందంగానే కన్పిస్తారు. అది సరే గానీ, దీప్తీ నువ్వు చెప్పు. ఆ అమ్మాయి నాకన్నా బావుంటుందా?''

రాణి మాటలు నోట్లోనే ఉన్నాయి, అంతలోనే విద్య క్లాసులోకి వచ్చింది.

ఈలోపు ప్రేయర్ బెల్ అయింది. అందరూ ప్రేయర్‌కి బయలుదేరారు. విద్యని ఏడిపించాలనే ఉద్దేశ్యంతో రాణి దీప్తి చెవిలో ఏదో ఊదింది.

"శుక్లాంబరధరం విష్ణుం" పిల్లలు ఇద్దరు వచ్చి దైవప్రార్థన చేశారు.

తర్వాత మరొక ముగ్గురు వెళ్ళి "వందేమాతరం" పాడారు. "ప్రతిజ్ఞ: విద్యాధరి ఎనిమిదవ తరగతి'' అని చెప్పాడు టీచర్.

రాణి వాళ్ళు- ఆసక్తిగా చూస్తున్నారు. కొత్త స్కూలు, కొత్త వాతావరణం గనుక తప్పకుండా విద్య కంగారుపడిపోతుందనుకొన్నారు. విద్య మొదట తనని కాదేమో అని అనుకొంది గానీ తర్వాత మళ్ళీ "విద్యాధరి, ఎనిమిదవ తరగతి'', అని ఎనౌన్సు చేయగానే తననే అని నిర్ణయించుకొని ముందుకి నడిచింది.



విద్య నోటిలోంచి ఇంగ్లీషు మాటలు రావటం మొదలయేసరికి పిల్లలందరూ గుసగుస కబుర్లు మాని ఆశ్చర్యంగా చూడసాగారు.

హెడ్మాష్టారు చిన్నగా నవ్వుతూ "విద్యా... ప్రతిజ్ఞ తెలుగులో చెప్పమ్మా!" అన్నారు. విద్య అలాగేనని తల ఊపి "భారతదేశము నా మాతృభూమి. భారతీయులందరు నా సహోదరులు'' అని చక్కగా స్పష్టంగా చెప్పసాగింది.

పిల్లలందరూ ఆ అమ్మాయి వెనుకనే ఒక్కొక్క వాక్యమే అనసాగారు. తెలుగు మాష్టారు ఎంతో సంబరపడ్డారు.

హెడ్మాస్టారు విద్య తన ప్లేసులోకి వెళ్లి నిలబడిన తరువాత ఇలాగ అన్నారు.

"చూడండి. మీరంతా ఎప్పుడూ ఏదో ఒక తప్పుతో ప్రతిజ్ఞ చేస్తారు. బాగా చదివి మరీ చెప్పాలని ఎన్నిసార్లు చెప్పినా విన్పించుకోరు. విద్యలాగ తప్పులు లేకుండా చెప్పాలి ప్రతిజ్ఞ. తెలిసిందా'' అని చెప్పి, క్లాసులకి వెళ్లిపొమ్మన్నారు.

రాణికి ఒళ్లు మండిపోయింది. పనిగట్టుకొని పదిమందిలో పొగిడేలాగ చేశానే అనుకొంది విద్య.

అదేం గమనించకుండానే స్నేహితురాళ్లతో కలిసి వెళ్లిపోయింది దీప్తి. క్లాసులో కూర్చున్నాక విద్య వెళ్లి, రాణికి తననితాను పరిచయం చేసుకుంది. రాణికూడా చచ్చినట్లు తననితాను పరిచయం చేసుకొంది.

జ్యోతిమాత్రం విద్యని మొహంమీదే అడిగేసింది "నీ అంతట నువ్వు వెళ్లి ఎందుకు పరిచయం చేసుకోవాలి? కొత్త అమ్మాయివికదా! తనే నిన్ను పలకరించవద్దా?"

విద్య జ్యోతివైపు ఒకసారి చూసి, నవ్వేసింది. "మీ స్కూలుకి, ఈ క్లాసుకి కొత్తగా వచ్చిన దానిని నేను. అందువలన మొదట నన్ను నేను పరిచయం చేసుకోవడం మర్యాద కదా! అయినా నా అంతట నేను వెళ్లినంత మాత్రాన కొంప మునిగినదేమిటి?" అని అడిగింది. విద్య మాటలు కస్తూరికి నచ్చాయి. జ్యోతి ఏమీ అనకుండా మౌనం వహించింది.

విద్య తనంతట తనే వచ్చి పరిచయం చేసుకోవడం రాణికి వింతగా అన్పించింది. రాణి ఆ వెంటనే తన పేరు కూడా చెప్పి, పరిచయం చేసుకొంటుందేమో అని విద్య ఒక్క నిముషం ఎదురు చూసింది. రాణి సుధవైపు చూసింది. ఆ చూపును అర్థం చేసికొన్న దానిలాగ సుధ "మా యం.ఎల్.ఏ.గారమ్మాయి. రాణి'' అని పరిచయం చేస్తున్నట్లు చెప్పింది. రాణికి ముగ్గురు అన్నయ్యలు. అబ్బో... అందరూ గొప్పవాళ్లే' అంది.

విద్యకి రాణిని చూస్తే నవ్వు వచ్చింది.

"సుధా! మీ యం.ఎల్.ఏ గారమ్మాయికి మాటలు రావా? మూగ అమ్మాయని నేను అనుకోలేదు. అయ్యో!" అని విద్య నిజంగానే సానుభూతిని చూపిస్తున్న దానిలాగ జాలిగా చూసింది.

రాణికి ఒళ్లుమండింది.

"షటప్... హౌ డేర్ యూ?" అని కోపంగా చూసింది. ఈలోపు తెలుగు మాస్టారు క్లాసుకి వచ్చేశారు. విద్య తన ప్లేసులోకి వచ్చి కూర్చుంది.

జ్యోతికి విద్య మాటలు నవ్వుని తెప్పించాయి. అమ్మో! ఈ అమ్మాయి భలే గమ్మత్తయినది అని అనుకొంది. విద్యమాత్రం అదేమీ ఎరగనట్లు పాఠంలో లీనమైపోయింది.

సైన్సు మేష్టారు పాత పాఠంమీద సైన్సుక్లాసులో ప్రశ్నలు వేయసాగారు. మగ పిల్లలలో కొందరు చురుకుగా సమాధానాలు చెపుతున్నారు. విద్య అలవాటు చొప్పున చెయ్యెత్తి తను చెపుతానన్నట్లు మేస్టారివైపు చూస్తోంది. ఆయన ఇటువైపే చూడటంలేదు. దానితో విద్య "మాస్టారూ! నేను చెపుతానండీ!" అని అడిగింది. ఆయన విద్యార్థులు అల్లరి చేస్తూండటంతో కేకలు వేస్తున్నారు. మధ్యలో విద్య అభ్యర్థన.




"ఆగు తల్లీ! నేను ఒక్కొక్కరిని అడిగి వస్తున్నానుకదా! ఈలోపే తొందరా?" అంటూ విసుక్కొన్నారు. విద్య మనసు చివుక్కు మంది. ఆ పిల్లకి ఇటువంటివి కొత్త. ఇదివర కటి స్కూల్లో మాస్టర్లు ఎంతో అపురూపంగా చూసేవారు. దానికి సాయం విద్య ఏడవ తరగతిలో విజ్ఞాన పారితోషికంకి కూడా ఎన్ని కైంది. అందుకే ఉపాధ్యాయులు విద్య స్కూ లు విడిచి వెళ్లిపోతూంటే బాధపడ్డారు. రాణి సైన్సు మాష్టారిని చూసింది. ఆయన చెప్పమ నకుండానే లేచి చెప్పేసింది.

సైన్సు మాస్టారు గొప్పగా సంతోషపడిపో యారు "ఎంత బాగా చెప్పావమ్మా! ఏమైనా నీ అంత చురుకుగా ఎవరూ చెప్పలేరు'' అంటూ ప్రశంసాపత్రం కూడా ఇచ్చారు.

రాణి నవ్వుతూ కూర్చుంది.

మళ్లీ ఆయన ప్రశ్నలు అడగడంలో మునిగి పోయారు.

స్కూలు వదిలిన తరువాత అందరూ బయటకి వచ్చారు. జ్యోతి నెమ్మదిగా విద్యతో అంది "ఎందుకు విద్యా! ఇందాక సైన్సు క్లాసులో అలాగ చెయ్యి ఎత్తిపట్టుకొన్నావు. అడగాలని ఉంటే మాస్టారు అడగరా?" అని.

విద్య అయోమయంగా చూసింది.

మాస్టారు అడిగిన ప్రశ్నలకు తనకి సమాధా నాలు తెలుసును. తాను చెయ్యెత్తి చెపుతానని అంటే తప్పు ఏమిటి? అదే అర్థమవక జ్యోతిని అడిగింది.

పల్లెటూరి స్కూలు విద్యార్థులే అలాగ బిహేవ్ చేస్తారని రాణి వేళాకోళం. అయినా ఆయన అడిగినప్పుడే చెబుదాం. నాకూ ఆ సమాధానాలు వచ్చును. అయినా నేను మాష్టా రికి చెపుతానని అభ్యర్థించానా?" అంది జ్యోతి.

విద్య సమాధానం చెప్పలేదు. బావుంది, ఈ కొత్త స్కూల్లో చాలా ఆంక్షలు ఉన్నట్లు న్నాయి. ఇలాగైతే ఏం బాగుంటుంది.

విద్య మౌనాన్ని గమనించిన కస్తూరి మాట మార్చేసింది. విద్య ఇల్లు దూరం కనుక సైకిలు కొనుక్కోమంది. విద్యకి తను నేర్పిస్తా నని చెప్పింది. విద్య జ్యోతివైపు చూసింది. జ్యోతి తనకి సైకిలు ఉందని చెప్పింది. రాణి స్కూటర్‌మీద వీళ్ల ముందునుండే వెళ్లిపో యింది.

విద్య ఇంటికి వచ్చాక తండ్రితో అన్ని కబుర్లూ చెప్పింది అలవాటు ప్రకారం. ఆయన కి విద్య ఏం చెప్పినా ఆసక్తే.

"మీ అమ్మాయి కబుర్లు వినడమేనా? లేక టిఫిను తినడం ఏమన్నాఉందా!" రాధమ్మ భర్తను వేళాకోళం చేసింది.

"ఏం నీ గారాల కొడుక్కు తప్ప మాకు ఆకలి ఉండదా?" ఆయన ఎదురు ప్రశ్నించారు నవ్వుతూ.

మురళి అప్పటికే టిఫిను తినేస్తున్నాడు. రాధమ్మ నవ్వుతూ ఇద్దరికీ తెచ్చింది. విద్య తండ్రికి తన స్నేహితులు సైకిలు కొనుక్కోమ న్నారని చెప్పింది. "నువ్వు జాగ్రత్తగా తొక్కగ లవా?" అని అడిగిందానికి తల్లివైపు నవ్వుతూ చూసింది.

"నాకు ఇప్పటివరకూ రాదు. నేర్చుకో వాలి'' అని చెపుతున్న విద్యను చూస్తూ సారధి "అయితే బజారు వెళ్లి కొనుక్కొని తెచ్చుకొందామా?" అని అడిగారు. రాధమ్మ వాళ్లవైపు విస్మయంగా చూసింది. ఎవరైనా సైకిలు నేర్చుకొన్నాక అప్పుడు కొనుక్కొంటా రు. వీళ్లేమిటి ఇలాగ? అదే అడిగేసింది.

"బావుంది. అందరూ ఒకేలాగ చెయ్యాలని రూలా? విద్య సైకిలు కొనుక్కొని, అప్పుడు నేర్చుకొంటుంది'' అని విద్యను తీసికొని బజా రుకి బయలుదేరారు. వాళ్లు వెళుతోంటే ము రళి సందిగ్ధంగా అన్నాడు "నాకూ నోట్సులు, బనీన్లు కావాలి'' అంటూ. ఆయన కొడుకుని కూడా బయలు దేరమన్నాడు.

విద్య తనకి కావలసినవి తండ్రినే అడుగు తుంది. మురళికి మాత్రం తండ్రి దగ్గర భయం తల్లితో చెపుతాడు తండ్రి వినేలాగ. ఆయన

కొని తెస్తారు. ఎంత చనువు ఇచ్చినా వీడు ఎందుకు ఇలాగ భయంగా దూరంగా ఉంటాడూ? అని ఆయన ఎప్పుడూ కొడుకు గురించి అనుకొంటారు. చదువు విషయంలో శ్రద్ధ చూపడని, ఆటల ధ్యాస ఎక్కువని ఆయన మురళిని కేకలు వేస్తూఉంటారు. అయినా అతడు ఆటలు మానడు.

ఈరోజు మాత్రం కూతురితోపాటు కొడుకు కూడా అడగడం సంతోషమే కలిగింది. దారిలో ఆయన స్నేహితులు ఇద్దరు ముగ్గురు కలిసి, యోగక్షేమం అడిగారు పిల్లలిద్దరినీ చూసి ముత్యాల్లాగ ఇద్దరూ ఎంత బావున్నారో అని మెచ్చుకొన్నారు.

ఆయన కొడుకుకి కావలసినవి కొని ఇచ్చారు. విద్యకి లేడీస్ సైకిలుకొన్నారు. పిల్లలకి వేరే స్వీట్లూ, పళ్లూ తీసుకొన్నారు. రాత్రి ఎనిమిది గంటలకి ఇల్లు చేరిన వాళ్లని చూసి రాధమ్మ 'బజారంతా కొనుక్కొని తెచ్చేశారా?' అని అడిగింది.

పిల్లలు ఉత్సాహంగా బజారు కబుర్లు చెప్పారు. వాళ్లు పడుకొన్నాక ఆవిడ అడిగింది జీతాలు వచ్చాక కొని ఇవ్వవచ్చునుకదా అని.

బాల్యం జీవితంలో మధురమైన ఘట్టం. ఎప్పుడైనా వెనుకకు తిరిగి చూసుకొంటే మధురమైన అనుభూతులే మనుష్యులకు మిగలాలి. నేను అడిగిన వస్తువు మా నాన్నగారు వెంటనే కొని ఇచ్చారు అనే తీయని జ్ఞాపకం బిడ్డలలో మిగలాలని ఆయన ఉద్దేశ్యం. అదే ఆవిడకు చెప్పారు. ఎప్పుడూ ఆయన పరిశీలనాశక్తి ఆవిడకి ఆశ్చర్యమే.

విద్యకి కొత్త స్కూల్లో చేరిన ఆనందం క్రమేపీ తగ్గుతోంది. స్కూలు వాతావరణం పరిస్థితులు ఆ అమ్మాయికి చిరాకు కల్గిస్తున్నాయి. మాష్టర్లు పాఠాలు చెప్పకపోవడం అన్నది లేదు. ప్రతీ మాష్టారూ చక్కగా చెపుతారు. కానీ ప్రతీ వాళ్లకీ ప్రైవేట్లు ఉన్నాయి. బడిపిల్లలు ఎక్కువ మార్కులు కావాలనుకొంటే ఆ మాష్టారి దగ్గరే చదవాలి. లేకపోతే అనేక సమస్యలు ఎదుర్కోవాలి.

విద్యకి అసలు ప్రైవేట్లు అంటే అలవాటు లేదు. సారథిగారి దగ్గరే ఆమె చదువు. తండ్రీ, గురువూ రెండూ ఆయనే. ఉదయం లేచి ఆయన దగ్గర కూర్చుని లెక్కలు, ఇంగ్లీషు చెప్పించుకొంటుంది. మిగిలినవి ఏవి తెలియలేదన్నా కూడా చెపుతారు. అందుకే విద్య కొత్త స్కూల్లో చేరినా ప్రైవేట్లకి వెళ్లలేదు.

సారథి సైన్సు అసిస్టెంటు అయినా లెక్కలంటే ఆసక్తి అవడం వలన చిన్నప్పుడు అవి బాగా చేసేవారు. ఉద్యోగ జీవితంలో లెక్కలు చెప్పవలసిన అవసరం లేకపోయినా డిగ్రీవరకూ లెక్కలు ఆయన అతిసులభంగా చేయగలరు. స్కూల్లో కూడా లీజర్ పీరియడ్‌లో ఆయన లెక్కలు చేస్తూనో, లేక ఏ సాహిత్య గ్రంథం చదువుకుంటూనో కన్పిస్తారు.

ఆయన లెక్కలు అర్థమయ్యేలాగ చెప్పడంవలన లోగడ ఆయన దగ్గరకి పిల్లలు పదవతరగతివరకూ ప్రైవేట్లకి వచ్చేవారు. ఇప్పుడు కొత్త చోటు, కొత్త వాతావరణంలో ఎవరూ రారేమోననుకొన్నారు. కానీ విద్యకి, మురళికి ఇంటి దగ్గర చెపుతూండటంతో నెమ్మదిగా ఆ వీధి పిల్లలు రావడం మొదలెట్టారు. అలాగ మళ్లీ ఆయనకి కొత్త బేచీలు తయారయ్యారు.

ఉదయం అయిదు గంటలనుండి ఆరున్నర వరకూ పదవ తరగతికి చెపుతారు. ఏడు గంటలనుండి ఎనిమిది వరకూ తొమ్మిదవ తరగతికి చెపుతారు. విద్య ఎనిమిది కనుక ఆ పిల్లకి విడిగా చెపుతారు.

స్కూల్లో చేరిన మర్నాడే జ్యోతి వాళ్లు విద్యని "ప్రైవేటులో చేరతావా?" అని అడిగారు. విద్య చేరనని చెప్పగానే వాళ్లు ఒకళ్ల మొహాలు ఒకళ్లు చూసుకొన్నారు. పైకి మాత్రం ఏమీ అనలేదు.

ప్రైవేటులో చేరని ఫలితం మార్కులు చూసుకొన్నాక తెలిసింది. విద్య ప్రైవేటులో చేరి ఉంటే ఎక్కువ మార్కులు వచ్చి ఉండేవని స్నేహితురాళ్లు అనగానే ఆ అమ్మాయికి




చిరాకు అన్పించింది.

మార్కులకి, ప్రైవేటుకి ఏమిటి సంబంధం? అని విద్య గొణుక్కుంది. క్లాసులో కూడా మాష్టారు పాఠాలు చెపుతూంటే వాళ్లు ఆసక్తిగా వినరు. ఇవతలివాళ్లని విననివ్వరు. ఏదో ఒకటి గొడవ పెడతారు.

ఒకరోజు కస్తూరి తెల్లటి జాకట్టు, పరికిణీ వేసికొని వచ్చింది. తెల్లసిల్కు పరికిణీ మెరుస్తూ ఎంతో బావుంది. కానీ మూడవ పీరియడ్ అయ్యేటప్పటికి పరికిణీ అంతా సిరాయే. ఎవరు బెంచీలో ఇంకు వంపారో తెలియలేదు. కస్తూరి ఏడుపు మొహం పెట్టుకొని మాష్టారికి ఫిర్యాదు చేసింది.

అది డ్రాయింగ్ మాష్టారి పీరియడ్. పిల్లలకి డ్రాయింగ్ మాస్టర్లన్నా, క్రాఫ్టు మాస్టర్లన్నా గౌరవం, భయం ఉండదు. కారణం బహుశ వాళ్లు సబ్జక్టు టీచర్లు కాకపోవడమేమో! అయితే ఈ డ్రాయింగ్ మాష్టారు చిన్నవాడు.

తన పీరియడ్ ఉన్నప్పుడు బెల్ అవగానే క్లాసుకి వెళ్లడం, సైన్సు బొమ్మలు గానీ, సోషల్ స్టడీస్ మేప్‌లు గాని బోర్డుమీద గీసి పుస్తకంలో పిల్లలను వెయ్యమనేవారు. ఇది చూసి పాత డ్రాయింగ్ మాష్టారు ఎందుకు రిటైరయినారా అని పిల్లలు బాధపడటం మొదలు పెట్టారు. అయినా మాష్టారు పట్టువదలలేదు.

వాళ్లచేత బలవంతంగా డ్రాయింగ్ పుస్తకాలు కొనిపించారు. బొమ్మలు వేయిస్తున్నారు. రాణీ వాళ్లు ఎంత గొణుక్కున్నా లాభం లేకపోయింది. వాళ్లు చెప్పిన కుంటిసాకులను ఆయన కొట్టిపారేసి, డ్రాయింగ్ చెపుతున్నారు.

ఆయనకి తన పీరియడ్‌లో పిల్లలు అందులో ఆడపిల్లలు ఇలా అల్లరి చేయడం నచ్చలేదు. అందుకే గట్టిగా కేకలువేసి పిల్లల్ని నిల్చోబెట్టి అసలు విషయం కనుక్కోబోయారు. కస్తూరి కూర్చున్న బెంచీ వెనుక కూర్చునేది రాణీవాళ్లే.

దీప్తి, సుధవాళ్లు తమకి అసలు ఇంకుపెన్నే లేదని దబాయించారు. తమ దగ్గర ఉన్నవి బాల్‌పెన్నులు కనుక తమకి ఆ సంగతి తెలియదన్నారు. కానీ మాష్టారు ఎవరినీ వదలలేదు. రాణిని కూడా నిల్చోబెట్టి అడిగారు.

ఇంటికి వెళితే తల్లి తిట్టడం మాట దేముడెరుగును ఆ పరికిణీతో ఎలా ఇంటికి వెళ్లడం అని కస్తూరి గొడవ.

ఈలోపు మగపిల్లల్లో లాస్ట్ బెంచీ అబ్బాయి తన ఇంకు సీసాలోని ఇంకంతా ఎవరో ఒంపేశారని ఫిర్యాదు చేశాడు. మాష్టారు ఆ కుర్రవాడిని ఇంకుబాటిల్ తీసికొని బడికి ఎందుకు రావాలని రెండు తిట్టారు. ఆయనకి ఆ పిల్లలని చూస్తే చిరాకు వేసింది.

ఇంట్లోకి కావాలంటే వాళ్ల నాన్నగారు కొని ఇచ్చారని, ఒంటిగంటకి ఇంటికి వెళ్లేటప్పుడు పట్టుకెళ్లిపోదామనుకొన్నానని వాడు గొడవ. ఇంకంతా ఏం చేశావని తండ్రి తిడతాడని వాడు మాష్టారికి ఫిర్యాదు. పర్యవసానంగా ఎవరు అతడి సంచిలోనుంచి సీసా తీశారో చెప్పనందుకు, ఇంకు బెంచీలో పోసి పాడుచేసినదెవరో తేలనందుకు మాష్టారు మగపిల్లలను బెంచీమీద, ఆడ పిల్లలను కింద పీరియడంతా నిల్చోబెట్టారు.

తప్పు ఎవరు చేశారో తెలుసుకోకుండా, అందరినీ ఎందుకు నిల్చోబెట్టాలని రాణి వాదన. ఆ పిల్ల తను నీరసంగా ఉన్నందువలన నిల్చోలేనని గొడవ చేసింది. అయినా మాష్టారు విన్పించుకోలేదు. రాణి మధ్యాహ్నం ఇంటి కెళ్లిపోయింది.

మర్నాడు రాణి చిన్నన్న మాధవ నాయుడు స్కూలుకి వచ్చాడు. హెడ్‌మాష్టారు అతడికి మర్యాద చేసి, ఆఫీసురూంలో కూర్చోబెట్టారు. విషయం తెలుసుకుని, తను డ్రాయింగ్ మేష్టారిని మందలిస్తానని భరోసా ఇచ్చారు.

ఈలోపు డ్రాయింగ్‌మాష్టారు సంతకం చేయడానికి అక్కడికి వచ్చారు. ఆయనను చూడగానే ఈయనేనా అని మాధవనాయుడు అడగడం, రాణి తల ఊపడం, దానితో అతడు ఆయనతో పోట్లాట పెట్టుకోవడం జరిగాయి.

డ్రాయింగ్ మాష్టారిదీ యువరక్తమే. తన

తప్పు లేకపోయినా వాళ్లు మాటలు అంటూంటే తను ఎందుకు పడాలని ఆయన ఉద్దేశం. అందుకే ఆయన విద్యార్థులు తప్పుచేస్తే శిక్షించే హక్కు తనకి ఉందని వాదించారు. అసలు రాణి, ఆ పిల్ల స్నేహితులే ఆ పనిచేసి ఉంటారని కూడా దెబ్బలాడారు. తన చెల్లెలు నిలబడలేనని, కళ్లు తిరుగుతున్నాయని అన్నా ఆయన విన్పించుకోలేదని, ఒక డ్రాయింగ్ మేష్టారు ఏం చూసుకుని అలాగా ప్రవర్తించాడని మాధవుడు గొడవ చేశాడు. పిల్లలందరూ ఈ గొడవకి మూగిపోయారు.

దానితో మేష్టర్లు అతడిపక్షం చేరిపోయి, మరొకసారి అతడి చెల్లెలి విషయంలో అలాంటి పొరపాటు జరగదని హామీ ఇచ్చి, అతడిని చల్లబరచి పంపేశారు. హెడ్‌మేష్టారికి ఈ గొడవ అంతా పీకమీదికి వచ్చినట్లనిపించింది.

ఇంగ్లీషు మేష్టారు వచ్చాక విషయం తెలుసుకొని డ్రాయింగ్ మేష్టారినే సమర్థించారు. ప్రతీ విషయంలో ప్రత్యేకత కావాలనుకొంటే వాళ్ల పిల్లల్ని స్కూలుకి పంపించడం ఎందుకని డ్రాయింగ్ మేష్టారి వాదన. హెడ్‌మేష్టారు అనుభవజ్ఞుడు కనుక ఇటువంటి గొడవలు పెద్దవాళ్ళతో పెట్టుకోవద్దని ఆ మేష్టారికి హితబోధ చేశారు.

'నిన్న ఇంకు అంటించుకొన్నావు. ఈరోజు ఏం అంటించుకొని తిరుగుతావే' అని సుధ శైలజని వేళాకోళం చేస్తూంటే కస్తూరికి కళ్లనీళ్లు తిరిగాయి. విద్యకి వాళ్లని, వాళ్ళ మాటలను చూస్తూంటే అసహ్యం వేసింది.

పాఠం అవుతున్నాసరే వాళ్లు గుసగుసలు పోతూ, మాట్లాడుతూనే ఉంటారు. కొందరు మేష్టార్లు అయితే "సైలెన్సు, సైలెన్సు" అని డస్టరు బల్లకి కొట్టి హెచ్చరిస్తూంటారు. అయినా కొంచెంసేపే మౌనం వహిస్తారు. తర్వాత మళ్ళీ మామూలే. కొందరయితే ఈ గొడవ ఏదీ పట్టించుకోరు. వాళ్ళ మానాన వాళ్లు చెప్పుకొనిపోతారు. విద్యకి, ఆమె ఫ్రెండ్సుకి ఇది చూస్తే చిరాకు కలుగుతుంది.

విద్యకి ఒకటే ఆశ్చర్యం. పాఠాలు సరిగ్గా వినకపోతే రేపు పరీక్షలు ఎలా వ్రాస్తారు? ఎలా పాసవుతారు? అని. ఇందిర విద్యను అమాయకురాలిని చూసినట్లు చూసి తర్వాత చెప్పింది. ఇంటి దగ్గరే ముందుగా పాఠాలు ప్రైవేటులో చెప్పించుకొంటారు. అంతా అక్కడే అయిపోతుంది కనుక క్లాసులో గొడవచేస్తారని.

"మరి, అందరూ ప్రైవేట్లకి డబ్బులు ఖర్చుపెట్టుకొని వెళ్ళి చదువుకోలేరుకదా" అని విద్య వాదన. అలాంటివాళ్లు పాపం క్లాసులో విని వ్రాయాల్సిందేకదా!

వాళ్ళని ఇబ్బందిపెట్టడం అవదా అని అడిగితే వాళ్ల ఖర్మ వాళ్ళదే అని సమాధానం.

స్కూల్లో జరిగే పార్లమెంటు అంటే అదనపు ఆకర్షణే పిల్లలకి. సోషల్‌మేష్టారు ఎంతో చక్కగా పార్లమెంటు సమావేశాలు నడిపించేవారు.

విద్య స్కూల్లో చేరేటప్పటికే పార్లమెంటు నిర్మాణం జరిగిపోయింది. నమూనా పార్లమెంటు అంటే పిల్లలు నిజంగా తామే రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి, ప్రధానమంత్రి, స్పీకర్ పదవులను నిర్వహిస్తున్నట్లే ప్రవర్తించేవారు. ప్రతిపక్షనాయకుడిగా పదవతరగతి విద్యార్థిని ఎన్నిక చేశారు. అతడు చాలా తెలివైనవాడు, చురుకైనవాడు, జ్యోతి మొదలైనవారు ప్రతిపక్షసభ్యులు- కొత్త స్కూల్లోని ఈ నమూనా పార్లమెంటు విద్యకి ఎంతో నచ్చింది.

స్కూలుకి ఒక సర్క్యులర్ వచ్చింది. లైన్సుక్లబ్‌వాళ్లు నెహ్రూ జన్మదిన సందర్భంలో పాటల పోటీలు, క్విజ్ కాంపిటీషన్, ఉపన్యాసాలు నిర్వహిస్తున్నారనీ, ప్రతి పాఠశాలనుండి విద్యార్థినీ, విద్యార్థులను ఎంపికచేసి పంపించవలసిందని వ్రాశారు. ఇంటర్ స్కూలు పోటీకి పంపటంకోసం మొదట విద్యావాళ్లు స్కూల్లో మర్నాడు పోటీలు నిర్వహిస్తామని చెప్పారు.

పాటల పోటీలో దేశభక్తిగీతాలు దేశనాయ




కులకి సంబంధించిన పాటలు మాత్రమే పాడ వలెనని నిర్ణయించారు. పిల్లలు ఆ సర్క్యులర్ రాగానే మర్నాటినుండీ ప్రారంభమయ్యే పోటీలలో పాల్గొనటానికి హడావిడి పడసాగారు.

సాయంత్రం విద్య ఇంటికి వెళ్ళగానే తండ్రి చెవిలో ఆ వార్తను వేసింది. తను పాటల పోటీలో, క్విజ్ పోటీలో, ఉపన్యాసంలో పాల్గొంటానని చెప్పింది. ఆయన నవ్వుతూ సరేనన్నారు. విద్య తండ్రి దగ్గర ఉపన్యాసానికి కొన్ని విషయాలు అడిగి తెలుసుకొంది.

సారథిలో ఒక సుగుణముంది. ఇంట్లోగాని, స్కూల్లోగాని ఏ విషయమైనా, ఏ విద్యార్థి అయినా అడిగినప్పుడు ఓపికగా వాటి గురించి చెబుతారు. ఏనాడూ ఎవరినీ నిరుత్సాహపరచరు. అందులో విద్య అంటే ఆయనకి ఎక్కడ లేని ఆసక్తి. ఏది అడిగినా ఎంతో ఉత్సాహంగా చెబుతారు.

జనరల్‌గా లైన్స్‌క్లబ్ వాళ్లు ఏ విషయాలు ఉపన్యాసానికి ఈయవచ్చునో ఆయన ఊహించారు. భారతదేశం గురించి, జాతీయ సమైక్యత గురించి, దేశనాయకుల గురించి అన్నీ విద్యకి వివరంగా చెప్పారు. భయపడకుండా, ఆగకుండా ఓ క్రమంలో ఒక్కొక్క విషయమే చెప్పాలన్నారు.

విద్యకి ఇలాంటి పోటీలంటే ఎంతో ఇష్టం. అందుకే తండ్రి దగ్గర విషయసేకరణ అయ్యాక, తల్లిని పాటలు చూడమని పిలిచింది. విద్య ఎంచుకున్న రెండు పాటలను వరుస తప్పకుండా ఎలా పాడాలో రాధ చెప్పింది.

మర్నాడు కాస్త పెందరాళే పిల్లలు స్కూలుకి బయలుదేరారు. జ్యోతి, శక్తి, కస్తూరి, రాణి అందరూ అప్పటికే వచ్చివున్నారు. రాణికి హిందీ మేడమ్ పాట నేర్పిస్తున్నారు. మిగతా పిల్లలు వింటున్నారు. విద్యార్థినీ విద్యార్థులు చాలామందే పాల్గొన్నారు. విద్య "పండిట్ నెహ్రూ పుట్టినరోజు, పాపలందరికి పండుగరోజు'' అంటూ పాడింది.

పదవతరగతి అమ్మాయి "శ్రీలు పొంగిన జీవగడ్డయు, పాలు పారిన భాగ్యసీమయు'' అన్న దేశభక్తి గీతం పాడింది.

రాణి "నాదు జన్మభూమికన్న నాకమెక్కడుందీ? సురలోకమెక్కడుందీ'' అనే పాట పాడింది.

పోటీలో పాల్గొన్నప్పుడు పాట మధ్యలో ఆగకూడదు. బెక్కకూడదు. గుటకలు మింగినా పాట ఆగిపోతుంది. దాంతో ప్రైజు పోతుంది. అని ముందుగానే హిందీమేడమ్ పాల్గొన్న వారినందరినీ హెచ్చరించారు.

రాణి పాట మధ్యలో ఆగిపోయింది అరనిమిషం. తర్వాత గుర్తుతెచ్చుకొని పాడింది. పిల్లలందరూ విద్య, పదవతరగతి అమ్మాయి సెలక్టవుతారనుకొన్నారు. మగపిల్లలు పాడినా వీళ్లదే ఎక్కువ బావుందనుకున్నారు.

కానీ తొమ్మిదవతరగతి చదువుతున్న సైన్సుమేష్టారి అబ్బాయిని, రాణిని పాటలకి సెలక్టు చేశారు. అది తెలీగానే పదవతరగతి అమ్మాయి అక్కడే ఏడ్చేసింది. పాట మధ్యలో ఆగినా రాణినే ఎందుకు సెలక్టు చెయ్యాలని విద్యార్థులు గొణుక్కున్నారు. విద్య పాట అందరికీ నచ్చింది. అందుకే అందరూ ఆ అమ్మాయివైపు సానుభూతిగా చూశారు.

విద్యకి మనసులో కష్టంగా ఉన్నా, పైకి మామూలుగానే ఊరుకొంది. ఉపన్యాసంలో మాత్రం విద్యను, పదవతరగతి అబ్బాయిని సెలక్టు చేశారు. విద్య ధైర్యంగా అబ్బాయిలకన్నా బాగా చెప్పింది. మిగిలిన అమ్మాయిలు కాస్త భయపడిపోయారు. అబ్బాయిలలో పదవతరగతి వారికే ఎక్కువ పాయింట్లు వచ్చాయి.

క్విజ్ కాంపిటీషన్‌కి ఒక గ్రూప్ వేశారు. దానిలో జ్యోతి కూడా ఉంది. పిల్లలందరూ మర్నాడు జరగబోయే పోటీ ఉత్సాహంలో ఉన్నారు. విద్య ఇంటికి వచ్చి ఉపన్యాసంలో తను స్కూలు తరపున వెళుతున్నానని, తండ్రిని కొన్ని విషయాలు చెప్పమంది.

ఆయన చాలా విషయాలు చెప్పారు.

మర్నాడు క్లబ్‌లో పోటీలు ప్రారంభమయ్యాయి. పావుగంటముందే టాపిక్ ఇచ్చి "నవభారత నిర్మాత జవహర్‌లాల్ నెహ్రూ' అన్న విషయంపై విద్యార్థులను సిద్ధమవమని చెప్పారు. విద్యకి ఎంతో ఆనందంగా అన్పించింది. తండ్రి ఊహించి చెప్పిన వాటిలో అదొకటి. పదవతరగతి రాజేష్ విద్యతో కలిసి కొన్ని పాయింట్లు చర్చించాడు.

స్కూళ్లనుండి వినడానికి చాలామంది పిల్లలే వచ్చారు. కొన్ని స్కూళ్ళవాళ్లయితే మరీ పెద్ద పిల్లలుగా ఉన్నారు. కొందరు పిల్లలు చేసే అల్లరికి నిర్వాహకులు దెబ్బలాడి, ప్రశాంతంగా ఉంచారు. చాలా స్కూళ్ళనుండి పిల్లలు పాల్గొనేందుకు వచ్చారు. విద్యలాగా పాల్గొన్న అమ్మాయిలు మాత్రం ఆరుగురే. విద్య ఎన్నో విషయాలను వరుస క్రమంలో చెప్పింది. చిన్న చిన్న మాటలతో అందరికీ అర్థమయ్యేలాగా చెప్పింది.

అంత బాగా ఆ అమ్మాయి మాట్లాడగలదని వాళ్లు ఊహించలేదు. విద్యకి, ప్రథమ బహుమతి, ఆర్.సి.యం. బోయ్స్ అబ్బాయికి రెండవ బహుమతి, రాజేష్‌కి మూడవ బహుమతి వచ్చాయి.

పాటల పోటీ ప్రారంభమయింది. ముగ్గురు జడ్జీలు కూర్చుని వింటున్నారు. పిల్లలు వరుస క్రమంలో పాడుతున్నారు. రాణి వంతు వచ్చేసరికి పేరు చెప్పారు. "రాణీ పద్మనాభనాయుడు'' అని పిలిచి స్కూలు పేరు, క్లాసు చెప్పారు.

పేరు వ్రాసుకొంటున్న జడ్జీలు ఒక్కసారి కళ్ళెత్తి ఆ పిల్లవైపు చూశారు. "అంటే ఈ పాప..." ఒకాయన సందిగ్ధంగా ఆగిపోయాడు. వెంటనే వాళ్ళకు ఎస్కార్ట్‌గా వచ్చిన సత్యం మేష్టారు అందుకొన్నారు.

"మన యం.ఎల్.ఏ.గారి అమ్మాయండీ! నేను అనుకుంటూనే ఉన్నాను. మీరు గుర్తించేస్తారని'' అని ఒక వెకిలినవ్వు నవ్వేశారు. జడ్జీలలో మొదటి ఆయన గర్వంగా తల ఎగరవేశారు మరేమిటనుకున్నావు నేనంటే అన్నట్లు.

"నువ్వు పాడమ్మా!" అంటూ వాళ్ళు ముగ్గురూ సర్దుకొన్నారు. రాణి వెళ్లి మైకు చేత్తో పట్టుకొని తన పాట పాడేసింది. తర్వాత మిగిలిన పిల్లలని పిలిచారు. రాణి పాడి వచ్చేశాక "ఎలా ఉంది పాట?" అని అడిగింది.

స్కూల్లోలాగా ఆగకుండా పాడినందుకు రాజేషు మనసులో సంతోషించాడు. "ఎలా ఉందంటే చెప్పడానికి ఇంతసేపు ఆలోచనా?" రాణి కంఠం తీవ్రంగా పలికింది. "నాకైతే బావుంది. నేను జడ్జీని కానుగా?" రాజేషు వెంటనే చెప్పేశాడు. అతడు భయంగా అన్న తీరుకి విద్య, రాణి ఇద్దరూ నవ్వేశారు.

"అందరిలోకి ఆఖరున పాడిన యు.పి. స్కూలు అమ్మాయి పాట అద్భుతంగా ఉందని, తప్పక ఆ అమ్మాయికి బహుమతి వస్తుందని అందరూ అనుకున్నారు. జడ్జీలు ముగ్గురూ తమ తమ కాగితాలలోని మార్కులు కలిపి ఒకచోట వేశారు.

రాణి స్కూలునుండి సెలక్టయిన అమ్మాయి క్విజ్ కాంపిటేషన్‌కి ఉండకుండా వెళ్లిపోయింది. ఆ అమ్మాయికి బాగా జ్వరం వచ్చేసింది. ఏం చేయడమా అని సత్యంమేష్టారు ఆలోచనలో పడ్డారు.

సుధీర్ మాత్రం వెంటనే చెప్పాడు "విద్యని మా టీమ్‌లో వేయండి. ఇంతవరకూ వచ్చి పాల్గొనకుండా ఇంటికి వెళ్ళడమా?" అని. అనుకోకుండా విద్య అలా క్విజ్ టీములో చేరవలసివచ్చింది. రాణికి మ్రింగలేనట్టు కక్కలేనట్టు అయిపోయి ఏమనలేక ఊరుకొంది.

సుధీర్ ముందుగానే విద్యకి, కమలేషుకి చెప్పేశాడు. తనకి వీలైనంతవరకూ తనే జవాబులు చెబుతానని, తనకి తెలియనివి ఉంటే, వాళ్లు చెప్పవచ్చునని చెప్పాడు. సందిగ్ధంగా ఉన్నవి మాత్రం తనకి చెప్పి, చెప్పమన్నాడు. తమలో పెద్ద తరగతి అబ్బాయి కనుక మిగిలి




నవాళ్లు ఒప్పుకున్నారు.

క్విజ్ ప్రారంభమయ్యాక మూడు రౌండ్లు నడిచాయి. మొదటి రౌండులో సుధీర్ టీము వెనకపడ్డా, రెండవ, మూడవ రౌండ్లులో బాగా నిలబడింది. విద్యకి క్విజ్ కొత్త. అయినా క్లాసుమాస్టారు పాఠాలకి సంబంధించి ప్రశ్నలు వేస్తున్నట్లే అన్పించింది. అందుకే ఆసక్తిగా పాల్గొంది.

సుధీర్ టీము పోటీలో రెండవ బహుమతి పొందింది. పాటల పోటీలు రిజల్ట్సు కూడా చెప్పేశారు. రాణికి ప్రథమ బహుమతి వచ్చింది. నిజానికి రాణికన్నా గర్ల్సు ఆర్.సి.యం. పిల్లలు ఇద్దరూ బాగా పాడారు. కానీ వాళ్ళకి థర్డ్, కన్సొలేషన్ ఇచ్చారు. వాళ్ళ దగ్గరికి వెళ్లి వాళ్ళ ప్రైజ్ చూశాడు తను. రాణి ఏం అనుకుంటుందో అని రాజేషు భయం.

సుధీర్, రాజేషు ఆడపిల్లల వెనుక నడుస్తున్నారు. తిరిగి వచ్చేస్తున్నప్పుడు సుధీర్ నెమ్మదిగానే అయినా స్ఫుటంగా ఉన్న గొంతుకతో అన్నాడు "అవునురా! పోటీలో రాణి ఎందుకు తండ్రి పేరుతో తన పేరు చెప్పించుకుంది. యం.ఎల్.ఏ. కూతురిని సుమా నాకు ప్రైజ్ ఇవ్వకపోతే ఊరుకోను. అని హెచ్చరిక చేసేందుకు అలా చెప్పిందా?" అని.

రాజేషుకి ఒకపక్క భయంగా ఉంది. రాణి ఎక్కడ వింటుందో అని. వద్దన్నా వినకుండా వాగుతాడు. అని స్నేహితుడిని తిట్టుకొన్నాడు.

చెప్పేంతవరకూ సుధీర్ ఊరుకొంటే అతడి గొప్ప ఏమిటి? మళ్ళీ అడిగాడు. రాజేష్‌కి పెదవి విప్పక తప్పలేదు. బాగా హైక్లాసు ఫామిలీలలో పెళ్లికాని ఆడపిల్లలు తమ పేరు చివర తండ్రి పేరు పెట్టుకొంటారు. పెళ్లి అయినవారయితే భర్త పేరు పెట్టుకొంటారు. అని చెప్పేశాడు.

"యం.ఎల్.ఏ.గారిది హైక్లాసు ఫ్యామిలీ యేలే! అందుకే ప్రైజులు వదలరు'' అంటూ సుధీర్ పరిహాసమాడాడు. రాణి సుధీర్ మాటలన్నీ వింది. వెనక్కితిరిగి హేళనగా చూస్తూ "ఏనుగు వెళ్లిపోతుంటే వందకుక్కలు మొరుగుతాయట. ఇలాంటివాటిని ఏనుగు లెక్క చేస్తుందా?" అంటూ ముందుగా నడుస్తున్న మాష్టారితో నడవడం మొదలెట్టింది.

విద్యకి రాణి ధైర్యం చూస్తే ఆశ్చర్యం అన్పిస్తుంది. ఎవరినైనా సరే ఎంతమాటైనా సరే అనేస్తుంది. మగపిల్లలని అలా అనడం, వాళ్ళతో దెబ్బలాడటం బావుంటుందా? రాజేషు మాటలతో విద్య ఈ లోకంలోకి వచ్చింది.

రాజేషు తనకి ఉపన్యాసంలో విషయాలు కొన్ని చెప్పి, తనని ఉత్సాహపరిచినందుకు విద్యకి అభినందనలు తెల్పాడు. ఒక స్కూలు నుండి వచ్చినవాళ్లు ఐకమత్యంగా ఉండి ఒకరికి ఒకరు సహాయపడవద్దా అని విద్య వాదన. ఇంక ఆ అబ్బాయి ఏమీ మాట్లాడలేక పోయాడు.

హెడ్‌మేష్టారుగారు ఎంతో సంతోషించారు. తమ స్కూలు పిల్లలు అన్ని ప్రైజులు తేవడం ఆయనకి చాలా ఆనందం కలిగించింది. విద్య క్విజ్‌లో తమ బేచ్‌లో సగం ప్రశ్నలకు ఆన్సర్లు చెప్పిందని, అందువలన గెలవగలిగామని సుధీర్ హెడ్‌మేష్టారికి చెప్పాడు.

తెలివైన, ఉత్సాహమైన అమ్మాయి తమ స్కూలుకి వచ్చినందుకు ఆయనకి సంతోషమన్పించింది. విద్యని ప్రత్యేకంగా అభినందించారు. ఒకరకంగా ఈ పోటీలవలన విద్య అందరికీ తెలిసింది.

సుధీర్ రాణిని ఎక్కువగా ఇష్టపడడు. ఆమెను క్విజ్‌టీమ్‌లో తన బేచ్‌లో సత్యంమేష్టారు వేసినప్పుడే అనుకొన్నాడు ఇదేమిటిరా బాబూ అని. పైకిమాత్రం ఏమీ అనలేక ఊరుకొన్నాడు. ఎలాగో ప్రైజు కొట్టుకొచ్చామనుకొని సంతోషించాడు.

విద్య క్విజ్‌టీమ్‌లో పాల్గొందని తెలిసి రాణిమీద ఎగిరింది దీప్తి.

సారథిగారు కూతురికి వచ్చిన ప్రైజులు చూసి సంతోషపడ్డారు. "ఏమోయ్! నా కూతురు చూశావా ఎలా అందరిచేతా శభాష్

అన్పించుకుందో?" అని భార్యను పిలిచి గొప్ప గా చెప్పారు.

"అవునవును... ఏదైనా మంచివి జరిగితే మీ కూతురు, మీ కొడుకు. వెధవ పనులు చేస్తే నా కొడుకు కదూ! ఎంత స్వార్థపరులండీ మీరు'' అని ఆవిడ దెప్పింది.

ఆవిడ చెప్పింది నిజమే. మురళి సైకిలు పాడుచేసినా, ఇంట్లో వస్తువులు పాడుచేసినా ఆయన అలాగే అంటారు. ఏదిఏమైనా విద్య తన భావాలకి వారసురాలని ఆయన నమ్మకం. మురళికి ఎంత చెప్పినా ఎందులో నూ పాల్గొనడు.

సారధిగారు విద్యాభ్యాసం చేసిన ఊరు భీమవరం. ఆయనకి ఆ ఊర్లో మంచి స్నే హితులే ఉన్నారు. ఉద్యోగరీత్యా అటూ, ఇటూ తిరిగి మళ్ళీ అక్కడికి రావడం ఆయనకి ఆనందంగానే ఉంది.

కానీ అప్పటికి, ఇప్పటికి ఊళ్ళో చాలా మార్పులు వచ్చేశాయి. ఆ రోజుల్లో ఎవరికీ కీర్తి తాపత్రయం ఉండేదికాదు. ప్రతిభ, సమ ర్థత ఉన్నవాళ్ళు మాత్రమే ఉన్నత శిఖరాలు అధిరోహించగలిగేవారు. వారి కృషి, సామ ర్థ్యం చూసి సంఘంలోనివారు అంజలి ఘటించేవారు.

ఈనాడు అవన్నీ పోయాయి. కళలలో డాబు, దర్పం చోటుచేసుకొన్నాయి. ఆవ గింజంత ప్రతిభ ఉంటే ఆకాశాన్ని అందుకోవా లని ఆశిస్తున్నారు. సారధిమాత్రం ఏం చేయగ లరు? సమాజంలోని మార్పులకి ఆశ్చర్యపో తున్నారు.

సారధితో బి.యస్.సి. చదువుకొన్న గిరిధర్ ఆ రోజులలో ఎందుకూ పనికిరాడనుకొన్నారు. బి.యస్.సి.యే నాలుగుసార్లు తప్పి, ఎలాగో అయిందన్పించాడు. సామాన్య కుటుంబంలో పుట్టిన అతడు, చదువుని నిర్లక్ష్యం చేయడం సారధివాళ్ళకి నచ్చేదికాదు. పై చదువుకి సారధి వెళ్ళిపోవడంవలన తర్వాత అతడి విషయాలు తెలియలేదు. ఇన్నాళ్ళకి మళ్ళీ కలిశారు.

ఈరోజు ఆ వ్యక్తి ఒక పుర ప్రముఖుడయ్యా డంటే ఆయనకి ఆశ్చర్యంగా ఉంది. గిరిధర్ వచ్చి తమ 'సాహిత్యసుధ' సంస్థలో వార్షికో త్సవం జరుగుతోందని, తప్పక రమ్మని, సాహిత్యంలో పేరు పొందినవారు వస్తున్నా రని చెప్పి ఆహ్వానించి వెళ్ళాడు.

సారధికి సాహిత్య సమావేశాలంటే ఎంతో ఆసక్తి.

సారధికి విద్యనేర్పిన గురువులు తక్కువ వారు కారు. తెలుగు సాహిత్యంలో ఎంతో నిష్ణాతులైనవారు. అటువంటి గురువులవద్ద శుశ్రూష చేయడంవలననే అంతో, ఇంతో సాహిత్యాభిలాష కలిగిందని సారధి ఎప్పుడూ అనుకొంటారు.

మర్నాడు ఆయన సాహితీసంస్థ వార్షికోత్స వానికి వెళ్ళడానికి బయలుదేరుతున్నారు. విద్య మొహం కడుక్కొని వచ్చి, తల్లిచేత జడ వేయించుకొంటోంది. తండ్రి ఎప్పుడోగానీ పంచె, లాల్చీ ధరించరు. ఆరోజు ఆయన తయారవుతోంటే విద్య వెంటనే అడిగింది "నాన్నగారూ! నిన్న అంకుల్ వచ్చి పిలిచారే! అక్కడికేనా వెళుతున్నారు'' అంటూ.

సారధి రుమాలు తీసి జేబులో పెట్టు కొంటూ అవునని తలూపారు.

విద్య ఆయనవైపు ఉత్సాహంగా చూస్తూ తను కూడా వస్తానంది.

ఆయన ఒక్కక్షణం ఆ అమ్మాయిని తేరి పార చూశారు. విద్య విశాలమైన కనుదో యిలో ఏదో తెలియని జిజ్ఞాస, కాంతి ఆయనకి కన్పించాయి. తండ్రి మౌనాన్ని గమనించిన విద్య తనకి ఆరోజు రాతపని ఏమీ లేదని, ఉదయం లేచి చదువుకొంటానని చెప్పింది. సారధి పెదవులపై చిరునవ్వు కదలాడింది. కూతురు తన మనసులోని విషయాన్ని గ్ర హించగలిగనందుకు కలిగిన ఆనందమది.

విద్యని ఆ సమావేశానికి తీసికెళ్ళకుండా ఉంటే ఆమె జీవితం మామూలుగానే గడిచే




# ఏరిన ముత్యాలు

★ ప్రేమకు రెండు లక్షణాలున్నాయి. ఒకటి బాహ్య ప్రపంచాన్ని మర్చిపోవడం, రెండు తనని తాను మర్చిపోవడం.

— రామకృష్ణ పరమహంస

★ నిన్నెవరూ ప్రేమించకపోతే అది నిశ్చయంగా నీతప్పే అని తెలుసుకో.

— డాడ్రిజ్

★ ప్రేమికుల కయ్యాలు వేసవికాలపు వర్షాల్లాంటివి. అవి వెలవగానే మరింత అందం సంతరించుకుంటుంది.

— మాడ్నెకెల్

★ 'ప్రేమ' అనేదానిలో ఒకేఒక సూత్రం ఉంది. అది నువ్వు ప్రేమించిన వారిని సంతోషపెట్టడం.

— స్టెన్‌తాల్

★ తను చెయ్యగలిగినంతా బాహాటంగా అందరి ఎదుట చెయ్యడమే నిజమైన ధైర్యం.

-- లారొచెఫొకాల్డ్

★ నీ జీవితానికి ఒక లక్ష్యం ఏర్పరచుకో. ఆ తరువాత నీ శారీరక మానసిక శక్తుల్ని అందుకోసం వినియోగించు.

-- కార్లైల్

★ చేసే పనిమీద లక్ష్యం, గౌరవం లేకుండా కేవలం డబ్బు సంపాదన కొరకే పనిచేసేవాడు సంపన్నుడు కాలేడు. కనీసం జీవితాన్ని కూడా అనుభవించలేడు.

-- ఛారెస్‌స్క్వాబ్

★ ఒక వ్యక్తి తన గుణగణాలను గూర్చి ఎంతతక్కువగా తెలునుకుని ఉంటే, అతణ్ణి అంత ఎక్కువగా ఇష్టపడటం జరుగుతుంది. అలాకాక తన గొప్పలను గురించి ఎంత ఎక్కువగా చెప్పుకుంటే అంత తక్కువగా అతణ్ణి గౌరవించడం జరుగుతుంది.

— ఎమర్సన్

★ తెలివైనవాడెప్పుడూ తాను తెలుసుకున్నది ఎంత తక్కువో గ్రహించగలుగతాడు. అవివేకి మాత్రమే తాను సర్వజ్ఞుడినని భ్రమిస్తాడు.

— నెహ్రూ

★ వివేకహీనునికి శాస్త్రజ్ఞానం, గుడ్డివానికి తన చేతిలోని దీపంవలె నిష్ఫలం

— నీతిచంద్రిక

★ సత్యం చెప్పులు తొడుక్కునే లోపుగా అసత్యం భూ ప్రదక్షిణం చేసి వస్తుంది.

--C.H. స్పర్‌గోన్

★ సత్యమెప్పుడూ చప్పగా ఉంటుంది. అసత్యం పసందుగా ఉంటుంది. కాకి ఎగిరిందనేమాట కంటే మేక పులిని మింగిందనే మాట ఆసక్తికరంగా ఉంటుంది.

— పానుగంటి

సేకరణ: నలబెల్లి శ్రీమన్నారాయణ




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

జూలై చతుర నవల భేటీ

సమీక్షకుని పేరు : ....................................................

చిరునామా : ....................................................

....................................................

....................................................

....................................................

దేమో! ఆ సమావేశం ఆ అమ్మాయిలో అంత భావావేశాన్ని కలిగిస్తుందని సారధి ఊహించ లేదు. అసలు ఆయనలోమాత్రం అంతటి ఆవేశం నివురుగప్పిన నిప్పులాగ ఉందని ఎవరికి తెలుసును? ఆరోజుతో అందరికీ సారధి అంటే ఏమిటో అర్థమైంది.

తన ఆహ్వానాన్ని పురస్కరించుకొని స్నేహితుడు వచ్చినందుకు గిరిధర్ ఎంతో పొంగిపోయాడు. మీటింగ్‌కి వచ్చిన మిత్రులందరికీ సారధిని పరిచయం చేశాడు. కొంతమంది సారధికి ఇదివరకు తెలిసినవాళ్ళే. ఆరోజు ప్రధమంగా అతనికి సుదర్శననాయుడు పరిచయం అయ్యాడు. ఆరోజు మీటింగ్‌కి అతడే అధ్యక్షుడు.

ఎం.ఎల్.ఏ.గారి పెద్దకొడుకు సుదర్శన నాయుడు డాక్టరు. అతడు సాహిత్యసుధ సంస్థకి అధ్యక్షుడట. జ్ఞానేశ్వరరావు అతనికి గురువుగారట. అందుకని సంస్థ వార్షికోత్సవానికి వచ్చి ఆంధ్రకవితా పితామహుడు అయిన పెద్దనపై మాట్లాడమన్నారట. ఆరోజు ఆయనకి సన్మానం కూడా చేస్తున్నారట. మీటింగ్ తర్వాత నృత్యప్రదర్శన, నాటిక ఉన్నాయి.

సభ ప్రారంభమైంది. గిరిధర్ వేదికనెక్కి తను సెక్రెటరీగా ఎన్నికైన తర్వాత సాధించిన పురోభివృద్ధి గురించి చెబుతున్నాడు. మాటిమాటికి జేబులోని రుమాలును తీసుకుంటూ లేని చెమటను తుడుచుకోవడాన్ని అభినయిస్తూ ఈకాలిపై ఒకసారి, ఆకాలిపై ఒకసారి వాలిపోతూ తమ సంస్థను పొగుడుకుంటూ ఎలాగైతేనేం అతడు ఉపన్యాసం పూర్తిచేశాడు.

జ్ఞానేశ్వరరావుని పరిచయం చేయడానికి మరొక పురప్రముఖుడు వేదికమీదికి వచ్చాడు. కవిత్వంమీద ఆయన పెద్దఎత్తున పి.హెచ్‌డి. చేశాడని, పెద్దన నాడి ఆయనకి తెలిసినట్లుగా అన్యులకు తెలియదని, ఆయనే పెద్దనయని, పెద్దనే ఆయన అని తనకు వీలైనంత ఆకాశానికి ఎత్తేస్తూ పొంగిపోయాడు. అతడి ఉపన్యాసం అవుతున్నంతసేపూ జ్ఞానేశ్వరరావు కళ్ళు నక్షత్రాలుగా మెరిశాయి.

ముఖ్య వక్తగా జ్ఞానేశ్వరరావు ఉపన్యాసం ప్రారంభించాడు. ప్రాచీన కవిత్వం చాలా గొప్పదని, చాలా ఉత్కృష్టమైనదంటూ ప్రారంభించాడు. రాయల కాలంలో వెలసిన ప్రబంధములు ఏనాటికీ వాడని కుసుమాలని, పాఠకులను వీడని ఉత్తమ గ్రంథాలని చెప్పాడు. అందరూ ఎంతో శ్రద్ధగా వింటున్నారు.

శ్రీకృష్ణదేవరాయలుకి పెద్దనపై గౌరవం ఎక్కువని, అందుకే 'ఎదురైనచోఁ తన మదకరీంద్రము డిగ్గి, కేలూతయొసగి యెక్కించుకొనియె...' అన్న పద్యము చదివి వివరణ ఇచ్చారు.

పెద్దన రాజసము గురించి, కవితానైపుణ్యం గురించి, పాత్ర చిత్రణ గురించి జ్ఞానేశ్వరరావు విజృంభించి మాట్లాడుతున్నాడు. అందరూ తన ఉపన్యాసం జాగ్రత్తగా వినడంతో ఆయనకు ఉత్సాహం ఎక్కువైపోయింది. దీనితో ప్రాచీన కవులను అర్థంచేసుకోవడం చాలా కష్టమని, వారి కవిత్వం అందరికీ కొరుకుడు పడేది కాదని, దానికి ఒక తపస్సు అవసరం అని చెప్పడం మొదలుపెట్టాడు.

"అంతెందుకు, కవిని ప్రసన్నం చేసుకోవడం, కావ్యాన్ని అర్థంచేసుకోవడం సామాన్యమైన పనా? ఒక జీవితకాలం పని. ఈ విషయంలో నేను దానికి అర్హుడనని చెప్పుకోవడానికి చాలా సంతోషిస్తున్నాను. ఏ కవులనైనా ఇట్టే ప్రసన్నము చేసుకోగల విజ్ఞత నాలో ఉంది. మీలో ఎంతమంది ఆ అర్హతను కలిగివున్నారు.

అబ్బే... ఈకాలంవారికి అంత శక్తిసామర్థ్యాలు, కవితానైపుణ్యం ఉందా? లేదు. వారికి అవి కొరుకుడు పడవు. అందుకే భావగీతాలు, గేయకవితలు చదువుకుంటూ, రాసుకుంటూ తృప్తిపడుతున్నారు'' ఆయన ఈ మాటలు అంటూ సభనంతా తేరిపార చూశారు.

"చూడండీ... మీకు ఒక పద్యం పెద్దన కవిత్వానికి మచ్చుతునకగా వినిపిస్తాను. విన

డమేగాని మీలో ఎవ్వరూ ఆ పద్యానికి భావం చెప్పలేరు. చెపితే ఈ క్షణంలో ఈ సభలో వాళ్ళని అభినందించి రెండువందల రూపాయలు బహుమతిగా ఇస్తాను. ఆ సాహసం చేయగలరా? ముందు పద్యం చదువుతాను వినండి'' అంటూ భుజంమీద వున్న కండువా ఒకసారి దులిపి, మళ్ళీ భుజాన వేసుకున్నారు. గొంతుక సవరించుకొని పద్యం చదివారు.

సభలోనివారంతా ఏకాగ్రతతో పద్యం వినసాగారు.

'తరుణి ననన్యకాంత నతి దారుణ పుష్ప శిలీ ముఖ వ్యధా భరవివశాంగి నంగభవునికి నగ్గము చేసి క్రూరుడై... ... నభోమణి దాల్చెం గషాయ దీధితిన్' అంటూ రాగయుక్తంగా, శ్రావ్యంగా పద్యం చదివాడు. ఆయన రెండవసారి మరల సభనంతా చూస్తూ చదివాడు. "ఇలాంటి పద్యాలు ఒక్కొక్క కవివి ఒక్కొక్క వందైనా చదవగలను, అర్థం చెప్పగలను'' అంటూ నవ్వాడు. ఈసారి సభలోంచి సారధి లేచి నిలబడ్డాడు.

వేదికవైపుకు ఆయన ఒక్కొక్క అడుగే స్ఫుటంగా వేసుకుంటూ మైకుముందుకు వచ్చారు. "నేను ఇలా మీముందుకు వచ్చి సవినయంగా ఒక పావుగంట మాట్లాడేందుకు అవకాశం ఇవ్వమని ప్రార్థిస్తున్నాను'' అని నిర్వాహకులను, జ్ఞానేశ్వరరావుని అడిగారు. వారికి ఆయన ఎందుకలా వచ్చారో అర్థమవలేదు. మామూలుగానే ఆయన అభ్యర్థనను అంగీకరించారు.

"పెద్దన చాలా గొప్పకవి. ఆంధ్రకవితా పితామహునికి అంజలి ఘటించనివాళ్ళు ఎవరుంటారు చెప్పండి? ఆయన చదివిన పద్యం భావం ఈ సభలో ఎవరమూ చెప్పలేమని, కవితాప్రాశస్త్యాన్ని వారిలాగ మనమెవరం అందుకోలేమని జ్ఞానేశ్వరరావుగారు అన్నారు. ఆ పద్యభావం చెప్పడానికి మీముందుకు వచ్చాను'' అంటూ ఆయన ఆ పద్యభావం అంతా చెప్పారు.

"పద్యభావమే చాలా? లేక ప్రతిపదార్థం కూడా చెప్పాలా?" అని ఆయన జ్ఞానేశ్వరరావు వైపు చూసి అడిగారు. ఆయన సంభ్రమంగా చూస్తూ వద్దన్నట్లు తల ఊపారు.

"గౌరవనీయులైన ముఖ్య వక్తగారు మనకి అదే ఈకాలంవారికి కవులను అర్థంచేసుకొనే శక్తి లేదన్నారు. పెద్దన శిల్పకళా నైపుణ్యం, ప్రకృతి వర్ణనా నైపుణ్యం, పాత్ర చిత్రణా చమత్కృతి ఇతరులకు అసాధ్యం. ప్రవరుడు, వరూధిని రెండూ సజీవపాత్రలు ఈ మహాప్రబంధంలో పోటీపడి నడిచినవి. ఎన్ని శతాబ్దాలు గడిచినా ఆ పాత్రలు మన మనసులో సజీవములే'

ఆయన ఒక్కనిముషం ఊపిరి తీసికోవడానికన్నట్లు ఆగారు. "సౌశీల్యానికి, సౌందర్యానికి ఈ ప్రబంధములు పోటీపడినట్లు కథ నడిచింది. ప్రవరుడి సౌశీల్యానికి, ఆచారపరాయణత్వమునకు ప్రతీక. ఇంకా అపురూపమైన అందచందాలకు, కళావిలాసాలకు శృంగార రసమూర్తి వరూధిని ప్రతీక. తెలుగువాళ్ళ దైనందిన జీవితాల్లో వీరిరువురూ అందమైన పదబంధాలుగా నిలిచిపోయారు. అసలు 'మనుచరిత్ర' చదవనిదే సాహిత్య అధ్యయనం పూర్తి అయినట్లు కాదు. ఇంక ఈ పద్యం సూర్యాస్తమయ వర్ణన సందర్భంలోనిది'' అంటూ సారధిగారు ఆ పద్యభావమును చక్కగా చెప్పేశారు.

సభలోని శ్రోతలందరూ సారధిగారు ఉపన్యాసం ముగించగానే కరతాళ ధ్వనులు చేశారు. వారికి ఆయన తమ పరువు కాపాడడానికి అవతరించిన సరస్వతీమూర్తిలాగ కన్పించారు. ఆయన మాటలలో తొంగిచూస్తున్న గాంభీర్యం అక్కడివారందరినీ ఆకర్షించింది.

ఆయనకు తెలుగు సాహిత్యంతోగల పరిచయం కూడా సామాన్యమైనది కాదని వారందరూ గ్రహించారు. అయిదు నిముషాలవరకు చప్పట్లు ఆ ప్రదేశంలో మారుమోగుతూనే ఉన్నాయి.

సారధిగారు వేదిక దిగడానికి వెళ్ళబోతుంటే అప్పటికి జ్ఞానేశ్వరరావుగారికి కర్త




వ్యం స్ఫురించింది. సభ్యులంతా తనవైపు హేళనగా, సారధివైపు ఆరాధనగా చూడటం ఆయన గ్రహించారు. చేసిన తప్పుని కప్పిపుచ్చకపోతే పరువే పోతుందని గ్రహించాడు. అందుకే వెంటనే లేచి సారధిగారిని అభినందించి, కౌగిలించుకున్నారు. సారధిగారి కవితాపాండిత్యానికి తాను ముగ్ధుడనయ్యానని చెప్పారు. జేబులోంచి రెండువందల రూపాయలు తీసి ఆయన చేతిలో ఉంచారు.

సుదర్శననాయుడికి, గిరిధర్‌కి ఆ సంఘటన మింగలేనివిధంగా తయారైంది. వారికి జ్ఞానేశ్వరరావు అలా అపజయం పొందడం కష్టంగా ఉంది. ఇంతకాలం తమను ప్రశ్నించేవారు ఎవరూ లేరు. ఈనాడు బాహాటంగానే ప్రజలు హేళనచేస్తున్నారు. జ్ఞానేశ్వరరావుని బాగా సన్మానించి తమ ఖ్యాతి చాటుకోవాలనుకున్నారు. గిరిధర్‌కి ఆయనకి సన్మానం చేయించమని చెప్పినవాడు సుదర్శననాయుడే. అతనికి ఆయన దూరపు బంధువు అవుతాడు. అయినా ఏదో నాలుగు మాటలు మాట్లాడి కూర్చోకుండా ఇలాగ సభలో ఛాలెంజ్ చేయడం ఎందుకని సుదర్శననాయుడు మనసులో అనుకొన్నాడు. అనుకోకుండా సుదర్శననాయుడి చూపులు మాజీ ఎమ్మెల్యే కొడుకు మీద పడ్డాయి. అతను మీసం సవరించుకొంటూ చిరునవ్వు నవ్వాడు. అది తమని హేళన చేసినట్లే అనిపించింది. వెంటనే చూపును మరల్చుకొన్నాడు.

సారధి తనకు డబ్బు వద్దని తిరస్కరించాడు. కేవలం ఆయన చేసిన సవాలుకి సమాధానం చెప్పడమే తన కర్తవ్యం అనుకొన్నానని చెప్పారు. కవులకుగాని, పండితులకుగాని తాము చేసిన కృషిపట్ల ఆత్మవిశ్వాసం ఉండడంలో తప్పులేదుగాని అహంకారం ఉండకూడదని, ఇతరులను చిన్నబుచ్చడానికి తమ పాండిత్యాన్ని ఉపయోగించకూడదని, ప్రతిభ అన్నది నివురుగప్పిన నిప్పులాగా చాలా మందిలో ఉండవచ్చునని, అవకాశాలు రాక వారు నిశ్శబ్దంగా ఉండిపోవచ్చునని సున్నితంగా చెప్పారు.

జ్ఞానేశ్వరరావుకి ఈవిధంగా ఇంతవరకూ ఏ సభలో జరగలేదు. సారధిలో అతనికొకవిధమైన తేజస్సు, హుందాతనం కన్పించాయి. తనకన్నా తెలివైనవాళ్ళు, పండితులు ఆ సభలో చాలామంది ఉండవచ్చునని తను చెప్పకపోయినా, చాలామంది చెప్పగలరని అన్నారు సారధి.

అతడి మాటలు వట్టివికావు. వృద్ధులైన కాశీనాధంగారు మహా పండితులు. ఆయన సభలో ఒకపక్కన కూర్చుని అవునన్నట్లు తల పంకించారు. జ్ఞానేశ్వరరావు కళ్ళకి ఆయన అప్పుడు కన్పించారు. తను ఉత్సాహంతో ఆయనని గమనించనందుకు తనని తానే తిట్టుకున్నాడు.

సారధి వద్దన్నా వినకుండా ఆ రెండువందలూ అతని చేతిలో ఉంచి తన కుర్చీలో ఉన్న శాలువాను తెచ్చి కప్పి జ్ఞానేశ్వరరావు అభినందించాడు. ఏదో అసంకల్పిత ప్రతీకార చర్యలాగ అతడు చేస్తున్న పనికి నిర్వాహకులు నివ్వెరపోయారు. సారధి మౌనంగా కిందికి దిగి వచ్చేశాడు. మిగిలిన కార్యక్రమాలకి తనవలన అంతరాయం కలగకూడదని అతని ఉద్దేశ్యం.

విద్యకి ఇదంతా గమ్మత్తుగా అన్పించింది. ఆ అమ్మాయి కళ్ళకి తండ్రి చాలా అపురూపంగా కన్పించాడు. ఆయన వేదిక దిగివస్తుంటే అందరూ నమస్కరించడం, గౌరవభావంతో చూడడం విద్య గమనిస్తూనే ఉంది.

అంత పెద్ద సభలో తన తండ్రి అలాగ సమస్యను ధైర్యంగా ఎదుర్కోవడం తనకి ఎంతో ఆనందంగా అనిపించింది. అటువంటి తండ్రి తనకు ఉన్నందుకు ఎంతో గర్వంగా అనిపించింది. మిగిలిన కార్యక్రమాలు అవుతున్నాసరే ఆ పిల్ల మధ్యమధ్యలో తండ్రివైపు చూస్తూనేవుంది. అది గమనించిన సారధి నవ్వుకొన్నాడు.

ఆరోజు కార్యక్రమం పూర్తయ్యాక మాజీ ఎమ్మెల్లే కొడుకు సారధిని స్వయంగా అభి



నందించాడు. సారథిలాంటి ఉత్సాహవంతులు, తెలివైనవారు తమ సంస్థలో సభ్యులుగా ఉంటే బావుంటుందని, తాము త్వరలో నిర్వహిస్తున్న అష్టావధానంలో సారథి తప్పక పాల్గొనాలని, మళ్ళీ వచ్చి త్వరలో కలుస్తామని చెప్పి వెళ్ళారు. ఇది చూసి సుదర్శననాయుడు పళ్ళు నూరుకున్నాడు.

పైకిమాత్రం సారథిని మామూలుగా పలకరించి గిరిధర్, అతడు మంచి స్నేహితులు కాబట్టి తమ సాహితీసుధలో చేరమని చెప్పాడు. సారథికి ఈ సంఘాలు, ఈ పోటీలు కొత్తగా అన్పించాయి.

కాశీనాథంగారు నెమ్మదిగా నడుచుకొంటూ సారథిదగ్గరకు వచ్చారు. ఆ వయోవృద్ధుని, మహాపండితుని చూస్తే సారథి ఒళ్ళు జలదరించింది. ఆయనకి వినయంగా పాదాభివందనం చేశాడు.

ఆయన కళ్ళు చమర్చాయి. "సారథీ! చాలారోజులకు నిన్నుచూశాను. ఈపూట నువ్వు మనందరి పరువూ నిలబెట్టావు. నిన్ను చూస్తే నాకు చాలా గర్వంగా అనిపించింది. ఒకసారి ఇంటికి రా నాయనా!" అంటూ ప్రేమగా తనదగ్గరకు తీసుకున్నాడు. ఆయన సారథితో మాట్లాడుతూ వుంటే చాలామంది వచ్చి వారి చుట్టూ చేరారు. చాలా సంవత్సరాల తర్వాత కూడా ఆయన తనని గుర్తుపట్టడం అతనికి సంతోషాన్నిచ్చింది. గొప్ప వక్తగా, మహాపండితునిగా ఆయన ఎంతో పేరు గడించారు. ఆయన మూర్తిని చూస్తేనే నడుస్తున్న సరస్వతి లాగా అనిపించింది.

"విద్య ఉన్నచోట వినయం ఉండాలి నాయనా! ఆత్మవిశ్వాసం అతిశయంగా ప్రదర్శితమవకూడదు. దాన్ని విజ్ఞులెవ్వరైనా సరే క్షమించరు'' అని మేఘగంభీర స్వరంతో ఆయన అంటూంటే అందరూ ఔనన్నట్లు తల ఊపారు.

సారథి తన దగ్గరున్న శాలువా ఆయనకి కప్పాడు ఆయన వద్దని వారిస్తున్నా విన్పించుకోకుండా.

విద్యని చూసి ఆయన ప్రేమతో బుగ్గలు పుణికారు. తండ్రిని మించిన విద్యావంతురాలివి కావాలని ఆశీర్వదించారు.

తిరిగి వస్తుంటే దారిలో విద్య తండ్రిని ఎన్నో విషయాలు అడిగింది. సాంస్కృతిక సంఘాలంటే ఏమిటి? అవి ఎందుకు ఏర్పడ్డాయి? తండ్రిని ఎందుకు వాళ్ళు తమ వాటిలో చేరమంటున్నారు?

కూతురి జిజ్ఞాస చూస్తే తండ్రికి ముచ్చటేసింది.

ఇంటికి వచ్చినా వాళ్ళు అవే విషయాలు మాట్లాడుకుంటూంటే రాధమ్మ విసుక్కుంది భోజనాల దగ్గర కూడా సాహిత్య సమావేశాల కబుర్లేనా అంటూ.

సారథిగారు భార్యని చూసి నవ్వారు. ఆవిడ ఉడుక్కొంది.

"చూడు! మన ఇన్నాళ్ళ దాంపత్య జీవితంలో నువ్వు కవుల గురించిగాని, కావ్యాల గురించిగాని నన్ను అడిగావా? నా తల్లి చదువుల సరస్వతి కనుక అడిగింది'' అంటూ ఆయన కూతురువైపు గర్వంగా చూశారు. విద్య తల్లికి ఆరోజు సభలో జరిగిన విషయాలన్నీ చెప్పింది. మెరుస్తున్న అమ్మాయి కళ్ళు చూస్తుంటే రాధమ్మకి ఆ పిల్ల ఎంత సంతోషపడుతోందో అర్థమైంది.

సారథి ఆ డబ్బు రాధమ్మకిచ్చాడు. "మధ్యలో నాకెందుకు? మీ చదువుల తల్లికే ఇచ్చుకోండి'' అంటూ ఆవిడ విద్యచేతిలో పెట్టింది.

"నాన్నగారూ! నేను వీటిని ఖర్చుపెట్టుకోను. ఈరోజుకి గుర్తుగా దాచుకొంటాను'' అంటూ విద్య తన గదిలోకి పరుగెత్తింది.

విద్య మధ్యాహ్నం స్కూలుకి వెళ్ళేటప్పటికి ఆ పిల్ల స్నేహితురాళ్ళు ఉత్సాహంతో చుట్టుముట్టేశారు. ముందురోజు జరిగిన సంఘటన గురించి వాళ్ళకి అప్పుడే తెలిసిపోయింది. "విద్యా! మీ నాన్నగారు మంచిపని




చేశారు. లేకపోతే వాళ్ళకి అంత గొప్పా?" అంటూ కళ్ళు తిప్పుతూ చెప్పేసింది. విద్య విమలవైపు చూసింది. విమల కూడా వాళ్ళ అమ్మగారితో, నాన్నగారితో కలిసి ఫంక్షనుకి వచ్చింది.

"అక్కడ జరగగా లేనిది విమల మాకు చెపితే తప్పు ఏమిటి? రాణి వాళ్ళ పెద్దన్నయ్యకి చాలా గర్వం తెలుసా? వాళ్ళ మీటింగులకి అందరినీ పిలవరు. వాళ్ళకిష్టమైనవాళ్ళకే ఇన్విటేషన్స్ ఇస్తారు. ఏదో ఉండబట్టలేక మా వాళ్ళు ఉత్సాహంకొద్దీ వెళుతూ ఉంటారు. నిన్న మా ఫాదర్ కేంప్ వెళ్ళడంవలన నేను రాలేదు'' అంటూ జ్యోతి విద్యకి చాలా విషయాలు చెప్పింది.

విద్య కూడా వాళ్ళ సంతోషాన్ని పంచుకొంది. తండ్రి తనకి డబ్బు ఇవ్వడంతోసహా అన్నీ చెప్పింది.

వాళ్ళు ఈ కబుర్లలో ఉండగానే రాణి, ఆ అమ్మాయి స్నేహితులు లోపలికి వచ్చారు.

సుధ రాణిని చూస్తూనే నొసలు చిట్లించి, ఎంతో బోరును భరించినదానిలాగ అభినయించింది.

"వచ్చారా! ఒక్కర్తినీ ఈ బెంచీలో కూర్చుని వాళ్ళ గప్పాలు వినలేక చస్తున్నాను. మీరు చూస్తే ఎప్పటికీ రారు. ఆ విద్య, దాని స్నేహితులు ఒకటే రాలిపోతున్నారు'' అంటూ ఆ సంగతులన్నీ చెప్పసాగింది.

రాణి వాళ్ళ బెంచీవైపు చూసింది.

విద్య వాళ్ళు ఈ లోకంలో లేనట్లు కబుర్లు చెప్పుకొంటున్నారు.

రాణి వాళ్ళవైపు విసుగ్గా చూసింది. రాణి బంధువుకి జరిగిన అవమానం గురించి వాళ్ళు అడిగారు. ఇందులో అవమానమేం ఉందో రాణికి అర్థమవలేదు. అనేవాళ్ళ దగ్గర అంది "మా మావయ్య మహా పండితులు కనుక ఏదో ఒక విషయం అడిగారుట. అంత మాత్రానికి కొంప మునిగిపోయిందా?"

రాణి సీరియస్‌గా ఉందని వాళ్ళు గ్రహించారు. "విద్య తండ్రి ఎంతో వివరంగా ఆ విషయం చెప్పారుట. మీ మావయ్య ఓడిపోవడంవలన డబ్బు కూడా వదులుకొన్నారుట. అసలు మీ వాళ్ళందరికీ చాలా గర్వంట" దీప్తి మరో నాలుగు పొడిమాటలు వేసింది.

రాణికి బలే కోపం వచ్చింది. ఆమె ఆరోజు కొత్తనెక్లసు పెట్టుకొని వచ్చింది. దాన్ని స్నేహితులందరికీ చూపాలని ఎంతో ఆశతో వచ్చింది. వాళ్ళేమో అక్కరలేని గొడవ చేస్తున్నారు. పైగా తనవాళ్ళనే అనేసరికి కోపం వచ్చింది. పెద్దగా గొంతుక పెట్టి అంది "చూడు సుధా! మేము మా నౌకర్లకి పండుగలు వచ్చినప్పుడు రెండేసివందలు ఇస్తూ ఉంటాం బట్టలు కొనుక్కోమని. మాకు డబ్బుకి లెక్కలేదు. ఈ నెక్లస్సు చూడు నేను కొట్లో చూసి బావుంది అనగానే మా అమ్మగారు కొనిపెట్టారు'' అంటూ తల ఎగరేసింది.

రాణి అనుకొన్న ప్రయోజనం నెరవేరింది. ఆ మాటలు విన్న జ్యోతి పౌరుషంతో ఏదో అనబోయింది. విద్య ఆ అమ్మాయిని మాట్లాడవద్దని సౌంజ్ఞ చేసింది. రాణికి ఇది మరింత అలుసుగా అన్పించింది. అందుకే తన ఇష్టంవచ్చినట్లు ఏవో సూటిపోటి మాటలు అనసాగింది. విద్య స్నేహితులకి ఏవేవో పేర్లు పెట్టి వేళాకోళం చేస్తోంది.

ఇక జ్యోతివశం కాలేదు నోరుమూసుకుని కూర్చోవడం. విద్యవైపు చూడకుండా వాళ్ళకి గట్టిగా జవాబు ఇచ్చింది. విద్యకి తగాదాలంటే విసుగు. అసలు వాళ్ళ ఇంట్లో సాధారణంగా ఎప్పుడూ గొడవలు జరగవు. అందుకే జ్యోతిని వారించబోయింది. రాణికి ఇదంతా విద్యే చేస్తున్నట్లుగా అన్పిస్తోంది. పైకిమాత్రం వద్దంటోందనీ, లోపలమాత్రం వాళ్ళు తమని అంటే సంతోషిస్తోందనీ ఉక్రోషంగా అనుకొంది.

విద్యని ఆ అమ్మాయి "పల్లెటూరి బైతు, నంగనాచి'' అని అంటూ ఉంటుంది. అందుకే ఆ పేర్లతో మాటలు విసరడం మొదలుపె

ట్టింది.

విద్య తమను అస్తమానూ ఊరుకోమనడం విద్య బృందానికి కష్టంగానే ఉంది. మాటలు పడుతూ ఉండటం చేతకానితనం అనుకుంటు న్నారు వాళ్ళు.

విద్య వాళ్ళ మాటలకి నవ్వి "ఏనుగు వెళ్ళిపోతుంటే వంద కుక్కలు మొరుగు తాయి. అంతమాత్రాన ఏనుగు నడక మాను కొంటుందా? లేక తిరిగి వాటిలా అరు స్తుందా?" అని అడిగింది జ్యోతిని చూస్తూ.

విద్య ఎక్కువగా మాట్లాడదు. ఆ విషయం అందరికీ తెలుసును. కానీ ఇంత సూటిగా, వాడిగా అనగలదని ఇటువైపువాళ్ళకి, అటువై పువాళ్ళకి ఒక్కసారే తెలిసింది. ఈలోపు క్లాసు టీచర్ వచ్చారు. దాంతో అందరూ నిశ్శబ్దమై పోయారు.

పాఠం పూర్తయ్యాక రాయమని వర్క్ ఇచ్చారు ఆయన. విద్యావాళ్ళు రాస్తున్నారు. కానీ రాణికి మాత్రం దేనిమీద ధ్యాసలేదు. రాయకపోయినా తనని కోప్పడే ధైర్యం ఎవరి కి ఉంది గనుక!

పక్కన కూర్చున్న సుధ రాణి చెవిలో జోరీగలాగ వల్లించేస్తోంది. ఇంత అవమానం దిగమింగి ఎలా ఊరుకోగలుగుతున్నానని ప్ర శ్నిస్తోంది. తమని కుక్కలు అంటుందా? ఎంత పొగరు? ఆఫ్టాల్ జీతంమీద బతికే ఒక మా మూలు మధ్యకుటుంబం అమ్మాయికి ఇంత గా కళ్ళు నెత్తికెక్కటమా?

రాణి ఎవరిచేతా మాటలు పడి ఎరుగదు. అలాంటిది ఈ విద్య అంటే ఊరుకోవడమా?

మేష్టారు క్లాసునుండి వెళ్ళిపోగానే విద్య బెంచీదగ్గరికి వచ్చింది రాణి.

"ఏమిటి పేలుతున్నావు? మేము నీ కళ్ళకి కుక్కల్లాగ కనపడుతున్నామా? నోర్మూసుకొని పడిఉండు. మళ్ళీ ఏదైనా వాగావో నా చెప్పుదె బ్బ రుచి చూడవలసి వస్తుంది'' అంటూ చెంపమీద ఒకటి వేసి వెళ్ళిపోయింది.

అసలు జరిగినదేమిటో విద్యకి అర్థమవలే దు. చెంప మంటపుట్టి ఆ అమ్మాయిని ఈ లోకంలోకి తీసుకొని వచ్చింది. విద్య ప్ర మేయం లేకుండానే కళ్ళనీళ్ళు తిరిగి బయటి కి రావడం మొదలెట్టాయి. దాంతో స్నేహితురా ళ్ళకి ఒళ్ళు తెలియని కోపం వచ్చింది. జ్యోతి క్లాసు లీడరువైపు చూసింది. అతడు కూడా రాణి చేసిన పనికి నిర్ఘాంతపోతున్నాడు. ఏంచే యాలో కూడా అతనికి అర్థమవలేదు.

జ్యోతికి లీడరుమీద, క్లాసులోని పిల్లలమీద ఒళ్ళు మండింది. "అలాగ నిలువు గుడ్లేసు కొని, గుడ్లగూబలాగ చూడకపోతే వెళ్ళి మేష్టా రుకి చెప్పి పిలుచుకొని రావచ్చునుకదా?" అని నిలదీసింది.

ఆ అమ్మాయి మాటలతో కర్తవ్యం తోచి అతడు స్టాఫ్ రూంవైపు పరుగెట్టాడు.

తర్వాత పీరియడ్ లెక్కలు. లెక్కల మేష్టా రు స్టాఫ్‌రూంలో రాజకీయ పరిణామాల గు రించి వేడిగా ఉపన్యాసం ఇస్తున్నారు. క్లాసు లీడరు వచ్చి మేష్టారుని పిలిచాడు. మామూ లుగా పిలవడానికి వచ్చాడు కాబోలనుకొని కోపంతో "పదరా వెధవా! వస్తాను'' అని మళ్ళీ మాటలలో పడ్డారు.

వాడు వెళ్ళలేదు. "దెబ్బలాడుకొంటున్నా రండీ'' అని చెప్పాడు.

దానితో "ఎవరురా'' అంటూ మేష్టారికి బయటకి రాక తప్పలేదు. ఇద్దరూ కలిసి నడుచుకొంటూ వస్తోంటే అప్పుడు వాడు అసలు విషయం చెప్పాడు.

మేష్టారు క్లాసులోకి వచ్చేటప్పటికి ఏ గ్రూ పుకి ఆ గ్రూపు అవతలివాళ్ళదే తప్పంటూ గొడవ చేస్తున్నారు. విద్య మాత్రం తల ప్ర క్కకు తిప్పి బయటికి చూస్తోంది.

జ్యోతే మేష్టారుకి విషయం వివరించింది.

ఆయన రాణివైపు చూసి అడిగారు "ఏమ్మా! విద్యను నువ్వు అలాగ కొట్టవచ్చు నా? క్లాసులో ఈ గొడవలేమిటి?"

ఆ మాత్రం దానికే ఆ అమ్మాయికి ఒళ్ళు మండిపోయింది. మేష్టారిని సూటిగా చూస్తూ,




"మమ్మల్ని ఆ అమ్మాయి కుక్కలు అంది సార్! అలాగ అంటే ఎవరు ఊరుకొంటారు? ఆవిడగారు ఏనుగూ, మేము కుక్కలమూ నట" మళ్ళీ గింజుకొంటూ అంది. "మా నాన్నగారికి కనుక ఈ విషయం తెలిస్తే నా పని అవుతుంది. కుక్కలును కన్నవాళ్ళు కూడా కుక్కలే అవుతారు కదండీ!"

రాణి మాటలకి ఆయనకి కంగారు పుట్టింది. ఇవి ఇక్కడితో ఆపెయ్యాలనుకొన్నారు.

"ఛాఛా... అదేమిటమ్మా! పెద్దవాళ్ళ గురించి అసలు మనం అలాగ అనుకోకూడదు. మీరు చిన్న పిల్లలు. అన్నీ మరిచిపోవాలి" ఆయన హితబోధ ప్రారంభించారు.

కాని, ఇలాంటి విషయాల్లో రాణి చాలా తెలివైనది. అందుకే ఆయనని వదలదలచుకోలేదు.

"మమ్మల్ని తిట్టినపుడు మేము ఎలా ఊరుకొంటాము చెప్పండి? అయినా మన స్కూల్లో ఎప్పుడైనా ఈ విధంగా తగాదాలు మేము పడ్డామా? కొత్తపిల్ల, వచ్చి ఇవి చేస్తోంటే ఎలా సహిస్తాం?" గట్టిగానే అడిగింది.

ఆయనకి కూడా ఆ అమ్మాయి మాటలు ఆ క్షణంలో నిజమేననిపించాయి. విద్యని అసలు విషయం అడిగినప్పుడు ఆమె తను అన్న మాటలు ఒప్పుకొంది. అయితే, తను చేరినప్పటినుండీ కూడా వాళ్ళు ఏదో ఒకవిధంగా తనను గొడవ చేస్తున్నారని చెప్పింది. కాని ఆయన ఆ విషయం వినలేదు. తనకి క్లాసు టైం అయిపోతోందనీ, శ్రద్ధగా చదువుకోకుండా అల్లరి చేస్తే క్లాసులో ఉండనివ్వననీ కసిరేశారు.

జ్యోతికి మహా చిరాకు వచ్చింది. గొడవ చేసేది వాళ్ళు. మేష్టారు అక్షింతలు వేసేది తమకి. ఇలాగైతే వాళ్ళకి కొమ్ములు రావూ? అందుకే అనేసింది. "బావుంది మేష్టారూ! వాళ్ళు మమ్మల్ని కొట్టినందుకు వాళ్ళని కేకలేయడం పోయి, మమ్మల్నే తిడుతున్నారా? మా పెద్దవాళ్ళు మాత్రం మమ్మల్ని అడ్డమైనవాళ్ళ చేతా దెబ్బలు పడమని పంపిస్తున్నారా? వాళ్ళనే వచ్చి కనుక్కోమంటాం" అనేసింది.

ఆయనకి వాళ్ళందరినీ చూస్తే కోపం వచ్చింది. మగపిల్లలు నయం. ఏ అల్లరీ చెయ్యరు. ఈ క్లాసులో మాత్రం వీళ్ళ గొడవలు ఎక్కువే. అందుకే అందరినీ ఉద్దేశించి అంటున్నట్లు బుద్ధిగా ఉండమని హెచ్చరించి వదిలేశారు.

విద్యకి మాత్రం చాలా కష్టమన్పించింది. తల్లి, తండ్రి కూడా ఏనాడూ చెయ్యిచేసుకోలేదు. తప్పు అవతలివాళ్ళు చేసినా మేష్టారు తమనే మందలించారు. ఇదివరకటి స్కూల్లో అయితే ఇలాగ ఉండేది కాదు అని అనుకొంది.

జ్యోతి, ఇందిర జరిగిన విషయానికి గొణుగుతూనే ఉన్నా, విద్య మాత్రం ఏ భావాన్నీ ప్రకటించలేదు. అయితే మరొక సంఘటన కూడా జరగకపోతే విద్య అంటే ఏమిటో క్లాసులో వారికి తెలిసే అవకాశం వచ్చేది కాదు.

రాణి, మేష్టరుగారు తమని సపోర్టు చేస్తారని ముందే తెలిసిన దానిలాగ నవ్వడం మొదలుపెట్టింది. లీడరుకి కూడా వాళ్ళ జోలికి వెళ్ళాలంటే భయమే. చూసీచూడనట్లు ఊరుకొంటాడు వాళ్ళు మాట్లాడుతున్నప్పుడు. అదే వాళ్ళకి అల్లరి చేయడానికి, అందరినీ ఏడిపించడానికి కారణమైంది.

తనకి ఎదురునిలిస్తే ఏమవుతుందో విద్యకి బాగా తెలిసి వచ్చిందని రాణి అనుకొంది. ఆ పిల్ల అనుకొన్నట్లే తర్వాత వచ్చిన మేష్టారు సైన్సు మేష్టారవడంతో ఆడపిల్లలు అణకువగా ఉండాలని పది నిముషాలు లెక్చరిచ్చారు. ఆవిధంగా పాఠం లేటవడం తప్ప జరిగినదేంలేదు.

విద్య మధ్యాహ్నం భోజనం చేసి వచ్చి, తన సీటులో కూర్చొని లెక్కలు చేసుకొంటోంది. రాణి, ఫ్రెండ్స్ కూడా భోజనాలు కానిచ్చి, గార్డెన్‌లో కూర్చుని హస్కుకొడుతున్నారు.

మాటలమధ్యలో విద్య గురించి ప్రస్తావన వచ్చింది. ఉదయం తను చేసిన ఘనకార్యం గురించి, అప్పటి తెల్లబోయిన విద్య మొహంగురించి ఏక్షన్ చేసి మరీ రాణి చెపుతోంది. అందరూ అది చూసి నవ్వసాగారు.

"ఇప్పటికైనా తెలిసికొని ఉంటుంది. మన జోలికి వస్తే ఏం జరుగుతుందో బాగా అనుభవమైంది'' అంటూ గర్వంగా తల ఎగరవేసింది రాణి! తర్వాత గార్డెన్‌లో కూర్చుని విసుగుపుడుతోందని, క్లాస్‌లోకి బయలుదేరారు. తల వంచి లెక్కలు చేసుకొంటున్న విద్యని చూస్తే రాణిలో కొంటె బుద్ధి మళ్ళీ పడగవిప్పింది. తను చేయబోయే పనికి ఫ్రెండ్స్ మరింత సంతోషిస్తారనుకొంటూ గబగబా లోపలకి వచ్చింది.

విద్య బెంచీలో ఒక్కర్తే ఉంది. క్లాసులో కొద్దిగా మాత్రమే పిల్లలున్నారు. కొందరు వర్క్ చేస్తోంటే కొందరు కబుర్లు చెప్పుకొంటున్నారు. రాణి సరాసరి తన బెంచీ దగ్గరకి వెళ్ళబోతున్న దానిలాగ అటువైపు వచ్చింది.

విద్య వాళ్ళకి చోటు ఇవ్వడం కోసమన్నట్లు కొద్దిగా బెంచీ లోపలకి లెక్క చేస్తోనే జరిగింది. కానీ రాణి తన బెంచీ దగ్గరకి వెళ్ళలేదు. చూడనట్లు విద్య చేస్తున్న పుస్తకాన్ని చేత్తో తోసేసి, ముందుకు కదిలింది.

ఆ చర్య ఎలా ఉందంటే బెంచీ దగ్గరకు వెళుతోంటే ఆధారంకోసం డెస్కుమీద చెయ్యి వేసినట్లు అన్పించేలాగ ఉంది. నోట్సుపుస్తకం కింద పడిపోయింది. దానితో పాటు పక్కనున్న లెక్కల టెష్టు కూడా ఆ ఫోర్సుకి కిందపడింది.

రాణి తన సీట్లోకి వెళ్ళిపోయింది. విద్య ఇంకా లెక్క మూడ్‌లోనే ఉండటంతో వంగుని పుస్తకాలు తీసికొని, చెయ్యడంలో మునిగిపోయింది. ఇది చూస్తే రాణికి మరింత ఏడ్పించాలన్పించింది.

అయిదు నిముషాలు ఆగి, మళ్ళీ అటు నుండి ఇటు రావడానికి లేచింది. అప్పటికి లెక్క పూర్తవడంతో, విద్య పెన్ను అలాగే పట్టుకొని, మరొక లెక్క టెష్టులో చదువుతోంది. వెనుక నుండి ఫోర్సుగా రావడంతో విద్య తూలి పుస్తకాలమీద పడింది.

పెన్నులోని ఇంకు కొంత నోట్సుమీద పడింది. పెన్ను, నోట్సు, టెష్టు ఎగిరి బెంచీ అవతల పడ్డాయి. నోట్సుకి వేసికొన్న అట్ట కూడా ఊడిపోయింది. దాంతో విద్యకి ఒళ్ళుతెలియని కోపం వచ్చింది.

అసలే పెద్దవైన ఆమె కళ్ళు కోపంతో మరింత పెద్దవయ్యాయి. వెళ్ళిపోబోతున్న రాణి చేతిని గట్టిగా తన చేతిలో పట్టుకొంది. "ముందు వెళ్ళి నా నోట్సు, టెష్టు, పెన్ను తీసి బెంచీమీద పెట్టు'' అని గద్దించింది.

"నేనేం నీ నౌఖరుని కాను. కావాలంటే నువ్వే వెళ్ళి తెచ్చుకో!" రాణి దర్పంగా జుట్టు ఎగిరి మెడమీద పడేలాగ తిప్పుకొంటూ అంది.

"మాటలు అనవసరం. నువ్వు పడవేశావు కనుక నువ్వు తీసి ఇవ్వాలి'' విద్య రాణి చేతిని వదలకుండానే గట్టిగా అంది.

వెనకనే వస్తున్న రాణి స్నేహితులు ఆ సంఘటన చూసి బెదిరిపోయారు. దీప్తి గబగబా వచ్చి తను తీయబోయింది.

విద్య ఆ పిల్లని వారించింది. "తప్పు చేసిన వాళ్ళే సవరించుకోవాలి. నువ్వెందుకు తీస్తావు. నీ పని నువ్వు చూసుకో!" అంది.

విద్య కంఠంలోని తీవ్రతకి దీప్తి భయపడిపోయింది. ఒక అడుగు వెనక్కి వేసింది. అదికాదు యం.ఎల్.ఏగారమ్మాయి కదా! పోనీ నేను తీద్దామనుకొన్నాను'' దీప్తి గొణుక్కొంటున్నట్లు అంటున్న మాటలు విద్య చెవులలో పడనేపడ్డాయి.

"యం.ఎల్.ఏగారు వాళ్ళ నాన్నగారు. ఈ అమ్మాయి కాదు కదా!" విద్య గంభీరంగా అంటూ రాణి చేతిని పట్టు మరి కాస్త బిగించింది. రాణికి చెయ్యి విపరీతంగా నొప్పి పెడుతోంది. ఏం చేయాలో తోచలేదు.




దానికి సాయం పిల్లలు ఒక్కరొక్కరుగా క్లాసులోకి చేరుకొంటున్నారు. "నా పుస్తకాలు తీసి ఇవ్వక తప్పదు రాణీ! లేకపోతే నిన్ను వదిలేది లేదు. అయినా కింద పడవేసిన దానివి తీయడానికి అంత బాధపడట మెందుకు? ఒకసారి ఊరుకొన్నాను. రెండవ సారీ అదే చేస్తే కావాలని కాక మరేమిటి?" విద్య నిర్మొహమాటంగా అంది. ఇంక రాణికి తప్పలేదు.

విద్య చేతికి అంత బలం ఎక్కడనుండి వచ్చిందో ఆ పిల్లకి ఏమీ అర్థమవలేదు. మనిషి చూస్తే సున్నితంగా కన్పిస్తుంది పట్టుచూస్తే ఉడుంపట్టులాగ ఉంది. కళ్ళల్లో తిరుగుతున్న నీళ్ళని సంభాళించుకొంటూ రాణి విద్య పుస్తకాలు తీసి బల్లమీద ఉంచింది.

విద్య అప్పుడు చేతిని వదులుతూ "చూడు ఇలాగ నా ముందు తల వంచుకొని ప్రవర్తించే పని ఏదీ చేయకు. తెలిసిందా? నా జోలికి రానంతవరకూ నేను ఎవరిజోలికీ వెళ్ళను. కాస్త మర్యాదగా తోటివారిపట్ల ప్రవర్తించడం నేర్చుకో!" అని తన ప్లేసులోకి వెళ్ళిపోయింది.

స్కూలుబెల్ మ్రోగింది. ఎవరో చెప్పగా విని, పరుగెత్తుకొని వచ్చిన జ్యోతి, కస్తూరి ఆశ్చర్యపోయారు. వాళ్ళు రాణివైపు, విద్య వైపు చూస్తున్నారు.

ఏమిటీ! నా మొహంమీద ఏమైనా కోతులు ఆడుతున్నాయా! అలాగ ఆశ్చర్యంగా నిలబడి పోయారు? వచ్చి కూర్చోండి'' అని విద్య నవ్వుతూ పిలిచింది.

విద్యని చూస్తే అసలు ఏమీ జరగనట్లే ఉంది. రాణికి మాత్రం చెయ్యి నొప్పి ఇంకా తగ్గలేదు. వాళ్ళవైపు చూడకుండా, చెయ్యి మణికట్టు దగ్గర రాసుకొంటూ బయటకి చూడ సాగింది.

విద్య స్నేహితులు ఏదో అన్నదానికి కాబోలు గట్టిగానే జవాబు చెపుతోంది. "ఏమిటి...! మేష్టారు వచ్చాక రిపోర్టు చేస్తుందేమో అంటావా! చెయ్యనీ! దానికి నా రియాక్షన్ ఏమిటో తర్వాత తెలుస్తుంది. అయినా తెల్లవారి లేచి ప్రతిజ్ఞలో "ప్రతి వారితోనూ మర్యాదగా నడుచుకొందును'' అని చేయడమెందుకు? ఓహో! తను రాజకీయనాయకుడి కూతురు కదూ! వాళ్లకి చెప్పినది ఆచరించడం తెలియదు''

విద్య మాటలకి రాణి మొహం ఎర్రబడిపోయింది.

శైలజ, దీప్తి మేష్టారుతో చెపుదామా అంటే రాణి వద్దనేసింది. ఆ అమ్మాయికి "పిరికివాళ్ళే ఇతరులకి ఫిర్యాదు చేస్తారు'' అన్న విద్య మాటలు ఇంకా గుర్తు ఉన్నాయి. విద్య తెలివి తేటలతో ఆ పిల్ల నోరు నొక్కేసింది. మేష్టర్లకి చెప్పి తన ముందు పిరికిది అన్పించుకోవాలని లేదు. క్లాసులోని పిల్లలముందు విద్య చేసిన పని దాయలేదు. అందరికీ ఈ విషయం గమ్మత్తుగానే అన్పించింది.

ఆ పూట అంతా రాణి అన్యమనస్కంగానే గడిపింది. స్నేహితురాళ్ళతో కూడా ఏమీ మాట్లాడలేదు. అంత బుద్ధిగా క్లాసులో ఉండటం ఆ అమ్మాయికి అదే మొదటిసారేమో! ఇంటికి వెళుతూ "విద్యా! నిన్ను ఎలా ఏడిపిస్తానో చూస్తావుగా! కాస్త ఓపికపడితే అన్నీ అనుభవిస్తావు'' అని కసిగా అనుకొంది.



**రాణి**, ఇంటికి రావడమే పుస్తకాలు టేబుల్ మీద విసిరేసి, మంచానికి అడ్డంగా పడుకొంది పచ్చని ఆమె చేతిమీద విద్య గోళ్ళు రెండు గుర్తుగా ఉండిపోయాయి. రాణికి ఎంతో రో

షంగా అన్పించింది. ఇప్పటివరకూ ఆ పిల్ల అల్లరిని ఆపినవారే లేరు. ఇంతకన్నా ఎక్కువ గానే ఆ పిల్ల చాలామందిని ఏడిపించింది.

ఇంటికి వచ్చిన రాణి అలికిడి విన్పించకపోవడంతో, తల్లి కనకమ్మ తన మహాకాయాన్ని అతి భారంగా నడిపించుకొంటూ రాణి గదిలోకి వచ్చింది. ఎన్నడూ లేనిది, కూతురు పడుకొని అలాగ ఫానువైపు చూడటం ఆమెకి ఆశ్చర్యం, కంగారు కలిగించింది.

"రాణమ్మా! ఎప్పుడు వచ్చావు స్కూలు నుండి? నా దగ్గరికి రాలేదేమిటమ్మా! ఒళ్ళు బావుందా?" అంటూ కూతురి మంచంమీద కూర్చుని నుదిటిమీద చెయ్యివేసి చూసింది. ఒళ్ళు కాస్త వెచ్చగా అన్పించింది ఆవిడ తల్లి ప్రాణానికి.

"ఒంట్లో బావుండకపోతే చెప్పాలి గానీ అలాగ పడుకొంటే ఎలా తల్లి? ఉండు మీ నాన్నగారికి డాక్టరుని పిలవమని చెపుతాను'' అంటూ లేవబోయింది "అబ్బే... ఏమీ లేదమ్మా! కాస్త తలనొప్పి'' అంటూ తల్లి కంగారుని తగ్గించింది రాణి.

కూతురు ఏమీ లేదంటే ఆవిడకి నమ్మబుద్ధికలగలేదు. కోడలుని వెంటనే పిలిచి ఉప్పు, మిరపకాయలు తెమ్మంది. పిల్ల మొహం వాడిపోయి చింతాకంత అవుతే ఏమీ లేదంటే మాత్రం తను ఊరుకొంటుందా!

కోడలు తెచ్చిన ఉప్పు, మిరపకాయలు దిగదుడిచి పల్లెంలో పడేసి, పొయ్యిలో వేసి రమ్మంది. వెంటనే పనిమనిషిచేత పాలు ఎక్కువ వేసి కాఫీ కలపి పంపమని పురమాయించింది. కోడలు వెళ్ళిపోబోతూంటే కాఫీలో మీగడవేయడం మరిచిపోవద్దంది. కోడలు అలాగే అని తల ఊపి వెళ్ళిపోయింది.

ఆ కోడలుకి ఈ అత్తగారిని చూస్తే ఒళ్ళు మండింది. కూతురికి కాస్త తల నొప్పి వచ్చి, మొహం వాడిపోతే అంత జాతర చేస్తోంది. అదే తనకి జ్వరం వచ్చి వారం రోజులు మంచంమీద పడుకొన్నా ఖాతరుచేయలేదు. ఆ మాత్రం జ్వరం వస్తే ఓర్చుకోవాలి. గాబరా పడకూడదని కబుర్లు ఒకటీ. ఏం మనుష్యులు అని మనసులోనే అసహ్యించుకొంది.

రాణి తల్లి చేతిగాజులు సవరిస్తూ, ఆమె అడిగిన వాటికి జవాబులు చెపుతోంది. కనకమ్మకి రాణి అంటే పిచ్చి ప్రేమ. ముగ్గురు మగపిల్లల తరువాత వెలసిన లక్ష్మి అని మురిసిపోతుంది. పనసపండు తొనలాంటి కూతురి ఒంటిరంగు, అందం చూసి పొంగిపోతుంది. దానికి సాయం ఆ అమ్మాయి పుట్టాక అన్నీ కలిసి రావడమే.

తండ్రికి కూడా ఆ పిల్ల అంటే ప్రాణం. ఆయన మగపిల్లల్ని ఆమడదూరంలో ఉంచి మాట్లాడతాడు. కూతురు మెడమీద ఊగినా, మీసాలుపట్టి తమాషా చేసినా, ఏమీ అనడు. ఆ పిల్ల ఏం చేసినా ఆయనకి అపురూపమే.

వచ్చిన వాళ్ళందరూ వెళ్ళాక ఆయన భార్యని పిలిచాడు.

బదులుగా కోడలు తలుపు చాటున నిలబడి అత్తగారు, రాణి దగ్గర కూర్చున్నారని చెప్పింది.

కూతురు స్కూలునుండివస్తే ఆయన హాలులో కూర్చుంటే వచ్చి పక్కనే ఉయ్యాల బల్లమీద కూర్చుంటుంది.

కూతురిని పలుకరించి, ఆనక మళ్ళీ తిరిగి ఆయన వచ్చినవాళ్ళతోకబుర్లలో పడతాడు. ఆయన భారీ విగ్రహం, నోరు చూసి అందరూ భయపడతారు. కానీ ఆయన మాత్రం కూతురికి కాస్త కోపం వచ్చినా భయపడిపోతాడు.

ఆయనతో కూతురి తలనొప్పి గురించి, నిరుత్సాహంగా పడుకొన్న విషయం గురించి చెప్పింది కనకమ్మ. ఆయన గాబరాపడుతూ కూతురి చెయ్యి పట్టుకొని చూశారు జ్వరం ఏదైనా ఉందేమోనని.

ఆయన దృష్టి అనుకోకుండా చేతిమీద ఎర్రగా కమిలిన గుర్తుమీద పడింది "ఇదేమిటమ్మా! ఎవరైనా చెయ్యి మెలిపెట్టారా?" అని గబుక్కున అడిగారు. ఆ పిల్లమీద ఈగ




వాలిందంటే ఆయనమీద ఏనుగు పడిన ట్లుంటుంది.

రాణి గబుక్కున మంచంమీద లేచి కూర్చుంది. ఆయనకి స్కూల్లో విషయం చెప్పి బాధ పెట్టాలన్పించలేదు. "ఏం లేదు డాడీ! దీప్తి కాస్త మోటు మనిషి కదా! పారిపోతున్నా నని గట్టిగా చెయ్యి పట్టుకొంది. తనని నేను నాలుగు దులిపేశాననుకోండి'' అంటూ సర్ది చెప్పేసింది.

ఆయనకి ఆ విషయం అంత నచ్చలేదు. ఏది ఏమైనా గోళ్ళ గుర్తులు పడేలాగ ఆ పట్టుకోవడమేమిటి? వీళ్ళు ఆడపిల్లలా? మగ రాయుళ్ళా అని కోపంగా మనసులో అనుకొ న్నారు.

కూతురిని ఉత్సాహపరచాలని కాస్సేపు ఏదో కబుర్లు చెప్పారు. స్కూల్లో ఎవరైనా ఏదైనా అంటే చెప్పమన్నారు. రాణి మౌనం వహించింది. "పోనీ అలాగ షికారుకి వెళ్ళి వద్దామా?" అని అడిగారు. ఆయనకి పనులు ఎక్కువే కానీ కూతురు కోసం అప్పుడప్పుడూ అడుగుతూ ఉంటారు అలాగ.

మధ్యలో కనకం అందుకొంది. "పోనీ సినిమాకి మమ్మల్ని తీసికెళ్ళండి. అమ్మలుకి కాస్త చిరాకు తగ్గుతుంది. విజయశాంతి సిని మా ఏదో వచ్చిందిట. నాకు పేరు తెలిసి చావదు'' అంటూ తన కోరిక కూడా కూతురి తరపున తీర్చుకొందామనుకొంది ఆవిడ. ఆయన ఆవిడని మింగేసేలాగ చూశాడు.

ఆయన ఆరోజు సాయంత్రం ఒక కంట్రాక్ట రుని మాట్లాడే పనుందని పిలిచారు. అతడికి ప్రభుత్వం తరపున ఒక మంచి ఆఫర్ వచ్చింది. ఆ పని చేసిపెట్టమని ఆ కంట్రాక్టరు ఎప్పటినుండో ఆయనని వేధిస్తున్నాడు. ఆ విషయం గురించి ఆయన ఈరోజు తనే ఫోనుచేశాడు కనుక తప్పక వస్తాడు. భార్య వట్టి మొద్దుమొహమని విసుక్కొన్నాడు.

రాణికి కూడా ఇంట్లో ఉండటానికి చిరాకుగా ఉంది. తల్లి ఇష్టం కూడా తెలుసును కనుక "పదండి డాడీ! సినిమాకి వెళదాం" అని గారంగా అడిగింది. ఆయన "నేను హోలు వాళ్ళకి ఫోను చేస్తాను. అమ్మ, నువ్వూ వెళ్ళి రండమ్మా'' అని తప్పించుకోబోయాడు. రాణి కి ఆయనని ఇలాంటి సమయాలలో ఇబ్బంది పెట్టడం సరదా! తండ్రి తన కోరిక అలాంటి పరిస్థితులలో తీరిస్తే గొప్ప.

అందుకే "అబ్బే నీవు కూడా మాతో రావాలి డాడీ! నేను ఒప్పుకోను'' అంటూ గునిసింది.

ఆయన మింగలేక, కక్కలేక అలాగే అన్న ట్లు తల ఊపారు.

రాణి ఆయన బుగ్గమీద ముద్దుపెట్టి, తయా రవడానికి పారిపోయింది.

కూతురి ఉత్సాహం చూసి ఆయన నవ్వుకొ న్నారు. ఆ పిల్ల ముద్దు పెట్టిన బుగ్గని అపురూపంగా తడుముకొన్నారు'' ఊ.... బయలుదేరు. అసలే నీ ముస్తాబు త్వరగా తెమలదు'' అంటూ భార్యతోనే వేళాకోళం ఆడారు.

తర్వాత ఆయన తన స్నేహితుడికి ఫోన్ చేసి కారు పంపించమన్నాడు. అలాగే కంట్రాక్ట రుని మర్నాడు ఉదయమే రమ్మన్నారు. తను కూడా సినిమాకి వెళ్ళవలసి వచ్చిందనీ, అర్జంటు పని ఉందన్నా కూతురు ఒప్పుకోవ డంలేదని ఫోనులో కంట్రాక్టరుతో చెపుతోంటే ఆయన క్షణకాలం సిగ్గుపడ్డాడు.

అవతలి ఆయన ఈ ఇబ్బంది గ్రహించిన ట్టున్నాడు. ఎంత వాళ్ళమైనా, భార్యాబిడ్డల విషయంలో మామూలు వాళ్ళమే అంటూ జోక్ చేయగానే ఈయన కూడా నవ్వేశారు. ముగ్గురూ కారు రాగానే బయలుదేరారు.

ఇంటర్వెల్లో మేనేజరే కూల్‌డ్రింక్ పట్టించు కొని వచ్చాడు. వాళ్ళు వద్దన్నా విన్పించుకో కుండా బలవంతం చేశాడు "యం.ఎల్.ఏ గారంటే ఏమిటనుకొన్నావు?" భార్యతో నవ్వు తూ అన్నారు ఆయన అతడు వెళ్ళిపోయాక.

"బావుంది సంబరం. రేపు ఏ పనో చేసిపెట్ట మని వచ్చి కూర్చుంటాడు లెండి'' ఆవిడ వాస్తవాన్ని విప్పి చెప్పేసింది.

"అదికాదే! నన్ను పెళ్ళి చేసుకోబట్టి కదా నీకు ఈ హోదా, రాచమర్యాదలూ'' ఆయన ఎగతాళిగా అన్నారు.

"మీ నాన్నగారే ఒప్పుకొన్నారు. నేను మీ ఇంటికి వచ్చినవేళ మీకు కలిసి వచ్చిందని. ఇంక మీ సంగతెందుకు? డబ్బు, పిల్లలు, హోదా ఇవన్నీ నా వెనుకనే వచ్చినవి కదా!" ఆవిడ నవ్వుతూనే చెప్పేసింది.

తల్లిదండ్రులిద్దరూ మాట్లాడుకొంటూంటే రాణి వింటూ బయటకి చూస్తున్నదల్లా త్రుళ్ళిపడింది. ఆవిడకటుపక్క విద్య, ఆమె తండ్రి నిలబడి కూల్‌డ్రింక్స్ తాగుతున్నారు. తర్వాత విద్యవద్దన్నా వినకుండా ఆయన చాక్‌లెట్స్ కొని ఇస్తున్నారు.

వాళ్ళిద్దరినీ చూడగానే రాణికి అర్థమైపోయింది విద్యంటే ఆయనకి ఎంత అభిమానమో! తన తండ్రి, తనలాగ ఎవరూ ఉండకూడదనుకొంటుంది రాణి ఎప్పుడూ.

సారధి, విద్య లోపలకి వచ్చి బాల్కనీలోనే కూర్చున్నారు. వాళ్ళు ముందు వరుసలో కూర్చోవడంవలన రాణీవాళ్ళని వాళ్ళు చూడలేదు.

సినిమా అయిపోయే సమయానికి డ్రైవరు వచ్చాడు. రాణి కావాలనే, వాళ్ళు చూడాలనే జాప్యం చేసి కారు ఎక్కింది. మేనేజరు కారు దగ్గరకి వచ్చి సెలవు తీసుకొన్నాడు. విద్య, సారధి, రాధమ్మ రిక్షాలు మాట్లాడుకొని ఎక్కారు.

సారధి భార్యకి యం.ఎల్.ఏ ఎక్కి వెళుతున్న కారుని చూపిస్తూ వాళ్ళ గురించి చెప్పాడు. ఆయనకి యం.ఎల్.ఏగారితో కాస్త ముఖపరిచయం ఉంది. విద్య వాళ్ళ అమ్మాయే తమ స్కూల్లో చదువుతోందని తండ్రికి చెప్పింది.

ఇంటికి వచ్చినా రాణి కళ్ళకి తెల్లటి పట్టుపరికిణి, తెల్లటి జాకట్టులో మెరిసిపోతున్న విద్యే కనబడసాగింది. ఒకవైపు విద్య, మరొకవైపు రాధమ్మ కూర్చుంటే మధ్యలో కూర్చుని కబుర్లు చెపుతున్న సారధి జ్ఞాపకం వచ్చారు. ఎప్పటికో కానీ రాణికి నిద్రపట్టలేదు.

మర్నాడు స్కూల్లో విద్య, రాణీవాళ్ళు సినిమాకి కారులో వచ్చిన విషయం ఫ్రెండ్స్‌కి చెప్పింది.

"ఆ... అదొక ఎరువుకారు బడాయిలే' కస్తూరి వెనక కూర్చున్నవాళ్ళు వినేలాగ గట్టిగా అంది.

ఒకరిని మనం అనవసరంగా అనడం ఎందుకు? వాళ్ళచేత పడటం ఎందుకని విద్య వాదన. కస్తూరి వింటేకదా!

వాళ్ళు మనల్ని ఎన్నిరకాలుగా అంటున్నారు, మనం కూడా అనడంవలన తప్పులేదంటుంది కస్తూరి. పైగా కొందరు వాళ్ళ వస్తువులు కాకపోయినా సిగ్గులేకుండా హోదా వెలగపెడతారని వ్యంగ్యంగా ఏమేమో అంది.

రాణి చెవులని వద్దన్నా వాళ్ళన్న మాటలు పడుతూనే ఉన్నాయి. పైగా బట్టలు కూడా ఎరువేనా, నగలు కూడా ఎరువేనా అంటూ కస్తూరి, జ్యోతి ఒకళ్ళపై ఒకళ్ళు పెట్టుకుంటూ నవ్వుకుంటున్నారు. రాణి కళ్ళు రోషంతో మెరిశాయి.

సాయంత్రం ఇంటికి వెళ్ళగానే తండ్రి కూర్చున్న హాలులోకి వెళ్ళింది. ఆయన కూతురిని చూసి పలకరించి, దగ్గర కూర్చోబెట్టుకొన్నారు. అందరూ వెళ్ళేవరకూ ఊరుకొంది. తర్వాత తండ్రిని సూటిగా అడిగింది

"డాడీ! మనకి డబ్బు భాగానే ఉందికదూ!"

ఆయనకి కూతురికి ఆ సందేహం ఎందుకొచ్చిందో అర్థమవలేదు.

అదే అడిగారు రాణిని "ఏమిటమ్మా! నీకు ఇప్పుడా సందేహం ఎందుకు వచ్చింది?" అంటూ.

"నేనంటే మీకు చాలా ఇష్టంకదూ నాన్నా!




మన పరిస్థితి ఏమిటో నాకు ఇప్పుడు కావాలి. చెప్పండి... అందుకే అడిగాను'' అని తండ్రిని సూటిగా చూస్తూ అడిగింది.

"అవన్నీ నీకు ఎందుకమ్మా! నీకు ఏం కావలసినా అడుగు. క్షణాల్లో తెప్పించి ఇస్తాను'' అని ఆయన కూతురిని ప్రేమగా చూస్తూ అన్నారు.

తమకి ఒక కారు కొనమని రాణి అడిగింది. ఇంత పేరు ప్రతిష్ఠలుండి ఇన్నాళ్ళూ తనకి ఆ ఆలోచన రానందుకు ఆయన నొచ్చుకొన్నారు. కూతురు కారు కావాలని ఎందుకు అడుగుతోందో ఆయన తెలుసుకోవాలనుకొన్నారు. రాణి చెపుతుందా? ఊహూ... మరొక్క విషయం కూడా ఆ అమ్మాయి చెప్పలేదు.

కారుమాత్రం కొనితీరాలని పట్టుపట్టింది. ఇతరుల కారు తమకి ఇంక వద్దంది. ఆయన రాణిని తేరిపార చూశారు. తర్వాత అలాగే కొంటానని హామీ ఇచ్చారు.

"మా నాన్న బంగారు నాన్న'' అంటూ రాణి ఆయన బుగ్గమీద ముద్దుపెట్టింది. ఆయన పితృహృదయం దానితో పొంగిపోయింది.

ఎం.ఎల్.ఏ.గారు రాత్రి భోజనాలయ్యాక కొడుకులని తన గదిలోకి రమ్మన్నారు. వాళ్ళు ఆశ్చర్యంగా ఒకళ్ళమొహాలు ఒకరు చూసుకొన్నారు. ఎదురు ఎందుకని ప్రశ్నించడం వాళ్ళకి అలవాటులేదు.

పెద్దకొడుకు సుదర్శన నాయుడు డాక్టరు. రెండవవాడు కేశవనాయుడు సి.ఎ. చదివి, ప్రైవేటుగా జాబ్ చేస్తున్నాడు. మూడవవాడు మాధవ బి.యస్‌సి.తో చదువు ఆపేశాడు. తండ్రి అధికారం, తల్లి గారాబం అతడికి చదువుని వంటపట్టనీయలేదు. డిగ్రీయే మూడుసార్లు రాసి, తండ్రి పరపతితో చివరిసారి పాసయ్యాడు.

ఎం.ఎల్.ఏ.గారికి పాతిక ఎకరాల వరకూ మంచి పొలం ఉంది. ఆ పొలం విషయాలు చూడటానికి చెల్లెలు, బావగారు ఉన్నారు. అయినాసరే అంతా వాళ్ళపై వదలడం ఆయనకి ఇష్టం ఉండదు. చిన్న కొడుక్కి పొలం వ్యవహారాలు, ఇంటి విషయాలు చూడమని అప్పచెప్పారు ఆయన.

పెద్దవాళ్ళిద్దరూ రెండు చేతులా సంపాదిస్తున్నారు. ఎం.ఎల్.ఏ.గారికీ డబ్బుయావ ఎక్కువే. రాజకీయాల్లో ఉండి డబ్బు సంపాదించడం మరీ సులభం.

తండ్రి ఏవైనా సూచనలు తమకి చెయ్యడానికి మాత్రమే పిలుస్తూ ఉంటాడని వాళ్ళకి తెలుసును. ఇద్దరూ తమ సంపాదనలో కావలసినది ఉంచుకొని మిగిలినది ఆయన చేతులలోనే పోస్తారు. ఆ డబ్బు గురించి ఏనాడూ మళ్ళీ వాళ్ళు అడగరు. పద్మనాభనాయుడు ముగ్గురు కొడుకులనూ గర్వంగా ఒకసారి చూసుకొన్నారు.

చిన్నకొడుకుని ఆయన రాజకీయాలలోకి దింపాలని అనుకొంటున్నారు. తన తర్వాత పేరు నిలబెట్టవలసినది అతడేనని అనుకొంటారు. మాధవ ఆకారం, బుద్ధి కూడా ఎదుటివారిని భయపెట్టేదిగానే ఉంటుంది.

ఆయన పెద్దకొడుకుతో తాను కారు కొందామనుకొంటున్నానని చెప్పారు. అతడు మొదట ఆశ్చర్యపోయాడు. తాను వింటున్నది నిజమేనా అని అనుకొన్నాడు. ఎంతసేపూ పొలాలు, ప్లాట్లు కొనడానికి మాత్రమే తండ్రి ఉత్సాహం చూపిస్తాడు. అలాంటిది కారు... అందుకే తండ్రి మొహంలోకి ఆశ్చర్యంగా చూశాడు.

మర్నాడు వెళ్ళి మంచి కారు కొనుక్కొని వచ్చేపని పెద్దకొడుకుపై ఉంచారు. చెక్కు మీద సంతకం పెట్టి ఇచ్చారు కావలసినది తీసుకోమని. మాధవ ఆనందానికి పట్టపగ్గాలు లేవు. తండ్రి ఎదురుగా లేకపోతే గంతులు వేసేవాడే.

ఆయన ఆ విషయం చెప్పడానికే పిలిచానన్నారు. వాళ్ళు వెళ్ళిపోబోతుంటే, ఆపి అన్నారు "చూడు సుదర్శనా! రాణికి ఏ రంగు కారు కావాలో అడిగిమరీ వెళ్ళు. మరిచిపోకు నేను

చెప్పిన సంగతి. అంతేకాదు ఈ వారంలో రాణి పుట్టినరోజు వస్తోంది. ఆ రోజుకి మనం దాన్ని ఆమెకివ్వాలి'' ఆయన ఆ విషయం ఒక శిలాశాసనంలాగ చెప్పారు.

రాణి పుట్టినరోజు ఇంట్లో అందరూ ఈ ఏడాది మరీ బ్రహ్మాండంగా చేశారు. పట్టుపరికిణీ, జాకెట్టు, రాళ్ళనెక్లసు, రాళ్ళ గాజులు అన్నీ అలంకరించుకొని రాణి నిజంగా లక్ష్మీదేవిలాగే ఉంది.

ఎరుపురంగు టయోటా కారులోనుండి ఠీవిగా దిగుతున్న రాణిని చూసి స్కూలంతా ఆశ్చర్యంగా, ఆనందంగా చూశారు. పాపం... హెడ్‌మేష్టారు కారు వచ్చి స్కూలుముందు ఆగగానే ఏ కలెక్టరో వచ్చారనుకొని గాబరాగా ఇవతలకి వచ్చేశారు. తీరా చూస్తే కారు బాక్‌డోర్ డ్రైవరు తీసి పట్టుకొంటే రాణి, చిన్నన్న అందులోనుండి దిగారు. హెడ్‌మేష్టారుకి నవ్వు ముఖాన పులుముకొని వారిని పలకరించక తప్పలేదు. రాణిని తోటిపిల్లలు అపురూపంగా చూస్తున్నారు.

చెల్లెలు సరదాపడిందని వాళ్ళ నాన్నగారు కొత్తకారు కొన్నారనీ, మేష్టర్లందరికీ పార్టీ ఇమ్మన్నారనీ చెప్పి ఓ వందరూపాయలు హెడ్‌మేష్టారు చేతిలో ఉంచాడు మాధవ. పిల్లలకి పంచమని స్వీట్లు రాణికి ఇచ్చాడు.

అతడు వెళ్ళబోతూ సత్యం మేష్టారిని సాయంత్రం రాణితో కలిసి ఇంటికి రమ్మని నాన్నగారు చెప్పారన్నాడు.

అదేదో మహాప్రసాదం అన్నట్లు సత్యంమాష్టారు ఆనందంతో తల ఊపారు.

రాణి క్లాసులో కూర్చున్నాక కస్తూరీ వాళ్ళను చూస్తూ అంది "ఇది మా స్వంతకారు. ఇది ఎరువుకారు కాదు. మాకు కారు కొనాలంటే వారంరోజులు పట్టలేదు. అదే మీలాంటివాళ్ళు కొనాలంటే జన్మంతా పడుతుందికాబోలు కదూ!" దానితో కస్తూరి మొహం మాడిపోయింది.

సాయంత్రం రాణి ఫ్రెండ్సందరూ కారులో వస్తామని అడిగారు. రాణి వాళ్ళను తర్వాత ఎప్పుడైనా తీసికెళతాననీ, ఇప్పుడు వీలవదనీ చెప్పి సత్యంమేష్టారితో వెళ్ళిపోయింది. తండ్రి స్నేహితులను ఎక్కించినందుకు ఏమీ అనకపోయినా తల్లిమాత్రం ఊరుకోదని రాణికి తెలుసు.

ఎం.ఎల్.ఏ.గారు సత్యంమేష్టారితో కాసేపు లోకాభిరామాయణం మాట్లాడారు. తర్వాత నెమ్మదిగా అసలు విషయంలోకి వచ్చారు. స్కూల్లో ఎవరో మా రాణిని కవ్వించడమో, హేళనగా మాట్లాడటమో చేసి ఉంటారు. రాణి కోరిక తీర్చడంకోసం ఈ కారు కొన్నాను'' అని ఆయన ఒక్కక్షణం ఊరుకొన్నారు.

"పంతం పడితే రాణి ఏదైనా సరే చేయిస్తుంది. సరే! ఇది కారుకనుక అయిపోయింది. మరేదైనా అయితే ప్రమాదం. కనుక కాస్త రాణిని కనిపెట్టుకొని ఉండండి'' ఆయన నెమ్మదిగానే అయినా తీవ్రంగా హెచ్చరించినట్లుగా అన్నారు. రాణి చదువు విషయం జాగ్రత్తగా చూడమని కూడా చెప్పారు.

సత్యం మేష్టారికి తిన్న టిఫిను గొంతుకలోనే ఉండిపోయినట్లు అన్పించింది. బ్రతుకుజీవుడా అనుకొంటూ ఆయన దగ్గరనుండి సెలవు తీసుకొని బయటపడ్డారు.

ఎం.ఎల్.ఏ.గారి పినతండ్రి మనవడు పదవతరగతి పరీక్షలు రాస్తున్నాడు.

అప్పటికే ఆ అబ్బాయికి మార్చిలో పరీక్ష పోయింది. ఈసారి వాళ్ళు ఎం.ఎల్.ఏ.గారి సహాయం ఉంటుందిగదా అని ఇక్కడి సెంటరుకు పెట్టారు. ఆయన కల్పించుకోకపోయినా, ఆయన పలుకుబడి ఉపయోగపడుతుందని!

రాణి తల్లి కనకమ్మకి బంధుప్రీతి ఎక్కువ. వచ్చిన చుట్టాలదగ్గర తన నగలు, దర్జా, డాబు చూపించటం ఆవిడకి ఇష్టం. నౌకర్లు, ఆస్తి అంతస్థు తనకి భగవంతుడు ఎంతగా ప్రసాదించాడో అందరికీ తెలిసేలాగ ప్రవర్తించడం ఆమెకి అలవాటు.

పదిమంది బంధువులూ తమని పొగిడితే కీర్తిశిఖరాలు అధిరోహించినట్లు భావిస్తుంది.




బంధువులకి డబ్బు దోచి పెట్టనంతవరకూ ఆవిడ ఏం చేసినా ఆయన ఊరుకొంటారు. అందుకే మరిది విషయం చూడమని మాధవ నాయుడికి అప్పచెప్పిందామె.

బంధువులకి కూడా ఎక్కడ ఎవరిని ఎలాగ పట్టాలో బాగా తెలుసు. అందుకే కొడుకు పరీక్ష ఈసారి ఎలాగైనా పాసయ్యే లాగ చూడమని వారందరూ ఆవిడగారినే అర్థించారు.

ఆయనవరకూ ఇటువంటివి వెళ్ళడం ఎందుకని భర్తకి చెప్పలేదు ఆవిడ. మాధవకి అప్పచెపితే చాలు పని పూర్తవుతుందని ఆవిడ నమ్మకం.

కొడుకుని వాళ్ళ ఇంట్లో ఉంచేసి ఆ వచ్చిన వాళ్ళు వెళ్ళిపోయారు.

ఆ సెంటరుకి డిపార్టుమెంటల్ ఆఫీసర్‌గా సారథిగారిని వేశారు. ఆయన అక్కడ ఉన్నారనగానే సగంమంది విద్యార్థులు ఉసూరుమన్నారు. సారథిగారితోపాటు మరొక ఇద్దరు స్ట్రిక్ట్ ఇన్విజిలేటర్లు కూడా అక్కడే నియమించబడ్డారు.

సారథిగారు మొదటే చెప్పారు ఎటువంటి అవకతవకలూ పరీక్షలలో జరగడం తనకి ఇష్టంలేదని. ఇష్టం ఉన్నా, లేకపోయినా అందరూ ఖచ్చితంగా ఉండాలన్నారు.

అయితే హిందీ పరీక్షనాడే గొడవ ప్రారంభమైంది. మాధవనాయుడు వచ్చి తమ తమ్ముడు పరీక్ష రాస్తున్నాడనీ, ఈ ప్రాంతం కొత్తని, అతడిని జాగ్రత్తగా చూడమని సారథికి చెప్పాడు. తనకి తాను ఎం.ఎల్.ఏ.గారబ్బాయిగా పరిచయం చేసుకొన్నాడు.

విద్యార్థుల సౌకర్యం చూడటం తమ విధి అనీ, పరీక్ష రాయడంలో అతడికి ఏ ఇబ్బంది ఉండదనీ, తాను తప్పక చూస్తాననీ చెప్పాడు సారథి. మాధవనాయుడు ఆయన మాటలతో అమ్మయ్య అనుకొన్నాడు. మిగిలిన మాష్టార్లు ఏదో చెపితే, ఆయన గురించి తేలికగా నమ్మేశాననుకొన్నాడు. ఇప్పటి సారథి మాటలు చూస్తే తమకి గౌరవాన్ని ఇస్తున్నట్లే ఉన్నాయి. డిపార్టుమెంటల్ ఆఫీసర్ తమవాడేననీ, బాగా పరీక్షలు రాయమనీ అతడు తమ చుట్టాలబ్బాయికి చెప్పాడు.

మాధవ ఇచ్చిన ధైర్యం వాడిని ఉత్సాహపరిచింది. వాడు అతి ధీమాగా హిందీ స్లిప్పులు జేబులో పెట్టుకొని వెళ్ళాడు. వాడి రూమ్‌కి వచ్చిన ఇన్విజిలేటర్ వాడు నమస్కారం చేయగానే తల ఊపాడు. మాధవ, ఎం.ఎల్.ఏ.గారు అతడికి బాగా పరిచయమే.

పేపర్లు పిల్లలకి ఇచ్చేసి, ఆయన వసారాలోని ఇన్విజిలేటర్‌తో కబుర్లలో పడ్డాడు. ఇటు పిల్లల తప్పుకి ఎంకరేజ్ చేసినట్లూ అవుతుంది, అటు పై అధికారి వచ్చినప్పుడు వాళ్ళని హెచ్చరించినట్లూ అవుతుందని అతడిలాంటి వాళ్ళు ఇలాగ గుమ్మాలలో కాస్తారు. ఎవరైనా వచ్చినప్పుడుమాత్రం ముందుగా తల తిప్పవద్దని, మాట్లాడవద్దని అరుస్తారు.

ఇలాంటి ఇన్విజిలేటర్లు ఏ విషయంలోనూ వాళ్ళ విధిని సక్రమంగా నిర్వహించరు. అటు ఉపాధ్యాయుడిగా కూడా వీళ్ళకి సక్రమంగా పనిచేయడం బద్ధకమే. నిజాయితీ అన్నది ఎవరిలోనైనా ఉంటే అది అన్ని విషయాలలోనూ ఉంటుంది. కానీ ఈరోజుల్లో నిజాయితీపరులు చాలా అరుదుగా ఉంటున్నారు.

తమ స్వార్థప్రయోజనాలకోసం విద్యార్థులను వీళ్ళు పక్కదారులు పట్టిస్తున్నారు. నిజంగా పరీక్షలు స్ట్రిక్టుగా జరుగుతున్నప్పుడు ప్రతీ విద్యార్థి భయపడి చచ్చినట్లు బాగా చదువుతాడు. దొడ్డిదారులకోసం అలమటించడు.

ఇన్విజిలేటర్లు కబుర్లలో పడేసరికి ఆ రూం పిల్లలకి బాగా ధైర్యం వచ్చేసింది. బుట్టలో నుండి పాములను ఇవతలకి లాగినట్లు జేబులలోనుండి, ఫాంట్లలోనుండి, చొక్కా కాలర్లలో నుండి స్లిప్పులను బయటకి తీసేసి వాళ్ళంతా అతి ఉత్సాహంగా రాస్తున్నారు. సారథి స్కూలు అంతా రౌండు తిరుగుతున్నాడు. ఇటు వచ్చినప్పుడు సున్నితంగా ఒకసారి ఇన్విజిలే

టర్లని రూం చూడమని హెచ్చరించాడు. అతడు ఉన్నకాసేపు వాళ్ళు రూంలో పచార్లు చేశారు.

ఇది పనికాదని సారధి కిటికీలదగ్గరనుండి వెనకవైపుగా వచ్చి గమనించడం మొదలుపెట్టాడు. దానితో కొన్ని రూంలలోని పిల్లలు భయపడి స్లిప్పులు బయటపారేశారు.

కాస్త మొండివాళ్ళు మాత్రం పట్టుకొనే కూర్చున్నారు. హిందీ ఒకటే పేపరు. ఎలాగైనా పాసవ్వాలని వాళ్ళ బాధ. కాని ఓ అరగంట దాటిన తరువాత సారధి చాలా మందిని బుక్ చేసేశాడు. యం.ఎల్.ఏ.గారి చుట్టాలబ్బాయి కూడా స్లిప్పు రాస్తూ పట్టుబడ్డాడు. దానితో ఇన్విజిలేటరు పని కుడితిలోపడ్డ ఎలకలా అయిపోయింది.

అతడు ఎవరి తాలూకాయో పక్కకి తీసుకెళ్ళి సారధికి చెప్పాడుగానీ సారధి అటువంటి సమయంలో ఇటువంటి విషయాలు చెప్పడం తప్పని అతడిని మందలించాడు. సరిగ్గా సారధి వాళ్ళ పేపర్లు తీసికొని, బుక్‌చేస్తున్న సమయానికి డి.ఇ.ఓ.గారు వచ్చారు ఫ్లయింగ్ స్క్వాడ్‌తో.

సారధి ఆ సెంటరులో ఆరుగురిని బుక్‌చేయడం, డి.ఇ.వో. కూడా వాళ్ళ స్లిప్పులు, పేపర్లు చూడటంతో ఎవరూ ఏమీ చేయలేకపోయారు. హిందీనాడు స్క్వాడ్ రావచ్చునని అనుకొంటున్నా, ఇంతమంది బుక్ అవుతారని మాత్రం ఎవరూ అనుకోలేదు.

సరిగ్గా డి.ఇ.ఓ. వెళ్ళిపోయిన అరగంటకి మాధవనాయుడుకి తమ కుర్రవాడు బుక్ అయ్యాడని తెలిసింది. దానితో అతడు నిప్పులు తొక్కిన కోతిలాగ అయ్యాడు. పరీక్ష అయ్యే సమయానికి సెంటరుకి పదిమంది స్నేహితులతో వచ్చిపడ్డాడు. ఇది చూసి కొందరు ఏం గొడవ అవుతుందో అని భయపడ్డారు.

సారధిమాత్రం నిర్వికారంగా ఇన్విజిలేటర్ల దగ్గరనుండి పేపర్లు తీసికొంటున్నాడు. మాధవనాయుడుకి ఆవేశం వస్తే ఉచ్చం, నీచం ఉండదు. సారధిని గదిలోనుండి ఇవతలకి రమ్మనమని కేకలు వేయడం మొదలుపెట్టాడు.

సారధి చీఫ్‌కి ఆ పని అప్పచెప్పి ఇవతలకి వచ్చాడు.

"మావాడిని బుక్ చేస్తావా? నీకు ఎన్ని గుండెలు?" అని అరవడం మొదలుపెట్టాడు.

సారధిమాత్రం తాపీగా వాళ్ళ కాండిడేట్ స్లిప్పు పెట్టాడని, దానిని రాస్తోంటే తప్పక బుక్ చేయవలసిందని చెప్పాడు.

"వాడిని జాగ్రత్తగా చూడమని నీకు చెప్పలేదా?" అంటూ అతను ఏకవచనంలోకి దిగాడు.

సారధికి అతడి ప్రవర్తన చూస్తే అసహ్యమేసింది.

జాగ్రత్తగా చూస్తానని చెప్పి, ఇప్పుడు ఈవిధంగా బుక్‌చేయడం వెధవపనికాదా అని మాధవనాయుడి కేకలు. తను జాగ్రత్తగా చూస్తానంటే అతడికి భయం లేకుండా రాసేలాగ చూస్తానని, ఏ మంచినీళ్ళో కావాలంటే అందే ఏర్పాటు చేస్తాననికానీ ఇలాగ అవనీతికి వదులుతానని కానని సారధి వాదన.

ఎవరికి ఎవరూ తగ్గకుండా మాటలు అనుకొన్నారు. ఎందరో పరీక్షలకి వస్తున్నప్పుడు కాస్త మావాడిని చూడండి సార్ అంటూనో, మా అమ్మాయిని చూడండి అంటూనో మామూలుగా చెప్తారు. అంతమాత్రానికి వాళ్ళందరికీ స్లిప్పులు అందించమని అర్ధమా? అవినీతిని ప్రోత్సహించమని చెప్పడమా? కానేకాదని సారధి అభిప్రాయం.

చివరికి ఆ ఇద్దరూ తీవ్రంగా కోట్లాడుకోవడం చూసి పోలీసులకి రంగంలోకి రాక తప్పలేదు. అయిందేదో అయిపోయాక ఇప్పుడు గొడవచేసుకొని ప్రయోజనం ఏమిటని వాళ్ళు ఇద్దరినీ వెనక్కితీశారు.

ఒక యం.ఎల్.ఏ. కొడుకు వచ్చి చెప్పినా సారధి అలాగ ప్రవర్తించడం తలపొగరు విషయమని మాధవనాయుడి వాదన.

ఎవరైనా తన దృష్టిలో సమానమేనని, తన




విధిని తను నిర్వహించడమే తన కర్తవ్యమని సారధి వాదన!

ప్రభుత్వం తనకు అంత డబ్బు ఇచ్చి, ఒక డ్యూటీకి నియమించినప్పుడు నిజాయితీగా ఆ విధిని నిర్వహించడం తన ధర్మమని, ఇటు వంటి విషయాలకి తాను చలించనని సారధి అంటూంటే చీఫ్ వాళ్ళు ఆయన ధైర్యానికి ఆశ్చర్యపోయారు.

బోడి ఉద్యోగం చూసుకొని ఎగిరపడటం మంచిదికాదని, తనలాంటివాడితో తగాదా పడితే ఫలితం దారుణంగా ఉంటుందని హెచ్చరించి మాధవనాయుడు అక్కడివాళ్ళ బలవంతంతో వెళ్ళిపోయాడు.

సారధి ఏమీ భయపడలేదు. ఇటువంటి బెదిరింపులకి తను ఎంతమాత్రం భయపడననీ, ఇకమీదట అయినా జాగ్రత్తగా ఉండమనీ హెచ్చరించాడు.

మరిది పిల్లవాడిని తీసికొని వెళ్ళిపోయేటప్పుడు వదినగారిని నిష్ఠూరపు మాటలకి గురి చేసి మరీ వెళ్ళాడు. కనకమ్మమాత్రం ఏం చేయగలదు? తండ్రి కడుపున చెడబుట్టాడనీ, ఒక్కపని కూడా తెముల్చుకొని రాలేడనీ మాధవనాయుడిని తిట్టిపోసింది. ఈ విషయాలన్నీ పద్మనాభనాయుడు చెవివరకూ వెళ్ళాయి.

ఆయన మాధవనాయుడిలాగ తొందరపడే మనిషి కాదు. బయటకి ఏమీ ఎవరితో అనలేదు. కొడుకునుమాత్రం పిలిచి పిచ్చ చివాట్లు పెట్టారు. ఎవరు ఎలాంటివారో ముందుగా తెలుసుకోలేకపోవడం అతడి తప్పని దెబ్బలాడారు.

ఏవైనా ఏర్పాట్లు చేయదలచుకొంటే గుట్టుగా చెయ్యాలి. తప్పుకి దొరకనివిధంగా చెయ్యాలి. అంతా జరిగిపోయాక సెంటరుకి వెళ్ళి వాళ్ళతో తగాదా పడటం ఎందుకని, పదిమంది దృష్టిలో తమ విలువ ఏమవుతుందని మొహం వాచేలాగ చివాట్లుపెట్టారు.

ఇటు సారధిచేత చివాట్లు, అటు తండ్రిచేత చివాట్లు, అటు తల్లి సాధింపు మాధవనాయుడుని చిరాకుపెట్టేశాయి. వాళ్ళ సంగతి చూడకుండా నేను వదిలేస్తానా అని మనసులో గట్టిగా శపథం చేసుకొన్నాడు.

పట్టణంలోని వాతావరణానికి ఏమాత్రం తీసిపోదు రాణీవాళ్ళ స్కూలు వాతావరణం. సారధి చేసిన పని మంచిదికాదని, పెద్దవారితో తగాదా పడటం అవివేకమని కొందరు, సారధిని అభినందించి అతడు మంచిపనే చేశాడని మరికొందరు అనుకొన్నారు.



నెహ్రూ పుట్టినరోజుకి స్కూల్లో సందడి ప్రారంభమయింది. పిల్లలకి అన్నిపోటీలు పెట్టారు. విద్యకి సరదా ఎక్కువ. తండ్రినడిగి అయిదు రూపాయిలు తీసుకొని అన్నింటికీ కట్టింది.

వ్యాసరచన అప్పటికప్పుడు చెపుతామని, పావుగంట టైము ఇస్తామని, అలాగే ఉపన్యాసం కూడానని ఉపాధ్యాయులు చెప్పారు. విద్య వ్యాసానికి అయిదారు విషయాలకి సిద్ధపడి వచ్చింది. విద్య క్లాసులోవారు ఎక్కువమందే కట్టారు.

మధ్యలో ఏ కాస్త టైం దొరికినా పిల్లలు ఒకరితో ఒకరు చర్చించుకొంటున్నారు. మూడవ పీరియడ్‌లో పోటీ పెట్టేశారు. రాష్ట్రాన్ని ఉత్తేజపరుస్తున్న సమస్య 'మద్యపాన నిషేధం' కనుక దానిమీద వ్యాసం రాయమన్నారు.

మద్యపానం గురించీ, దానివలన నష్టాల గురించీ అన్ని విషయాలూ రాయమన్నారు.

పిల్లలు ఒక పావుగంట స్పీడుగా రాసి, తర్వాత ఆలోచనలో పడ్డారు.

'అలాగే ఉపన్యాసం నిరక్షరాస్యతపై మాట్లాడమన్నారు. 'నిరక్షరాస్యత నిర్మూలనం' అన్న విషయం వినగానే కొందరు మానేశారు. కొందరుమాత్రం పాయింట్లు పుస్తకాలలో దొరుకుతాయేమోనని చూశారు. పోటీలు అవగానే పిల్లలు ఇంటిదారి పట్టారు. పాటల పోటీ మర్నాడని చెప్పడంతో దానికి సిద్ధమవసాగారు.

సినిమా పాటలైనా పాడవచ్చునని తెలియడంతో బోలెడుమంది పాటలపోటీకి కట్టేశారు. కస్తూరి పాటలు బాగా పాడుతుంది. అందరం సరదాగా పాల్గొందామని నిర్ణయించుకొని ఏ ఇద్దరు కూర్చున్నా సన్నగా పాడుకోసాగారు.

విద్యకి ఇలాంటి పోటీలంటే ఎంతో ఇష్టం. తల్లి సంగీతం నేర్చుకోవడంవలన విద్యకి ఆవిడ అటు సంగీతం, ఇటు లలిత సంగీత పాటలు నేర్పింది. సినిమా పాటలు మంచివీ, బావున్నవీ పాడుతూనే ఉంటుంది విద్య.

పాటలపోటీలో జడ్జీలు కూడా సత్యంమేష్టారిని, మేడమ్‌గారిని, ఇంగ్లీషు మాష్టారిని పెట్టారు. కస్తూరి వీళ్ళని చూడగానే నేను పాడనని చెప్పేసింది మొహం ముడుచుకొని. జ్యోతి, విద్య దెబ్బలాడారు పేరు ఇచ్చి మానటమేమిటని.

తొమ్మిదవ తరగతి అమ్మాయికి సెకండ్, కస్తూరికి మూడవ ప్రైజు వచ్చాయని చెప్పారు. అక్కడనుండి ఫస్టు విద్యకని కొందరు, రాణికని కొందరు పందెంకట్టడం మొదలుపెట్టారు. పిల్లలను ఊరించి ఊరించి రాణికి ఫస్టని చెప్పేశారు.

విద్యకి చాలా నిరుత్సాహంగా అన్పించింది. ఆ అమ్మాయి 'గాంధి పుట్టిన దేశం, రఘురాముడు ఏలిన రాజ్యం' అని మంచి పాటే బాగా పాడింది. అయినా రాలేదు. అబ్బాయిలలో మురళికి సెకండ్ వచ్చింది. అతడు 'గాంధి పుట్టిన దేశమా ఇది, నెహ్రు కోరిన సంఘమా' అంటూ పాడాడు.

నవంబర్ పధ్నాలుగునాడు ప్రైజులు చదవడం మొదలుపెట్టారు. ఉపన్యాసంలో ఫస్టు విద్యది, వ్యాసంలో సెకండ్ కూడా విద్యకి వచ్చింది. వ్యాసరచనలో ఫస్టు రాణికే ఇచ్చారు. ఉపన్యాసంలో సెకండ్ మగపిల్లాడికి వచ్చింది.

విద్య ఏమీ మాట్లాడకుండా ప్రైజులు పుచ్చుకుని వచ్చేసింది. జ్యోతిమాత్రం సత్యంమేష్టారిని విద్య బాగా పాడిందికదా, ప్రైజు ఎందుకు ఇవ్వలేదని అడిగింది. మిగతా వాటిల్లో వచ్చాయికదా అని ఇందులో వేరొకరికి ఇద్దామనుకున్నామని చెప్పారు. దానితో మరీ ఒళ్ళు మండింది జ్యోతికి.

మరి రాణికి పాటలలో, వ్యాసంలో ఎలా ఇచ్చారని అడిగింది. ఆయన జ్యోతిని చురచురా చూస్తూ వెళ్ళిపోయారు. జ్యోతికి విద్యతో స్నేహం చేశాక ఉపన్యాసాలలో పాల్గొనడం అలవాటైంది. ఆ అమ్మాయికి థర్డు ప్రైజు ఉపన్యాసంలో వచ్చింది.

మర్నాడు స్కూలుకి వచ్చాక జ్యోతి, కస్తూరి చెప్పిన విషయం వింటే విద్యకి మతిపోయినట్టయింది. కావాలంటే జ్యోతి ఆధారం చూపిస్తానంది. విద్యకి కూడా కుతూహలం పెరిగింది. ఆరోజు మధ్యాహ్నం రాణీవాళ్ళు భోజనాలకి వెళ్ళాక జ్యోతివాళ్ళ పుస్తకాల దగ్గరికి విద్యని తీసుకెళ్ళింది.

జ్యోతి రాణి రఫ్ పుస్తకం తీసి చూపించింది. అందులో 'మద్యపాన నిషేధము' మీద సత్యం మేష్టారు రాసిన వ్యాసం ఉంది. అన్ని విషయాలతో వ్యాసం చక్కగా రాయబడి వుంది. మేష్టారి దస్తూరి పిల్లలు బాగానే గుర్తుపట్టారు.

తెలుగు మేష్టారు ముందురోజు సెలవు పెడుతూ టాపిక్ చెప్పి, సత్యం మేష్టారుని గ్రేడ్ టూ తెలుగు మేష్టారిని వ్యాసరచన, ఉపన్యాసం కండక్టు చేయమన్నారు. దిద్దడం ఆయన చేసినా ఫలితమేమిటి! దానికి పర్యవ





సానం ఈ రఫ్‌లోని వ్యాసం.

విద్యకి ఏడుపు వచ్చింది. ఒక మేష్టారు అలాగ చేస్తారని ఎవరనుకొంటారు? ఎవరి మీద తనకోపం చూపించుకోవాలో అర్థమవలేదు. రాణికి ఎందుకో ఉపన్యాసాలంటే పెద్దగా ఇష్టం లేదు కనుక పాల్గొనలేదు. లేకపోతే అదీ ప్రైజు ఇస్తారు కాబోలని కసిగా అనుకొంది.

ఇంటికి వెళ్ళాక కూడా ఆ అమ్మాయి ఏమీ ఉత్సాహంగా లేదు. మురళికి జ్యోతి విషయం బడిలోనే చెప్పింది. అతడు చెల్లెలివైపు జాలిగా చూసి ఊరుకొన్నాడు. ఇంటికి వచ్చాక బాధ పడుతోంటే తన ప్రైజు ఇచ్చి, తీసికోమన్నాడు.

"వెధవ పాటలలో రాలేదని నేనేం ఏడవడం లేదు. వ్యాసం నేను బాగా రాశాను. అయినా సరే సెకండ్ వచ్చింది. టాపిక్ ముందు చెప్పడం తప్పు కాదా? మేష్టారు చక్కగా రాసి ఇస్తే రాయడం గొప్పేమిటి?" విద్య ఏడుస్తూనే అంది. విద్యలో ఉన్న సుకుమారమే అలాగ బాధపడేలాగ చేస్తోంది.

సారధి ఇంటికి వచ్చి విషయం తెలుసుకొని, కూతురిని దగ్గరికి తీసుకొన్నాడు. పోటీలకి వెళ్ళడం సరదాకొద్దీ. వెళ్లిన అందరికీ ప్రైజులు వస్తాయా? అలాగ నిరుత్సాహపడకూడదని బుజ్జగించి చెప్పాడు.

మేష్టారు అలాగ చెప్పెయ్యడం, రాసి ఇవ్వడం తప్పుకాదా అని రోషంగా విద్య అడిగింది. గులాబీ పూవులాంటి ఆ అమ్మాయి మొహం ఎర్రబడిపోయింది. ముక్కు తుడుచుకోవడంవలన ఎర్రగా కందిపోయి మెరుస్తోంది. ఎంత వద్దన్నా ఆ విశాలనయనాలలో రోషం బుస్సున పొంగుతోంది.

సారధికి కూతురిని ఆ స్థితిలో చూడగానే జాలివేసింది. "ఈ సమాజంలో రకరకాల మనుష్యులు, రకరకాల బలహీనతలు ఉంటాయి. ఏ ఒక్కరి వలననో, నలుగురి వలననో మనం మనలోని కళను చంపుకొంటామా? విద్యా! ఒకటి చెబుతున్నాను. విను. ప్రతిభని ఎవరూ ఆపలేరు. వెలుగుతున్న సూర్యుడికి అడ్డం పెట్టి వెలుగుకిరణాలని ఆపగలమా?

ఇలాంటి వాటికి ప్రాధాన్యత నీయకూడదు. ముందుగా చెపుతున్నాను విను. సమర్థులైన వాళ్ళకి ఈ సమాజంలో ప్రతీచోటా భేటీయే. పిరికితనంతో భయపడి వెనుకంజ వేస్తావో, లేక ధైర్యంగా ముందుకు సాగి విజయాలను అందుకొంటావో నీ యిష్టం. నువ్వే నిర్ణయించుకో! ఇలాగ ఏడ్చి మాత్రం బాధపడకు'' సారధిగారు గంభీరంగా కూతురికి సమాజ పరిస్థితుల గురించి చెప్పారు.

మురళికి ఇలాంటివి పట్టవు. ఎంతసేపు తన ఆటలు, స్నేహితులు ఉంటే చాలు. ఎవరైనా ఏదైనా అన్నప్పుడు నాలుగు తన్ని వస్తాడు.

ఎప్పుడు సమయం వస్తే అప్పుడు ఎన్నో విషయాలు చెపుతారు విద్యకి సారధి. తండ్రి మాటలతో విద్య ఆలోచనలో పడింది. కూతురిని మొహం కడుక్కోని రమ్మని ఆయన పేపరు చదువుకొంటూ కూర్చున్నారు.

మర్నాడు స్కూల్లో రాణి కారు దిగి వరండా లోనుండి వస్తోంటే మురళి ఎదురుపడ్డాడు. "ధైర్యం ఉంటే నిజాయితీగా పోటీలలో పాల్గొని, ఎదుటివాళ్ళని ఓడించాలి. దొడ్డిదారిన ఫస్టుప్రైజులు పుచ్చుకొంటే మాత్రం గొప్పేమిటి?" అని సూటిగా అనేశాడు. రాణికి అతడు అంటున్నది మొదట అర్థమవలేదు.

"కాకాలు పట్టడం, విషయాలు ముందు తెలుసుకోవడం తెలివైన పని కాదు'' మళ్ళీ బాణాన్ని వదిలాడు.

రాణి రోషంగా క్రాఫ్ సవరించుకొంది. "ఓడిపోయిన వాళ్ళకి గెలిచిన వాళ్ళమీద ఎప్పుడూ దుఃఖమే'' తల ఎగరవేసి అంది.

"ఇలాంటి గెలుపు సమర్థులైనవాళ్ళకి అవసరంలేదు. నీలాంటి వాళ్ళకి తప్ప'' అంటూ క్లాసులోకి వెళ్ళిపోయాడు. రాణి నిర్లక్ష్యంగా భుజాలవరకూ కత్తిరించుకొన్న జుట్టుని వెనక్కి విసురుకొంటూ వెళ్ళిపోయింది.

"ఏమిటీ విద్య అన్నయ్య అంటున్నాడు'' అంటూ అడిగిన సుధతో "ఏదో వాడి స్వంత ఏడుపు ఏడుస్తున్నాడు'' అంటూ నిర్లక్ష్యంగా జవాబిచ్చి నవ్వింది రాణి.

"గానలహరి'' అని సంగీత సభ ఒకటి ఆ పట్టణంలో వెలిసింది. దానికి సెక్రటరీ వరదాచార్యులు. ప్రెసిడెంటు బంగార్రాజు. బంగార్రాజు నిజంగా బంగారపు బాతే. పెద్ద బంగారం షాపు ఒకటి ఉంది అతడికి. బొటన వ్రేళ్ళకి తప్ప అన్ని వేళ్ళకి ఉంగరాలు, మెడలో గొలుసు, పెద్ద పొట్టతో బావుంటాడు బంగార్రాజు.

ఆయనకి నలుగురు కొడుకులు. ఇద్దరు ఆయనతోపాటు బంగారం షాపు చూస్తారు. ఒకడు బట్టలకొట్టు, మరొకడు స్టీలు కొట్టు పెట్టారు. రెండు చేతులతో అందరూ సంపాదిస్తున్నారు.

యం.ఎల్.ఏగారంటే బంగార్రాజుకి మహా భక్తి. ఆయన కాకితో కబురు పెట్టినా చాలు ఆ పని చేయడమే ధ్యేయమనుకొంటాడు. అతడి వ్యాపారాలన్నీ సజావుగా సాగుతున్నాయంటే ఆయన అండదండలే కారణమనుకొంటాడు.

అసలు వరదాచార్యులు "గానలహరి'' సంస్థస్థాపించడానికి కారణంగా ఓ కథ చెప్పుకొంటారు. వరదాచార్యులు ఉన్న ఏరియాలో కరెంటుకోత ఎక్కువ. కరెంటు ఆఫీసువాళ్ళు గంటన్నర కోత చేస్తే వాళ్ళ వీధిలో ఉన్న తాగుబోతు ఒకడు ఎలక్ట్రిక్ పని వచ్చినవాడు కావడంతో వాడు ఆ వీధిలోని పోల్ దగ్గర ఏ వైరో తప్పించేస్తాడు. దానితో తరచుగా కరెంటులేని రాత్రులే అవుతుంటాయి.

ఎన్నిసార్లో కరెంటు ఆఫీసు వాళ్ళు వాడి మీద రిపోర్టుచేయమని చెప్పారు. కానీ రిపోర్టు చేస్తే వాడు త్రాగి వచ్చి, చేసే గొడవకి భయపడి ఎవరూ చేయలేదు. చచ్చినట్లు ఈ బాధ భరించడం అలవాటు చేసుకొన్నారు.

వర్షాకాలం, శీతాకాలం అయితే ఎలాగో గడిపేస్తారు ఫాన్లు తిరగకపోయినా. కానీ వే

 

సవి రాత్రులు మాత్రం వాళ్ళకి గడ్డురాత్రులే. పోనీ అని వాడికి ఎవరు ఎన్ని విధాలుగా బుజ్జగించి చెప్పినా వాడి బుద్ధి నాలుగు రోజులే. తర్వాత మామూలే.

ఎవరైనా ఎంతకాలమని వాడికి త్రాగడానికి డబ్బు అందించగలరు? దానితో విసిగిపోయి ఊరుకొన్నారు. అలాంటి నిద్రలేని, కరెంటు లేని వేసవి రాత్రులలో ఈ గానలహరి సంస్థ వెలిసి క్రమంగా ఈ "సాహితీసుధ" మంచిపేరు పడిన సంస్థలాగా రూపుదిద్దుకొంది. వాళ్ళ సంస్థ పేరు ప్రతిష్ఠలు, ఫొటోలు పేపర్లలో తరచుగా పడటంతో అందరికీ కీర్తిప్రతిష్ఠల దాహం పట్టుకొంది.

వరదాచార్యులు సంస్కృత పాఠశాలలో రెండవ తెలుగు మేష్టారుగా పనిచేస్తున్నాడు. మనిషి ఎంతో కష్టపడగలడు. ప్రతిభావంతుడు. అయినా ఎటువైపు చూసినా జీవితం చప్పగా ఉన్నట్లు అన్పిస్తోంది.

అందుకే ఆ ఏరియా వాళ్ళందరూ కూర్చుని ఒక వేసవి కాలంలో కరెంటులేని రాత్రిలో ఒక స్థిరనిర్ణయానికి వచ్చారు. తమ ఏరియాకు తమకి ప్రాధాన్యత లభించేపని ఏదైనా చేయాలని వారి ఆలోచన.

వరదాచార్యుల మెదడులో మెరుపులాగ మరొక సాంస్కృతిక సంస్థస్థాపించాలన్న కోరిక వచ్చింది. వెంటనే అందరూ అతడిని అభినందించి, జరగవలసిన కార్యక్రమం గురించి ఆలోచించారు. తర్జన భర్జనలు జరిపారు.

ఇంతలో ఎవరికో సందేహం వచ్చింది సాహితీ సుధకి తమ సంస్థపోటీ అని యం.ఎల్.ఏగారు భావిస్తారేమో అని, మరొకరు వెంటనే "అదేమన్న మాట. ఎవరి గొడవ వారిదే. ఎవరికీ ఎవరితో పోటీ ఉండదు. షావుకార్లలో అన్న బట్టలకొట్టు పెడితే తమ్ముడు మానేస్తున్నాడా? తమ్ముడు మరొకటి పెట్టడం లేదా? అలాగే ఈ సంస్థలు. ఎవరికి తోచినవి వాళ్ళు నిర్వహిస్తారు'' అంటూ తీర్పుచెప్పేశారు.

మిగిలిన వారందరూ అతడి మాటలకి తల

ఊపుతూ అంతే కదా మరి అని వంతపాడారు. సర్లే ఊళ్ళోని మంచి సమర్థుడు సలహా తీసుకొందామని నిర్ణయించుకొని, ప్రిన్సిపాల్ గారింటికి వెళ్ళారు.

మర్నాడు ఆయన వీళ్ల బాధ అంతా విన్నాడు. "పైకి అనకపోయినా మీరు తనకి పోటీగా సాహితీసంస్థ పెట్టారని డాక్టరు సుదర్శన నాయుడు అనుకోడా? గిరిధర్‌తో కలిసి అతడు దాన్ని నిర్వహిస్తున్నాడు కదా!

అలాగని మీ ఉత్సాహాన్ని పాడుచేయడమూ నాకు ఇష్టంలేదు'' అని కాసేపు సీరియస్‌గా ఆలోచించారు. తర్వాత ఈ పని చేస్తే ఎలాగుంటుంది? అని సాభిప్రాయకంగా చూశారు. అందరూ ఆయనవైపు ఉత్కంఠగా చూశారు.

"ఒక సంగీత సంస్థ పెడితే సరిపోతుంది కదా! మన పట్టణంలో ఎలాగో సంగీతసంస్థలేదు'' అని తేల్చి చెప్పేశారు. అది విన్న వరదాచార్యులు నీరుగారిపోయాడు.

"నాకు సంగీతం లోతుపాతులు ఏం తెలుసును?" అని నసిగాడు వరదాచార్యులు.

"బావుందండీ! అందరూ అన్నీ తెలుసుకొని, ప్రావీణ్యం సంపాదించే సంస్థలు నడుపుతున్నారా? చక్కగా ఈ చుట్టుపక్కల విద్వాంసులందరినీ పిలిపించండి. కమ్మగా ప్రజలకి సంగీతం వినిపించండి'' అంటూ సలహా ఇచ్చారు.

ఆయన ఇచ్చిన ధైర్యం, ప్రోత్సాహం అందరికీ బాగానే సరిపోయాయి. సరే. సంస్థ ప్రారంభిస్తున్నామని నలుగురికీ తెలియచేయాలి కదా! ఆ హడావుడిలో పడ్డారు.

ఇటువంటి విషయాలు అతి తొందరగా వ్యాపిస్తాయి. దీని విషయం ఎలా తెలిసిందో బంగార్రాజుకి తెలిసిపోయింది. వరదాచార్యులకి కొడుకు పుట్టాడని తెలిసి అతడి బుర్ర అతివేగంగా పనిచేసి, వారి ఇంటికి తీసికెళ్ళింది. కాస్త రాగిపాలు ఎక్కువ కలిపి ఒక ఉంగరం చేయించాడు. కొత్త చొక్కా, పౌడరు డబ్బా, ఉంగరం పట్టుకొని తన ఇంటికి వచ్చిన బంగార్రాజును చూసి వరదాచార్యులు పొంగిపోయాడు. ఎంత సుదినమంటూ ఆయనని భక్తితో సేవించుకొన్నాడు.

బంగార్రాజు తను తెచ్చిన కానుకలు నెమ్మదిగా వరదాచార్యుల బిడ్డకి అందించాడు. తర్వాత నెమ్మదిగా అసలు విషయం చెప్పేశాడు. బంగార్రాజు తెలివితేటలకి అతడు నిశ్చేష్టుడైపోయాడు.

తనవాళ్ళు స్థాపించుకున్న సంస్థకి ప్రెసిడెంటుగా ఉంటానన్నాడు బంగార్రాజు. అక్కడికే రోటరీక్లబ్బులో మెంబరుగా ఉన్నారు కదా అని అన్నప్పటికీ ఆ క్లబ్బులు వేరు, ఈ కళాసంస్థలు వేరు అని తేల్చి పారేశాడు.

పెద్దవాడితో భేదాభిప్రాయం ఎందుకని వరదాచార్యులు మెంబర్లందరు కలిసిన తర్వాత చెపుతానన్నాడు. బంగార్రాజు మరొక పొడి వేశాడు. తనని కనుక ప్రెసిడెంటుగా ఎన్నుకొంటే సంస్థకి వెయ్యి నూటపదహారులు ఇస్తానన్నాడు.

చివరికి బంగార్రాజే గెలిచాడు. మిగిలిన మెంబర్లందరు మనస్ఫూర్తిగా అతడిని తమ సంస్థ ప్రెసిడెంటుగా ఒప్పుకొన్నారు. కొత్త సంస్థ ప్రెసిడెంటు ఇతడు అయితే సుదర్శననాయుడితో కూడా గొడవ ఉండదు. ఎలాగూ ఇతడు ఆ కుటుంబ భక్తుడే. అందుకే అన్ని విధాలుగా ఆలోచించి అతడిని ప్రెసిడెంటు చేసేశారు.

తర్వాత సంస్థ ప్రారంభసభకు సుదర్శననాయుడినే అధ్యక్షుడిగా పిలిచారు. అతడు ఆ సంస్థ విషయంలో అనుకూలతా చూపలేదు. వ్యతిరేకతా చూపలేదు. మౌనంగా ఊరుకొన్నాడు.

ఒక సంగీత సంస్థకి ప్రెసిడెంటయ్యాక బాగుండదని, ఏదైనా కీర్తన విన్నప్పుడు తల ఊపడం, తాళం వేయడం, లీనమైపోయినట్లు చేతులు త్రిప్పడం మొదలగునవి కూడా నేర్చుకొన్నాడు. కొన్ని రాగాల పేర్లు, తాళాల పేర్లు వినగా వినగా ఆయనకి కూడా తెలిసిపో




యాయి.

వీళ్ళ మాట ఎలా ఉన్నా ప్రజలలో కళాభి మానం పుష్కలంగా ఉంది. ఏ ప్రోగ్రాం పెట్టించినా వాళ్ళ వంతు సహకారం తప్పక అందించేవారు. సాహిత్యం అయినా సంగీతం అయినా ఆదరించడంలో అక్కడి ప్రజలకి వారే సాటి.

దాంతో పుష్కలంగా డబ్బు కురవడమే కాకుండా, పేరు ప్రతిష్ఠలు కూడా ఈ సంస్థలకి లభించాయి. సంస్థలద్వారా ప్రజలలో, చుట్టు పక్కలా ఒక గుర్తింపు లభించింది. వీరిని ఆశ్రయించుకొని, తమ ప్రోగ్రాంలు పెట్టమని కోరేవాళ్ళు కూడా ఎక్కువయ్యారు.

"మా మరదలి వీణా కచేరీ పెట్టించండి" అని ఒక మెంబరంటే మా తోడల్లుడి కూతురి గాత్రకచేరీ పెట్టించండి" అని మరొక మెంబరు పోటీ పడతాడు. ఎవరికి వారు ఈ సంస్థద్వారా తమవాళ్ళని అందలం ఎక్కించాలని తాపత్రయపడిపోతున్నారు.

వరదాచార్యులకి అన్నమయ్య పాటల పోటీ నిర్వహించాలని కోరిక కలిగింది. ప్రవేశ రుసుము పది రూపాయలు పెడితే బోలెడు మంది ఎలాగో పాల్గొంటారు. ప్రైజులా ఏవో ఊళ్ళోవాళ్ళ దయతో సంపాదించవచ్చును.

ఆలోచన రావడమే తడవుగా మీటింగ్ పెట్టి, సంస్థ సభ్యులతో చర్చించాడు. జిల్లా స్థాయి పోటీలైతే బావుండునని కొందరు సూచించారు. ఏదో ఒక సందర్భం ఉండాలి కనుక వార్షికోత్సవం చేయాలని, నిర్ణయించుకొన్నారు.

సంస్థ పుట్టి ఎలాగూ ఏడాది కాబోతోంది కనుక అందరూ ఫంక్షన్ బాగా చేద్దామని నిర్ణయించుకొన్నారు. ప్రైజులు ఎన్ని పెట్టాలో, ఎవరెవరిని అడగాలో కూడా నిర్ణయించుకొన్నారు. మర్నాడు పేపర్లో ప్రకటన ఇచ్చేశారు.

ఆ పేపరు ప్రకటనే సారధి చూశాడు. కూతురిని పిలిచి ఆ విషయం చెప్పారు. పోటీలో పాల్గొనేవాళ్ళకి నిబంధనలు చదివి వినిపించడం మొదలుపెట్టాడు.

పోటీలో పాల్గొనే వ్యక్తికి వచ్చిన అన్నమయ్య కీర్తనలు అయిదింటిని రాయమన్నారు. జడ్జీలు ఏ పాట అడిగితే దాన్ని పాడాలి. ఎంట్రీ ఫీజు పది రూపాయలు. బావుందని తండ్రీ కూతుళ్లు సంతోషించారు.

సారధికి గానలహరి సంస్థ గురించి, వరదాచార్యులు గురించి అందరూ అనుకొనే విషయాలు తెలుసును. జిల్లాస్థాయి పోటీ కనుక ఉత్సాహముంటే విద్యని వాటిలో పాల్గొనమన్నాడు. విద్య తల్లినడిగి ఏ పాటలు రాయాలో నిర్ణయించుకొంది.

తిరుమల తిరుపతి దేవస్థానం వాళ్ళు ఈ పోటీలలో మొదటి, రెండు బహుమతులు వచ్చిన వాళ్ళని తిరుపతికి ఉచితంగా తీసికెళ్ళి అక్కడ పాడిస్తామన్నారు.

ఈ విధంగా వాళ్ళనుండి ఎప్పుడైతే ఆమోదం వచ్చిందో ఈ పోటీలకి ప్రాధాన్యత బాగా పెరిగిపోయింది. వరదాచార్యులు హడావుడిపడిపోవడం మొదలుపెట్టాడు. ఈ దెబ్బతో తమ సంస్థ పేరు మారుమ్రోగుతుందనుకొన్నాడు. ఏర్పాట్లు భారీగా చేయడం మొదలుపెట్టాడు.

పోటీలు ఉదయమే 10 గంటలకు ప్రారంభించి, న్యాయనిర్ణయం చేసేస్తే సాయంత్రం ఫంక్షనులో ప్రైజులు ఇవ్వవచ్చనని అనుకొన్నారు. జడ్జీలుగా తలోవూరు వాళ్ళని పిలిస్తే బావుంటుందనుకొన్నారు.

వరదాచార్యులు పనుల హడావుడిలో పెద్ద పెద్ద వాళ్ళని ఫంక్షనుకి ఆహ్వానించి విశ్రాంతి లేకుండా తిరుగుతున్నాడు. హెూటల్కి కాఫీ తాగుదామని వచ్చిన అతడికి అక్కడ సుదర్శననాయుడు కన్పించాడు.

ఇద్దరూ కాసేపు కబుర్లలో పడ్డారు. వరదాచార్యులుతో పని ఉందని, తన డిస్పెన్సరికి రమ్మని పట్టుబట్టి సుదర్శననాయుడు వరదాచార్యులని స్కూటర్మీద ఎక్కించుకొని తీసికెళ్ళాడు.

హాస్పిటల్కి వెళ్ళిన తరువాత నెమ్మదిగా

అసలు విషయం చెప్పాడు "చూడు ఆచార్యులూ! మా చెల్లెలు ఈ బహుమతి గెల్చుకోవాలని చాలా తాపత్రయపడుతోంది. నీకు తెలుసు కదా అది సంగీతం నేర్చుకొంటోందని. ఈ ఏడాది డిప్లొమా పరీక్షలకు కూర్చుంటోంది.

తిరుపతికి చెల్లిని మన కారులో తీసికెళ్ళగలం. ఎన్నో సార్లు వెళ్ళాం కూడా! కానీ ఈ విధంగా బహుమతి గెలుచుకొని, వెళ్ళేదారి వేరు కదా! అలా వెళ్ళడం వలన ఎంతో పాప్యులారిటీ లభిస్తుంది. ఆ ఏర్పాట్లు ఏవో నువ్వు చూస్తావని పిలిచాను'' అంటూ అతడి చెవిలో ఊదాడు.

వరదాచార్యులు ఒక నిముషం ఏమీ మాట్లాడలేదు. ఆలోచనలో పడ్డాడు. సుదర్శన నాయుడుకి అతడి మౌనం బాగానే అర్థమైంది. "అన్నట్లు నువ్వు సెంటర్‌లో స్థలం కొనుక్కొందామనుకొన్నావని, అవతల వ్యక్తి అమ్మడం కుదరదన్నాడని విన్నాను. ఆ విషయం నా చెవిలోనో, నాన్నగారి చెవిలోనో వేయలేక పోయావా?" అన్నాడు.

"ఇప్పుడు మాత్రం ఏమైంది? అవతలి వాడిని పిలిచి నేను చెపుతానులే. మనల్ని కాదని వెళ్ళే ధైర్యం అతడికి ఎక్కడిది?" అనగానే సుదర్శననాయుడు వేసిన మంత్రం ఫలించింది.

వరదాచార్యుల ఆలోచన తెమిలిపోయింది. మొహం చేటంతయింది.

ఎన్నాళ్ళనుండో వరదాచార్యులు సెంటర్‌లోని స్థలం కొని ఇల్లు కట్టుకొందామనుకొని ప్రయత్నాలు చేస్తున్నాడు. స్థలం యజమాని ఎంతకీ లొంగిరావడం లేదు. ఇప్పుడాపని సుదర్శననాయుడు జరిగేలాగ చూస్తాననంటున్నాడు. అంతకన్నా ఏం కావాలి?

ఇద్దరూ ఒకనిర్ణయానికి వచ్చేసి నవ్వేసుకొన్నారు. సుదర్శననాయుడుకి ఇప్పుడు చాలా సంతోషంగా ఉంది. ముద్దుల చెల్లెలి ముచ్చట తను తీర్చబోతున్నాడు. విషయం రహస్యంగా ఉంచాలని వరదాచార్యులుకి హెచ్చరించాడు. అయితే వరదాచార్యులుకి బ్రహ్మాండమైన సందేహం వచ్చింది. తలో ప్రాంతంనుండి జడ్జీలని పిలవాలనుకొన్నారు కదా అప్పుడు ఇదెలాగ సాధ్యమవుతుంది!

డాక్టరే ఈ సందేహమూ తీర్చేశాడు. ఏవో కారణాలవలన వాళ్ళు రాలేకపోయారని చెప్పి ఇద్దరిని మనవాళ్ళను నియమించెయ్యి. ఒక్కరు వచ్చినా ఫర్వాలేదు. మార్కులు మనం కలిసేలాగ చూసుకొందాం అని భరోసా ఇచ్చాడు.

వరదాచార్యులుకి గుండెలమీద భారం తేలికైంది. ముగ్గురినీ ఇక్కడవారినే ఉంచినా ఫర్వాలేదు. అందరికీ సర్దిచెప్పేభారం తనదనుకొన్నాడు అయితే ఆ తర్వాత మరొక గండం వచ్చింది.

వీళ్ళ గానలహరిలో మెంబరుగా ఒక లాయరు ఉన్నాడు. ఆయన భార్య ఎన్నాళ్ళనుండో ఆయనని సాధిస్తోంది. వాళ్ళకి ఇద్దర బ్బాయిలు, ఒక అమ్మాయి. "మీరు ఆ సంస్థ కోసం ఎంతో కష్టపడతారు. వాళ్ళు మనల్ని ఏ విధంగానూ గుర్తించడం లేదు'' అని ఆయనను సతాయిస్తోంది.

ఈ బాధ పడలేక ఆయన వరదాచార్యులుని ఆశ్రయించాడు. "మా పాప అద్భుతంగా పాడుతుంది. కాస్త మీరు సహృదయతతో పట్టించుకోవాలి. అయినా మనల్ని మనం కాదనుకొని, మనకి మనం అవమానం చేసుకొని ఇతరులకి పట్టం కట్టడం మంచిదా?" ఇదీ ఆయన వాదన.

పాపం. వరదాచార్యులు సందిగ్ధంలో పడ్డారు. అదేం బాధో కానీ "అడుగు వేస్తే పిడుగు పడ్డట్లు'' మొట్టమొదటి ఫంక్షనుకే ఇన్ని ఒత్తిడులు. లాయరుకి, అతడికి ఉన్న మొహమాటం తక్కువదేం కాదు.

అందరూ ఎదురు చూసిన రోజు రానే వచ్చింది. ఉదయం 10 గంటలకే పోటీ ప్రారంభించారు. చాలామంది పిల్లలు ఉత్సాహంగా పాల్గొనాలని, పలు ప్రాంతాలనుండి వచ్చారు. తల్లిదండ్రులతో, కళాభిమానులతో




సభ కళకళలాడుతోంది.

జడ్జీలని వరదాచార్యులు వేదికమీదకి ఆహ్వానించాడు. వాళ్ళను చూసి ప్రజలు కొంత నిరాశచెందారు. మన హరికథా భాగవతార్, పశువుల డాక్టర్‌గారు, సుబ్బలక్ష్మిగారు ఏళ్ళే నా జడ్జీలు. మరి బయట ఎక్కడనుంచో వస్తారనీ ఎందుకు ప్రచారం చేయాలని విసుగ్గా శ్రోతలు అనుకొన్నారు. ధైర్యం ఉన్న విద్యార్థులు, యువకులు మాత్రం నిలబడి గట్టిగానే అరిచారు.

ప్రెసిడెంటు బంగార్రాజు సాయంత్రం వస్తానని, ఉదయం కథనంతా వరదాచార్యులుని, మిగిలిన సభ్యులుని నడిపించమని కోరారు. అందుకే వరదాచార్యులుగారు వచ్చిన ఆహూతులని క్షమించమని, తమ సంస్థ పిలిచిన జడ్జీలు అనివార్యకారణాలవలన రాలేకపోయారని, అందువలన పోటీ ఆపడం ఇష్టంలేక స్థానికుల సహాయం అర్థించానని చెప్పారు.

చేసేదేమీ లేదు కనుక గొణుక్కొంటూ ఊరుకొన్నారు వచ్చినసభికులు. పోటీ ప్రారంభమైంది. వరుసక్రమంలో ఒక్కొక్కరినీ పిలుస్తున్నారు. వచ్చిన పిల్లలు, తమని ఈ కూర్చుని వినేవారంతా ఎలాగ రిసీవ్‌చేసుకొంటారో అని మనసులో తర్జన భర్జనలు పడుతున్నారు.

పాడుతున్న వాళ్ళకి కమ్మలు కట్టేవాళ్ళూ లేకపోలేదు. స్టేజి ఎక్కి వాళ్ళలాగ కనీసం పాడే ధైర్యం మాట దేముడెరుగు. నిలబడే ధైర్యంలేనివాళ్ళు కూడా ఇతరులని వేళాకోళం చేయడానికి సిద్ధమే.

మొత్తం నూటపాతికమంది బాలబాలికలు పాల్గొనడానికి వచ్చారు. కానీ ఈ జనాన్ని చూసి ఓ పాతికమంది భయపడిపోయారు. పోతే పోయాయిలే పది రూపాయలు అనుకొని మూడుసార్లు పిలిచినా వెళ్ళలేదు.

కొందరు ఏదో గొణిగినట్లు పాడారు. కొందరు ధైర్యంగా వెళ్ళి నిలబడినా, మధ్యలో వీళ్ళ గొడవకి భయపడిపోయి మరిచిపోయారు. కొందరు మాత్రం వాళ్ళకి వచ్చినవిధంగా, ఎదుట కూర్చున్న జనాలను చూడకుండా తలవంచుకొని పాడేశారు.

సారథిగారు ధైర్యం చెపుతున్నట్లు విద్య చేతిని నిమిరారు. "బాపిరే ఇంత చెమట ఏమిటి?" అని విద్య చేతిలోని చెమటను చూస్తూ నవ్వుతూ అడిగారు. విద్య నవ్వలేక నవ్వింది. పైకి చెప్పలేక పోతోంది కానీ ఆ అమ్మాయి కాళ్ళు కూడా వణుకుతున్నాయి.

"విద్యా! పిరికితనం మనలో ఉన్న కళను చంపేస్తుంది. పిరికివాళ్ళకి అవకాశాలు రావు. వాళ్ళు జీవితంలో ఎదగలేరు'' సారథి కూతురిని ప్రోత్సాహపరచాలని అన్నారు.

విద్యకన్నా చిన్నపిల్ల ఏడవతరగతి చదువుతోందిట 'రేఖ' అని పెనుగొండనుండి వచ్చిందిట. ఆ అమ్మాయి పేరు పిలవగానే వెళ్ళి చక్కగా, ధైర్యంగా పాడేసింది. అందరూ ఆ పాప పాటను మెచ్చుకొన్నారు. సారథి విద్యవైపు చూశారు.

రాణిని పిలిచారు. ఆ అమ్మాయి ధైర్యంగా స్టేజి ఎక్కింది. బిస్కట్ రంగు మిడ్డీడ్రెస్, ఆ పిల్ల వంటిరంగుకి బాగా నప్పింది. ఒక చేతికి రెండు బంగారు గాజులు, మరొక చేతికి వాచీ, మెడలో సన్నటి స్టెప్స్ గొలుసుతో కళకళలాడిపోతోంది. కొందరు విద్యార్థులు ఆ అమ్మాయిని చూసి ఈలవేశారు.

ఈలోపు జడ్జీలలో ఒకాయన ఆమె ఎంట్రీఫారమ్ చూశాడు.

"ఒక పరి కొక పరి వయ్యారమై'' కీర్తన పాడమ్మా'' అని ఆయన గట్టిగా రాణివైపు చూస్తూ అడిగారు. "ఆ పాట నాకు అంత బాగా రాదండీ'' రాణి జడ్జీలవైపు చూస్తూ అంది. మైకు పుచ్చుకొని, మాట్లాడటంవలన ఆ మాటలు అందరికీ విన్పించాయి.

"అదేమిటమ్మా! నువ్వు ఎంట్రీఫారమ్‌లో అయిదవ కీర్తనగా దాన్ని రాశావు కదా! మరి పాడలేనంటావేమిటి?" పశువుల డాక్టరుగారి గొంతుకలో కాస్త చిరాకు ధ్వనించింది.

"దాన్ని నేను నా అయిదవ పాటగా రాశా

నండీ! మిగతావాటంత బాగా రాదనే అర్థం కదా!" రాణి నిర్భయంగా ఆయనకి జవాబు ఇచ్చింది.

"ఈ పాటలలో మేము ఏది అడిగినా మీరు పాడాలని మొదటే చెప్పాం కదమ్మా! పోటీ నిబంధనలు నీకు తెలియవా?" ఈసారి కాస్త కఠినంగానే అన్నారు.

సుబ్బలక్ష్మిగారు, హరికథా భాగవతార్‌గారు ఒకటే కంగారుపడిపోయారు. సుదర్శననాయుడుకి మొహమంతా చెమటలు పట్టాయి. జేబులోనుండి రుమాలు తీసికొని వాటిని అద్దుకొన్నాడు.

వరదాచార్యులుగారు సుబ్బలక్ష్మికి సౌంజ్ఞ చేశారు.

రాణి మైకు అక్కడపెట్టి వెళ్ళబోతోంటే ఆవిడ "ఆ... వెళ్ళిపోకు పాపా! పోనీ ఈ కీర్తన పాడగలవా అంటూ "బ్రహ్మ కడిగిన పాదము..." కీర్తనని అడిగారు.

రాణి తల ఊపింది పాడతానన్నట్లు.

"అమ్మయ్య. రక్షించింది మీరు కూడా మళ్ళీ ఏ నాల్గవ కీర్తనో అడగకుండా దాన్ని అడిగారు'' అంటూ డాక్టరుగారు నిష్ఠూరంగా అన్నారు.

వాళ్ళిద్దరూ నవ్వలేనట్లు నవ్వారు.

రాణి శ్రావ్యంగా, గమకాలతో ఆ కీర్తనని పాడింది. వరదాచార్యులుగారు అమ్మయ్యా అనుకొన్నారు. అందరూ తప్పట్లు కొడుతూంటే స్టేజిదిగి, తన స్థానంవైపు వెళ్ళిపోయింది రాణి. అన్నగారు చెల్లెలిని అభినందించారు.

జూనియర్ కాలేజీ తాలూకు హైమావతి అనే అమ్మాయిని పిలిచారు. చక్కగా పాడి వెళ్ళిపోయింది.

తర్వాత లాయరుగారమ్మాయిని పిలిచారు. ఆ అమ్మాయిని నాల్గవ కీర్తన పాడమంటే ఆ పిల్ల మూడవ కీర్తన పాడతానంది.

జడ్జీలకి తలనొప్పి పట్టుకొంది.

దానితో చిరాకుగా "ఏ పాటా పాడనక్కరలేదు వెళ్ళిపోమ్మా'' అనేశారు.

"ఇదేం అన్యాయం? ఒకళ్ళు పాడలేనంటే ఊరుకొని, మరొకళ్ళు పాడలేనంటే వెళ్ళిపొమ్మంటారా? ఒక్కొక్కళ్ళకి ఒక్కొక్కరూలా?" అంటూ లాయరుగారూ, కొందరి పిల్లల తల్లిదండ్రులు గట్టిగా కేకలు వేయడం మొదలుపెట్టారు.

నిర్వాహకులూ, వాళ్ళమీద కేకలు వేయసాగారు.

చివరికి అందరిపట్లా ఒకేవిధంగా ప్రవర్తించాలని వచ్చిన వాళ్ళు గొడవచేయడంతో జడ్జీలకి సర్దుకోక తప్పలేదు. చివరికి వాళ్ళు ఆ పిల్లని "కులుకక నడవరో కొమ్మలారా'' అన్న కీర్తన పాడమన్నారు. ఆ అమ్మాయి పాడింది.

తర్వాత విద్యను పిలిచారు. "విద్యాధరి'' అని రెండవసారి పిలుస్తోంటే విద్య స్టేజి మీదికి వెళ్ళింది. నిర్వాహకులలో ఒకరు మంచినీళ్లు కావాలా అని అడిగారు. విద్య నవ్వుతూ వద్దన్నట్లు తల ఊపింది. విద్య చిలకాకు పచ్చరంగు పట్టుపరికిణీ, జాకెట్టులలో చూసే వాళ్లకి ఎంతో అందంగా కన్పించింది.

ఆ అమ్మాయి విశాలమైన నల్లటి కళ్లల్లో లీలగా భయం తొంగిచూస్తోంది. ఒక చేత్తో రుమాలు పట్టుకొంది. మైకు అందించారు నిర్వాహకులు. "కొండలలో నెలకొన్న కోనేటి రాయడు. కీర్తన పాడమ్మా'' అని అడిగాడు జడ్జీలలో ఒకరైన డాక్టరుగారు విద్యని.

విద్య మైకు చేత్తో పట్టుకొని సారధిగారివైపు చూసింది. ఆయన నవ్వుతూ ఆ అమ్మాయిని చూశారు. విద్య తన సన్నటి మధురమైన గొంతుకతో "కొండలలో నెలకొన్న కోనేటి రాయడు'' కీర్తన పాడసాగింది.

విద్యకి పాట ప్రారంభించాక భయం దానంతటదే పోయింది. తల్లి దగ్గర కూర్చుని ఎలా పాడేదో అలాగే పాడసాగింది. ఒక జడ ముందుకి, ఒక జడ వెనక్కి అందంగా కనబడుతున్నాయి. తలలోని చిట్టి చేమంతులు మా




అందం చూడండన్నట్లు ముందుకి తొంగిచూస్తున్నాయి.

విద్య కీర్తన చివరలో స్వరం కూడా వేసి పాడింది. అందరూ ఆ అమ్మాయి పాట ముగించగానే చప్పట్లు కొట్టేశారు. చాలా మంది ఆ అమ్మాయికి ఫస్టుప్రైజు తప్పదనుకొన్నారు.

మిగిలిన పిల్లలు కూడా పాడాక ఫలితాలు సాయంత్రం సభలో ప్రకటిస్తామని నిర్వాహకులు తెలియచేశారు. మనకి తెలియదేమిటి. వాళ్లు చెప్పాలా! వీళ్ళకి వస్తుంది ఫస్టు, వీళ్లకి సెకండు వస్తుంది అంటూ అందరూ కోలాహలంగా మాట్లాడుతూ ఇళ్ళకి వెళ్లిపోయారు.

విద్యను తీసుకొని సారధిగారు వస్తోంటే "మీ పాపా! చాలా బాగా పాడిందండీ! ఫస్టు ప్రైజు మీ పాపదే'' అంటూ అభినందించారు కొందరు.

ఇంటికి రాగానే రాధమ్మ "విద్య ఎలా పాడిందండీ?'' అని అడిగింది. ఆయన బాగా పాడిందని చెప్పారు.

విద్య, మురళి సాయంత్రం తల్లిని కూడా తమతో రమ్మని గొడవ చేశారు. సాయంత్రం అందరూ కలిసి బయలుదేరారు. రాధమ్మ కూతురికి ఒక జడవేసి జడకుచ్చులు పెట్టింది. తెల్లటి క్రేప్ సిల్కు పరికిణీ, జాకెట్టుఇచ్చి వేసుకోమంది. మెడలో తన ఒంటిపేట ముత్యాలు వేసింది.

ఆవిడకి కూతురిని అలంకరించడమంటే ఎంతో ఇష్టం. పట్టీల చప్పుడు సన్నగా ధ్వనిస్తోంటే ఇంట్లో లక్ష్మీదేవిలాగా ఆడపిల్ల తిరగనిదే ఏం అందం ఉంటుంది? అని ఎప్పుడూ అనుకొంటుంది. అలాగని కొడుకంటే ఇష్టం లేదా అంటే వాడు నా వంశోద్ధారకుడు అంటుంది.

రాధమ్మకి సాయంత్రం ఆ సభ, కల్యాణ మండపం చూస్తే ఆశ్చర్యం కలిగింది. "ఇంత పెద్ద స్టేజిమీదనా విద్య పాడింది'' ఆవిడ ఆశ్చర్యంగా ఆయనని అడిగింది. ఆయన నవ్వుతూ ఔనన్నట్లు తల ఊపారు. ఆవిడ విద్యవైపు క్షణకాలం చూసింది.

స్టేజి లైట్లకాంతిలో మెరిసిపోతోంది. గోడలకి కట్టిన సిల్కుపరదాలు మిలమిల మెరుస్తున్నాయి. వాటిమీద వ్రేలాడదీసిన చెక్కదండలు మమ్మల్ని చూడండన్నట్లు పిలుస్తున్నాయి. రకరకాలలైట్లు అందంగా అలంకరించి ఉన్నాయి. స్టేజిముందు కట్టిన వెల్వెట్ తెర ఆరుద్ర పురుగు రంగుతో అలరారుతోంది.

సభాకార్యక్రమం ప్రారంభమైంది. వరదాచార్యులు సవినయంగా పెద్దలని వేదికమీదికి ఆహ్వానించారు. అధ్యక్షుని తొలిపలుకు అయింది. సంస్థలోని మరొకరు వచ్చి ఆ సంవత్సరంలో తమ సంస్థ చేసిన పనులన్నీ చెప్పారు.

తమ సంస్థకి ఇంకా ఎన్నో మంచిపనులు చేయాలని ఉందని, ఎందరో కళాకారులను ఈ వేదికమీదికి రప్పించి వారి కళాకౌశలాన్ని ప్రజలకు చూపించాలని ఉందని, కానీ నిధులు కొరతగా ఉన్నాయని, కళాభిమానులు ముందుకు వచ్చి తమ సంస్థకు చేయూతనీయాలని అధ్యక్షులవారు కోరారు.

ఇంతలో పద్మనాభనాయుడు, కనకమ్మ, రాణి, కొడుకులు అక్కడికి విచ్చేశారు. దానితో కోలాహలం మొదలైంది. వరదాచార్యులు ఆర్భాటంగా వచ్చి వాళ్ళని ముందు వరుసలో కూర్చోపెట్టాడు.

యం.ఎల్.ఏగారిని వేదికమీదికి రమ్మని ఆహ్వానించారు అధ్యక్షులవారు. ఆయన అవసరం లేదని అక్కడే కూర్చుండిపోయారు. ఆయన కేంప్‌నుండి వచ్చేస్తారని తెలిస్తే ఆయననే ముఖ్యఅతిథిగా పిలిచేవాడినని వరదాచార్యులు చేతులు నులుపుకొంటూ చెప్పాడు.

తనకి అలాంటి పట్టింపులు లేవని, సాయంత్రమే పని పూర్తవడంతో ఇలాగా వచ్చానని, దానికి వాళ్ళేం బాధపడనవసరంలేదని ఆయన వాళ్ళకి నచ్చచెప్పారు. "ఇదే మరొకరైతే మండిపడేవారు. ఆయన దారే వేరు. గొప్ప సహృదయులు'' అంటూ

అక్కడ కూర్చున్నవారందరూ గొప్పగా అనుకొన్నారు.

కొంత కార్యక్రమం జరిగాక అప్పుడు ప్రైజు డిస్ట్రిబ్యూషన్ ప్రారంభించారు. అందరూ నిశ్శబ్దమైపోయి, ఆసక్తిగా వేదికవైపు చూస్తున్నారు. "గానలహరి'' సంస్థ నిర్వహించిన అన్నమాచార్య కీర్తనల పోటీలో విజేతలు అంటూ పేర్లు చదవడం ప్రారంభించారు.

ఫస్టుప్రైజు అంటూ ఒక సెకండ్ అతిథుల వైపు చూసి ఆగి "రాణీ పద్మనాభనాయుడు'' అంటూ చెప్పారు.

రాణి గర్వంగా స్టేజి ఎక్కింది. ఆమెకు పెద్ద మొమెంటో, 500 రూ.ల బహుమతి ఉన్న కవరు అందించారు. ఫొటోగ్రాఫర్లు ఫొటోలు తీశారు. రాణి నవ్వుతూ అందుకొంది వాటిని.

చెమ్కీ కుట్టిన డ్రెస్, దానిమీద చున్నీ, ఒక్క చేతికి వాచీ, మరొక చేతికి పొళ్లగాజులు, మెడలో కొత్త ఫాషన్ చైనులతో, పెదవులపై చిరునవ్వుతో రాణి ఎంతో ఆకర్షణీయంగా ఉంది. అందరూ ఆ అమ్మాయిని ఆసక్తిగా చూస్తున్నారు.

ఇదేమిటి... ఈ అమ్మాయికా ఫస్టుప్రైజు అంటూ ఇద్దరు ముగ్గురు పైకే అన్నారు. ఈలోపు వెంటనే సెకండ్‌ప్రైజు "సునీతామూర్తి'' అని పిలిచారు.

"అదేమిటి ఈ అమ్మాయి మన లాయరు కూతురుకదూ'' సభికులలో కలవరం ప్రశ్నలు బయలుదేరాయి. అవునని ఎవరో సమాధానమిచ్చారు.

లాయరు గారమ్మాయి అంతకన్నా ఆడంబరంగా తయారైంది. ఆ అమ్మాయి స్టేజిమీదకొచ్చి ప్రైజు తీసుకొంటూంటే, ఆ పిల్ల తల్లి కళ్లు మిలమిల మెరిశాయి. లాయరు భార్యను చూసి కాలరు సవరించుకొన్నారు.

విద్య మొహం వాడిపోయింది. సారధి గంభీరంగా స్టేజివైపు చూస్తున్నారు. "థర్డు ప్రైజు విద్యాధరి'' అని పిలిచారు. విద్యకి కుర్చీలోనుండి లేవాలన్పించలేదు. రెండవ సారి పిలవడంతో తండ్రి ఆ అమ్మాయిని "వెళ్ళమ్మా'' అని పిలిచారు. విద్య మౌనంగా లేచి స్టేజి దగ్గరికి వెళ్లింది.

విద్యకి నూటపదహారు రూపాయిలు, ఒక వినాయకుడి బొమ్మ ప్రజంట్ చేశారు. విద్య వాళ్ళకి నమస్కరించి వచ్చేసింది.

హైమావతికి కన్సొలేషన్ ప్రైజు ఇచ్చారు. వెనకన కూర్చున ఒక మధ్యవయసాయన "ఇవేం ప్రైజులురా! నిబంధనల ప్రకారం పాడిన వాళ్ళని వెనక్కి తోసేశారు. ఆ పాట పాడను, ఈ పాట పాడను'' అన్న వాళ్ళకి ప్రైజులు మొదటివి ఇచ్చారు. గొప్పగా ఉందరా ఫంక్షను'' అంటూ గట్టిగానే అన్నారు.

ఆయన రిటైర్డు పోలీసాఫీసరుట. ఉదయం ఫంక్షనుకి వచ్చి ఆయన పాటలు విన్నారుట. దానితో కొద్దిమంది ఉదయం జరిగిన విషయాలు ఆయనని అడిగితే ఆయన వివరంగానే చెప్పారు.

ఈలోపు కొందరు సంస్థ తరఫువాళ్లు "మాట్లాడవద్దు. దయచేసి నిశ్శబ్దంగా ఉండండి'' అంటూ హెచ్చరించడం మొదలుపెట్టారు.

చివరగా వరదాచార్యులు 'వినేటప్పుడు అందరికీ అన్ని పాటలూ బావున్నాయన్పిస్తుంది. కానీ న్యాయనిర్ణేతలకి వాటిలోని లోపం తెలుస్తుంది. ఒక పాటకి ప్రైజు ఇవ్వాలంటే రాగం, తాళం, భావం, స్వరమాధుర్యం ఇవన్నీ చూడాలని మీలో ఎంతమందికి తెలుసును?'' అంటూ పదినిమిషాలు ఉపన్యాసమిచ్చి, చివరగా వందన సమర్పణచేసి సభ ముగించారు.

సారధికి ఆ ఫంక్షను చూస్తే చిరాకువేసింది. అందుకే బంగార్రాజు వరదాచార్యులు ఉన్న చోటికి వచ్చి "ఒక పోటీ పెట్టామంటే నియమ నిబంధనలను పాటించాలా? వద్దా?'' అని సూటిగా అడిగారు.

అప్పటికే కొందరు ఇళ్ళకు వెళ్లిపోతున్నారు. కొందరు గుంపులుగా నిలబడి మాట్లాడుకొంటున్నారు.

 

బంగా్రాజు వరదాచార్యులవైపు ఇబ్బంది గా చూశారు. ఆయనకి గొడవ ఏమీ తెలియదు.

సారథి తన ప్రశ్న మళ్ళీ రెట్టించాడు. "మీరు ప్రతీవాళ్ళని అయిదుపాటలు వ్రాయమన్నారు. అందులో జడ్జీలు అడిగినదానిని పాడాలన్నారు. మీరు ప్రైజులు ఇచ్చినవాళ్లు ఆ నియమాన్ని ఉల్లఘించారు. మీరు దాన్ని పట్టించుకోకపోవడం తప్పుకాదా?" ఆయన కంఠం మారుమ్రోగింది.

"యం.ఎల్.ఏ.గారు ఈ మాటలు విని స్టేజి దగ్గరికి నడవబోయారు. సుదర్శననాయుడు ఆయనని వారించి వెళ్ళిపోదాం పదమన్నాడు. ఆయన ఒకసారి సారథిని క్రీగంట చూసి, వరదాచార్యులని పిలిచి వెళ్లివస్తామని చెప్పారు.

వరదాచార్యులు ఇదే సందన్నట్లు ఆయనని సాగనంపివస్తామని హడావుడిగా ఆయన వెనుక వచ్చేశాడు. "మీ సంస్థంటే నాకు అభిమానం ఏర్పడింది. నా తరపున ఒక వెయ్యినూట పదహార్లు మీకు విరాళంగా ఇస్తున్నాను'' అని యం.ఎల్.ఏ. ప్రకటించారు. వరదాచార్యుల మొహం చాటంతయింది.

ఈలోపు లాయరు అడ్డంపడి "డబ్బు వద్దు సార్! ఇలాగే మేము ఫంక్షనులు, పోటీలు పెట్టినప్పుడు మీ తరపున ఒక ప్రైజు ఉంచండి'' అంటూ అర్థించాడు.

"అమ్మనాయనా నువ్వు ఘటికుడివే లాయరూ! నా దగ్గర ప్రతి పోటీకి కొట్టెయ్యాలని ప్లాను వేశావు'' అని నవ్వేసి, అలాగేనని ఒప్పుకొన్నారు.

వాళ్ళను పంపి, వరదాచార్యులు వచ్చేవరకూ సారథి ఓపికగా ఉండిపోయాడు. ఈ గొడవ చూడటానికి కొందరు ఉండిపోయారు. అప్పటికే సారథివల్ల అన్నీ విన్న బంగా్రాజు సెక్రటరీవైపు చిరాకుగా చూశాడు.

ఆయనకి సమాధానం చెప్పే బాధ్యత తనపైనే ఉందని వరదాచార్యులు గ్రహించాడు. "చూడండి. పోటీలు అన్నాక ఏవో జరుగుతుంటాయి. వాళ్లు ఓ పాట పాడతామంటే జడ్జీలు మరొకటి పాడమని అడిగారు. వాళ్ళే ప్రైజులు నిర్ణయించారు. మేమేం చేస్తాం చెప్పండి. చిన్న విషయాన్ని పట్టించుకోకూడదు'' అని తేల్చేశాడు.

సారథి అతడిని సూటిగా చూశాడు.

"ఏ పాట పాడమంటే ఆ పాటే పాడాలి, లేదా పోటీనుండి తొలగిపోవాలి, అనే నియమం పాటిస్తామనికదా ఎంట్రీఫారమ్స్ నింపించారు. అంగీకరించి, పాడతామన్నదే పాడించడం మనం పెట్టుకొన్న నిబంధనల్ని మనమే అతిక్రమించడం! అవునా?" సారథి ఈసారి ఖచ్చితంగానే అనేశాడు.

ఈ విషయం అర్థమైన అయిదారుగురు సారథిని బలపరిచారు.

ఇది ఇంకా పెరగడం మంచిది కాదని వరదాచార్యులు నవ్వుతూ అనేశాడు. "ఏమిటి మేష్టారూ ఏవో భ్రూణహత్యలు జరిగిపోయినట్లు మమ్మల్ని జాడించేస్తున్నారు. మీ అమ్మాయి అలా అన్నా మేము ఆ పిల్లనీ అలాగే మరొక పాట పాడమంటాం. అయినా మీ పాపకి ప్రైజు వచ్చిందికదా! నాకు అవతల బోలెడు పన్లున్నాయి. వస్తాను'' అంటూ వెనక్కి తిరిగి చూడకుండా వెళ్లిపోయాడు.

"పదండి పోదాం. వీళ్ళతో మనకేమిటి?" అంటూ అందరూ బయలుదేరడం చూసి, సారథి బంగా్రాజుతో "మా పాపకి రాకపోయినా నేను బాధపడిపోను. ఒక సంస్థలో ఇటువంటి లోపాలు జరగకూడదనే నా ఉద్దేశం" అన్నాడు.

అతడి మాటలు వరదాచార్యులకి విన్పించాయి.

విన్పిస్తాయని సారథికీ తెలుసును. బంగా్రాజుకి సారథి మాటలలో నిజాయితీ కన్పించింది. సారథి భార్యని, పిల్లలని తీసుకొని బయలుదేరిపోయాడు. విద్య తండ్రిని, తండ్రిలోని ఆవేశాన్ని గమనించింది.

ఇంటికి వచ్చాక రాధమ్మ "అంతమందీ

ఊరుకున్నారు. మీరు మాత్రం ఎందుకు వాళ్ళతో రొష్టు పడాలి?" అని అడిగింది. సారథి ఆవిడవైపు తీక్షణంగా చూశాడు. దానితో ఆవిడ సర్దుకొంది.

"అడగడం తప్పని కాదు నా ఉద్దేశం. అడిగినంతమాత్రాన ప్రయోజనమేమిటి? వాళ్ళ అమ్మాయికి ఫస్టు రాలేదని ఆ దుగ్ధ' అని వాళ్లు అనుకోరా?"

సారథి వెంటనే చిరాకుగా జవాబు ఇచ్చాడు. "ఒక అన్యాయం జరిగినప్పుడు దానికి గురైన వాళ్లు అడగాలి. కానప్పుడు తెలిసిన పెద్ద మనుష్యులు అడగాలి. ఎవరూ అడగకపోతే మేము చేసిందే సరైనదని వాళ్ళందరూ మళ్ళీ మళ్ళీ ఎన్నో పొరపాట్లు చేస్తారు''

విద్యకి ఆయన స్వభావం బాగా అర్థమైంది. ఆయనంటే ఒక ఆరాధనాభావం ఆ అమ్మాయిలో పెరగసాగింది. "ఏమ్మా థర్డు ప్రైజు వచ్చిందని బాధపడుతున్నావా?" అని ఆయన అడగగానే "లేదు నాన్నగారూ! ఈసారి పట్టుదలతో ఫస్టు తెచ్చుకొంటాను. అయినా మీరేకదా ఎప్పుడూ "గెలవటంకన్నా పాల్గొనటం ముఖ్యం అంటారు'' అని నవ్వేసింది.

మర్నాడు హెడ్‌మేష్టారు పిల్లలిద్దరికీ ప్రైజులు వచ్చినందుకు ప్రేయర్‌క్లాసులో నిలబెట్టి అభినందించారు. రాణంటే ఏమిటనుకొన్నారు? మా ఫ్రెండ్‌కి అన్నింటిలో ఫస్టే అని రాణి స్నేహితులు పొంగిపోయారు.

అర్ధసంవత్సరం పరీక్షలు రావడంతో విద్య చదువులో నిమగ్నమైపోయి పరీక్షలు బాగా వ్రాసి బరువు దింపుకొంది. పండుగ సెలవులకి, భార్యని, పిల్లలని తీసుకొని సారథి నాలుగురోజులు తమ్ముడి దగ్గరికి, నాలుగురోజులు అత్తవారింటికి వెళ్ళాడు. పిల్లలకి సెలవులు సరదాగా గడిచిపోయాయి.

సెలవులు అయిపోతాయనగా ముందురోజు మళ్ళీ వచ్చేశారు. పిల్లలు తెల్లవారితే స్కూలు కనుక పుస్తకాలు సర్ది సిద్ధంచేసుకొన్నారు. ఈ మూడు నెలలైనా మురళిని బాగా చదివించాలని సారథి అనుకొన్నాడు.

తెల్లవారి విద్యకి ఎంతో సంతోషంగా అన్పించింది. స్కూలుకి వెళ్ళడం అపురూపంగా అన్పించింది. "నాన్నగారూ! ఈ రోజు మాకు మార్కులు తెలిసిపోతాయి. మంచి మార్కులు వస్తే మాకేమిటి ఇస్తారు?" అని అడిగింది. సారథి ఒక నిమిషం ఆలోచించాడు.

విద్యా! ఎవరు క్లాసు ఫస్టువచ్చి, మంచి మార్కులు తెచ్చుకొంటారో వాళ్ళకి అయిదు వందల రూపాయలు ఇస్తాను. అది వినగానే విద్య ఎగిరి గంతేసింది. యూనిట్ టెస్టులో ఫస్టు వచ్చినా ఇచ్చేస్తారా?" తన వెనుకనుండి వచ్చిన ప్రశ్నకి ఆయన అటు తిరిగారు.

రాధమ్మ బియ్యం కడుగుతూ అడిగింది. భార్య కొంటెతనం అర్థం చేసుకొని "నీలాంటి మట్టి బుర్రలకి అయితే అర్థమవదు నామాట. విద్యకి తెలుసును'' అని కూతురివైపు చూశారు.

యూనిట్‌కి, క్వార్టర్లీకీ అలాగ ఇవ్వరు. ఏడాది మొత్తంమీద ఇస్తారు అని విద్య అనగానే ఆయన గర్వంగా భార్యవైపు చూశారు. అందరూ ఎవరిదారిన వాళ్లు భోజనాలు చేసి వెళ్లిపోయారు.

స్కూలు చేరగానే విద్య సైకిలుకి స్టాండు వేసి వరండాలో పెట్టి, బుక్స్ తీసుకొని క్లాసులోకి పరుగెత్తింది.

స్నేహితురాళ్లు ఒకరినొకరు చూసి ఎన్నోరోజులు అయిపోయినట్లుంది. అందరూ గబగబా మాట్లాడేసుకోవడం మొదలుపెట్టారు. పావుగంట గడిచాక వాళ్ళ హడావుడి తగ్గింది. జ్యోతి విద్యని చూసి "నువ్వు కూడా మా ప్రైవేట్లలో చేరమంటే వినవు. ఇప్పుడు చూడు ఎలా అవుతోందో' అని నిష్ఠూరంగా అంది.

విద్య ఏమిటి జరిగిందన్నట్లు చూసింది.

ఇంగ్లీషు, లెక్కలు పేపర్లు దిద్దేశారు. లెక్కలైతే మనక్లాసు పిల్లలే దిద్దారు. మేష్టారు





వాళ్ళని ఇంటికి రమ్మన్నారుట. మేష్టారు వీళ్ళ చేత దిద్దించారుట. మా ఇంటికి వచ్చి నా మార్కులు చెప్పారు వాళ్లు అని చావుకబురు చల్లగా చెప్పింది.

విద్య మొహం పాలిపోయింది.

"విద్యా! ఈ విషయం నేను చెప్పానని ఎక్కడా అనకు సుమా! మేష్టారు నా చర్మం వలిచేస్తారు'' అని వేడుకొంది. విద్య ఏమీ మాట్లాడలేదు.

ఇంగ్లీషు అయితే విద్యకి ఎక్కువ మార్కు లే వస్తాయి. అలాంటిది ఇప్పుడు క్లాసులో నోరు విప్పని చాలామందికి విద్యతో సమా నంగా వచ్చాయి. లెక్కలైతే మరీ ఘోరం. రెండు లెక్కలు రైటైనా కొట్టేశారు. అదేం అని అడిగితే మేష్టారు చెప్పిన మోడలుతో చేయలే దన్నారు.

విద్య తన తండ్రి చెప్పాడని, ఆ పద్ధతిలో కూడా చేయవచ్చునని మేష్టారితో చెప్పింది. కానీ ఆయన విన్పించుకోలేదు. ఏనాడూ తక్కువ మార్కులు రావడం తెలియని విద్య కి ఈ విషయాలు కష్టం కలిగించాయి.

తెలుగులో ఫస్టుమార్కు విద్యకే వచ్చింది. సైన్సు మార్కులు మర్నాడు చెపుతానన్నారు. విద్య జ్యోతి పేపరు, కస్తూరి పేపరు అడిగి తీసుకొని చూసింది. వాళ్ళకి అన్ని బిట్లకీ మార్కులు వచ్చాయి. కానీ మెయిన్ పేప రులో ప్రశ్నల దగ్గర కొద్దిగా తగ్గించిపడ్డాయి. పిల్లలు గోలగోలగా పేపర్లు చూసుకొన్నారు.

విద్య ఉక్రోషంతో ఇంటికి వచ్చింది. తండ్రి మొక్కల దగ్గర పాదులు చేస్తున్నారు. "నాన్న గారూ! నా లెక్కల పేపరులో నేను లెక్కలు రైటు చేసినా సరే కొట్టేశారు. అచ్చు మీరు చెప్పినట్లే నేను చేశాను'' అంటూ ఏడవసా గింది.

సారథి ఆశ్చర్యపోయారు. ఎంతో మనసుకి బాధ కలిగితే కానీ విద్య అంతలాగా బయటప డదు.

విద్యని ఓదార్చి, తనతో తీసకొని వచ్చి కుర్చీలో కూర్చుని నెమ్మదిగా అసలు విషయం కనుక్కొన్నారు.

సారథిగారి నుదురు ఆలోచనతో ముడుచు కొంది. లెక్కల పేపర్లు, సైన్సు పేపర్లు పిల్లలు దిద్దడమేమిటి? పిల్లలకి ఆన్సర్‌షీటు వ్రాసిచ్చి, బిట్లు దిద్దమన్నా తప్పేకదా! మనం చేయవల సినపని వాళ్లు చేయడమేమిటి?

ఏ పేపరు అంటే పిల్లలకి ఇష్టమో దానికి ఎక్కువ మార్కులు వచ్చేలాగా వాళ్లు. ఎడ్వాంటేజ్ తీసుకోరా? నాలుగురోజులు ఆల స్యమైతే మాత్రం పేపర్లు వాళ్ళచేత దిద్దించడం ఎంతవరకు సమంజసం?

ప్రభుత్వం మనకి జీతాలు ఇచ్చి, నాలుగ క్షరాలు పిల్లలకి చెప్పమంటే ఆ వృత్తిలో కూడా ఇంత బాధ్యతా రాహిత్యమా? పూర్వం అయితే బ్రతకలేక బడిపంతులు అనేవారు. ఆ రోజు లలో అయితే జీతాలు తక్కువ అయినా ఎంతో పవిత్రంగా భావించేవారు ఈ వృత్తిని.

సమానత్వం గురించి, సామ్యవాదం గు రించి పిల్లలకి చెప్పవలసిన ఉపాధ్యాయులు వాటిని పాటించకపోవడం శోచనీయం కాదా! ట్యూషన్ చదివిన వాళ్ళని ఒకలాగా, చదవని వాళ్ళని ఒకలాగా చూడటం ధర్మమా?

సారథి మనసులో అనేక ఆలోచనలు. "వి ద్యా! నువ్వు ఆ స్కూల్లో మానేసి, మరొక స్కూల్లో చదువుతావా?" అనడిగారు.

ఏం జవాబు చెప్పాలో విద్యకి తెలియలే దు. ఆయనే మళ్ళీ అన్నారు. "మరొక స్కూ ల్లోనూ పరిస్థితి ఇలాగే ఉందనుకో. అప్పుడు ఏం చేస్తాం? మనం ఉన్న పరిస్థితులు చక్కది ద్దుకోవాలి. వాళ్లు చేస్తున్నపని ఏమిటో వాళ్లకి తెలిసేలాగా చేయాలి'' ఆయన సాలోచనతో అన్నారు.

మర్నాడు ఆయన ఒకపూట స్కూలుకి సెలవుపెట్టి విద్యతో స్కూలుకి వెళ్లారు. హెడ్ మాష్టారు ఆయనని సాదరంగా ఆహ్వానించా రు.

విద్య చదువుస్థాయి గురించి చెప్పి, ఈనా డు ఆ పిల్ల ఎంత నిరుత్సాహంగా ఉందో

చెప్పారు. సారధిగారు చెప్పిన విషయాలు అబద్ధం కావని ఆయనకీ తెలుసును.

కానీ ఆయన తన స్కూలు మేష్టర్లతో తగాదా తెచ్చుకోలేడుకదా! అందుకే మా లెక్కల మేష్టారిని పిలుస్తాను. ఆయన మీకు అమ్మాయి పేపర్లు చూపిస్తారు అంటూ లెక్కల మేష్టారిని పిలిచారు.

సారధిగారు ఎవరో ఆయనకి పరిచయంచేసి, ఆయన వచ్చిన పని చెప్పారు. సారధిగారిని ఆయనతో స్టాఫ్‌రూంకి వెళ్ళమన్నారు. విద్య పేపరు కట్టలోనుండి తీసి ఆయన జంకుతూనే చూపించారు.

సారధికి ఆ పేపరు చూడగానే అర్థమైపోయింది. రెండు లెక్కలు అనవసరంగా కొట్టేశారు. మిగిలిన పెద్ద లెక్కలకి తగ్గించి మార్కులు వేశారు.

సారధి ఆయనని అడిగి ఒక టావుపేపరు తీసుకొన్నారు. వరుసగా ఆ రెండు లెక్కలు రెండు పద్ధతుల్లో చేసి చూపించారు. ఆయన ఆ లెక్కలు చేసిన వేగానికిలెక్కల మేష్టారు ఆశ్చర్యపోయారు.

"మీరు టెస్టులో ఉన్న మోడల్ (మెథడ్) ప్రకారం చేసిన దానికి మార్కులిచ్చారు. అదే క్లాసులో చెప్పారు. కానీ ఈ లెక్కలకి ఈ మెథడ్‌లో కూడా చేసే వీలుంది. మీకు రెండు మెథడ్స్ చెప్పే టైము ఉండకపోవచ్చును.

"ఎవరైనా ఈ మెథడులో చేసినప్పుడు మీరు మార్కులు వేయాలికదా! అంతెందుకు పదవతరగతి పబ్లిక్ పరీక్షల స్పాట్‌కి వెళ్లినప్పుడు మీకు వాళ్లు ఇచ్చే కీలో షార్టు మెథడులో ఎవరైనా చేసినప్పుడు మార్కులు ఇమ్మని డైరక్టుగా చెబుతున్నారుకదా!" సారధి ఆయనను చూస్తూ ఒకక్షణం ఆగారు.

తను చెప్పే విషయం ఆయనకి బోధపడుతోందా, లేదా అన్నట్లు చూశారు. "డైరక్టుగా లెక్క చేయకుండా ఆన్సరు వేసినప్పుడు మీరు కొట్టెయ్యవచ్చును. కానీ పద్ధతిలో చేసినప్పుడు కొట్టడం మంచిపద్ధతి కాదు" సారధి సున్నితంగానే అయినా విషయం గట్టిగానే చెప్పాడు.

తర్వాత ఆయన విద్య పేపరు తీసి విద్య తను చెప్పిన ఆ రెండో పద్ధతిలో చేసి లెక్కలని చూపించారు. అవి పేపర్లో కొట్టివేయబడ్డాయి. లెక్కల మేష్టారి మొహం సిగ్గుతో కందిపోయింది.

"లెక్కల్లో స్టెప్స్ ప్రకారం చేసినప్పుడు 50కి 50 మార్కులు వస్తాయి. అవి తగ్గించడానికి వీలులేదు. ఏవో బిట్సు తప్పు వ్రాస్తే అప్పుడు ఎలాగో వాటిమార్కులు పోతాయి.

"చూశారా! విద్య మూడు బిట్లు మాత్రమే తప్పు వ్రాసింది. ఈసారి తన మార్కులు ఇంత తక్కువ వచ్చాయని ఎంత బాధపడుతోందో నేను చెప్పలేను. వెనుకబడిన పిల్లలని ముందుకు తీసికొని రావడం ఎంత ముఖ్యమో ముందున్న పిల్లల ఉత్సాహం భంగపడకుండా చూడటమూ అంత ముఖ్యమే" సారధి మందలింపులాగా అనకపోయినా మేష్టారు అలాగే ఉండిపోయారు.

"మీ స్టూడెంటుకి మీరే పేపరు చూపించి, తృప్తిపరచండి. మరి నేను వెళ్ళివస్తాను" అంటూ సారధిగారు బయటికి వచ్చెయ్యబోయారు.

తెలుగుమేష్టారు, డ్రాయింగ్ మేష్టారు ఆయన విద్య తండ్రిగా గుర్తించి, యోగక్షేమాలడిగారు విద్య నోట్లో ఎక్కువగా నానేది ఆ ఇద్దరు మేష్టర్లే. తెలుగుమేష్టారు పెద్దవారే. మరొక రెండేళ్లు దాటితే రిటైరవుతారట. అయినా సరే ఓపికగా పట్టి పట్టి అన్ని పేపర్లూ స్వయంగా దిద్దుతారట. ఎవరు ఏ పాయింటు మర్చిపోయినా, క్లాసులో చెప్పి మందలిస్తారుట. ఆయనంటే విద్యార్థులందరికీ గౌరవమే.

సారధి వాళ్ళిద్దరికీ విద్యను కాస్త చూస్తూ ఉండమని చెప్పి, వచ్చేశారు. సైన్సు మేష్టారు పదవతరగతిలో పాఠం చెపుతున్నారు. ఆయనని డిస్టర్బ్ చేయడమెందుకని సారధి కలవలేదు.




ఇంటర్వెల్‌లో ఈ విషయం స్టాఫ్ మధ్య చర్చకు వచ్చింది. మేష్టర్లు ఎవరికి తోచినట్లు వాళ్లు మాట్లాడుకొన్నారు. నాలుగు మార్కులు తక్కువ అయితే చాలు ఈ కాలంపిల్లలు తల్లిదండ్రులని తెచ్చి మన ప్రాణం తీస్తారని సైన్సుమేష్టారు గట్టిగానే అన్నారు.

విద్యతో సారధి చెప్పనే చెప్పారు. ఈ క్లాసు మార్కుల విషయంలో నువ్వు పట్టించుకోకు. పబ్లిక్‌లో నీ పేపర్లు వాళ్లు దిద్దరుకదా! అప్పుడు మార్కులు ఎక్కువ తెచ్చుకోవడమే దీక్షగా పెట్టుకో! విద్య అలాగే అన్నట్లు తల ఊపింది.

విద్యకి అర్థంకాని విషయం ఒకటే. క్లాసులో అందరికన్నా తనే ఎక్కువ ప్రశ్నలకి జవాబులు చెపుతుంది. తనని ఆ సమయాలలో మెచ్చుకొనేది ఈ మేష్టర్లే. పరీక్షలలో మాత్రం ఏదోరకంగా ఫస్టుమార్కు తప్పించేస్తారు.

క్లాసులో బెల్లం కొట్టిన రాళ్లలా కూర్చునేవాళ్లకి ఎలా ఫస్ట్ మార్కులూ సెకండ్‌మార్కులూ వస్తాయో విద్యకి ఎంత మాత్రం అర్థం కాదు. పైగా విద్య కష్టపడి పరీక్షలకి అన్ని పాఠాలూ, అన్ని ప్రశ్నలూ చదువుతుంది. వాళ్లు మాత్రం కొన్ని ప్రశ్నలనే చదువుతూ కూర్చుంటారు.

ఒక్కొక్కసారి జ్యోతి, 'విద్యా ఈ ప్రశ్నలు చదువు... వస్తాయేమో' అని చెపుతుంది. అయినా విద్యకి వాటిని మాత్రమే చదివి ఉండటం భయం. అంతకుమించి జ్యోతి కూడా విషయాన్ని చెప్పదు.

మగ పిల్లలు కొందరు మాత్రం ఎలాగో పడబోయే ప్రశ్నలని పట్టుకొస్తారు. వాళ్ల దగ్గర నుండి జ్యోతివాళ్ళు సేకరిస్తారు. విద్యకి ఇలాంటివి బుర్రకి ఎక్కవు. అందుకే రాణి ఎప్పుడూ పరోక్షంగా అంటూనే ఉంటుంది.

"ఉత్తరకుమారుడిలాగ క్లాసులో గొంతుక చించుకొని అరవడం, పరీక్షలలో వెనక్కి వెళ్లిపోవడం మాకు రావు'' అని. విద్య అసలు ఏ విషయం పట్టించుకోవడం మానేసింది. క్లాసులో వచ్చే అయిదవ రాంక్‌కి, ఆరవరేంకుకి అలవాటు పడిపోయింది.

ఈ బాధ పడలేకే మురళి స్కూలు మేష్టర్ల దగ్గరే తండ్రితో పోట్లాడి ప్రైవేట్లు పెట్టించుకొన్నాడు. మార్కులు బాగానే వస్తున్నాయి కదా అని ఆయన ఊరుకొన్నారు.

మురళి ఉన్నప్పుడు ఎవరూ విద్యావాళ్ల క్లాసు పేపర్లు తీయించరు. మురళి బేచ్ వెళ్లిపోయాక రాణివాళ్లు ట్యూషన్‌కి వస్తారు. వాళ్లు దగ్గరుండి మేష్టారి చేత పేపర్లు తీయిస్తారు. దిద్దుతున్నప్పుడు "మేష్టారూ! మరొక మార్కు వెయ్యండి'' అంటూ బలవంతం చేసి, బతిమాలించుకొని వేయించుకొంటారు. 'అబ్బబ్బ ఈ రాక్షసులున్నప్పుడు ఎందుకు పేపర్లు తీశానా దేముడా!' అంటూ వాళ్లు గింజుకొంటారు.

హిందీ పేపర్లు స్కూలులో లీజరు పీరియడ్‌లోనే దిద్దుతారు. కానీ ఏం లాభం? మాటల్లో పడితే ఏదీ చూడరు. పేరాలు కొలిచి వేస్తారని సోషల్ మేష్టారిని అంటారు. అందుకే ఓపిక ఉన్నా, లేకపోయినా టావులు టావులు పిల్లలు రాస్తారు.

ఇదంతా విద్యకి అలవాటైపోయింది. విద్య రాసే పేపరంటే సోషల్ మేష్టారికి ఎంతో ఇష్టం. 'నీలాగ సైడు హెడ్డింగులతో, పాయింట్లతో రాసేవాళ్లు అరుదు సుమా' అంటారు.

ఆయనకి ఎవరి గొడవా అక్కరలేదు. ఆయన పని ఆయనది. పిల్లలెవరినీ తన టేబుల్ దగ్గరికైనా రానీయరు. రాణి అయితే ఆయనని ఒంటిపిల్లి రాకాశి అని అంటుంది.

ఎంత జాగ్రత్త తీసుకొన్నా మురళి పరీక్ష పబ్లిక్‌ది పోయింది. మురళి ఏనాడూ ఏ సబ్జక్టు డౌట్ అని ఎరగడు. అక్కడికీ సారధి ఎన్నోసార్లు ఆదివారాలు తెలియని పాఠాలు చెపుతాను రమ్మని పిలిచేవారు.

మురళి మేష్టర్లు బాగా చెపుతున్నారని, తనకి అన్నీ అర్థమవుతున్నాయని అనడంతో ఆయన ఏం చేయలేక ఊరుకొన్నారు. రిజల్ట్సు వచ్చిననాడు పేపర్లో నెంబరు కనబడనప్పుడు ఆయన వెర్రిగా కొడుకు మొహంలోకి చూస్తూ ఉండిపోయారు. చిన్నబోయిన కొడుకు మొహం చూస్తే ఏమనడానికీ ఆయనకి నోరురా లేదు.

రాధమ్మ మాత్రం మురళిని కేకలేసింది. మురళి ఎవరితో మాట్లాడకుండా పడుకొన్నాడు. ఫ్రెండ్స్ ఈ ఊరు వచ్చినప్పటినుండీ ఎక్కువైపోయారు. ఆటలపిచ్చి, స్నేహితుల పిచ్చే మురళి పరీక్షపోవడానికి కారణాలని ఆయనకి బాగా తెలుసును. ఎన్నిసార్లు చెప్పినా మురళి వింటేకదా!

తండ్రి మాటా, పలుకూ లేకుండా కుర్చీలో అలాగ కూర్చుని ఉండిపోయేసరికి విద్యకి బాధగా అన్పించింది. ప్రైవేట్లలో క్లాసు క్లాసంతా ఉంటారు. ఒక్కొక్కరినీ పట్టించుకొనే అవకాశం వాళ్లకి ఏదీ?

ఏమూలనో కూర్చుని విన్నామన్పించి వీళ్లు వచ్చేస్తారు. ఇదిగో ఇలాగ పరీక్షలు పోయాక అలమటిస్తారు. విద్య తండ్రి దగ్గర కూర్చుని ఏవో మాటలు చెప్పసాగింది.

రాధమ్మ మురళిని రెండు రోజుల వరకూ మందలిస్తూనే ఉంది. చివరికి ఉండబట్టలేక సారధి ఆమెని వారించారు "వాడు మాత్రం ఏం చేస్తాడు? వాడికి మాత్రం బాధ ఉండదా?" అని.

మురళిని కాస్త మామూలు మనిషి అయ్యే వరకూ వదిలేశారు. తర్వాత తనే అన్ని సబ్జక్టులూ చెప్పి పరీక్షకి తయారు చేయసాగారు. మురళికి ఇంగ్లీషు, సైన్సు, లెక్కలు మూడూపోయాయి.

ఈ సమయంలోనే విద్య అతడికి మరింత సన్నిహితమైంది. తను లేచినపుడే అన్నగారిని నిద్రలేపడం, తను చదువుకొనేటప్పుడు అతడి పుస్తకాలు కూడా తెచ్చి అందించడం చేసేది.

స్కూలు వాతావరణంలో ఎటువంటి మార్పు లేకపోయినా మేష్టర్ల మనస్తత్వంలో కొంత మార్పు వచ్చింది. తొమ్మిదవ తరగతి చివరలో స్కూలుకి డి.ఇ.ఓగారు వచ్చారు.

ఆయన పదవ తరగతి చూస్తూ, తనతో వచ్చిన గెజిటెడ్ ఇనస్పెక్టరుగారిని మిగతా క్లాసులు చూడమన్నారు. ఆయన ఇంగ్లీషు, లెక్కలు తొమ్మిదవ తరగతికి చూశారు.

ఒక కష్టమైన లెక్కని ఆయన పిల్లలకు ఇచ్చారు. అయిదు నిముషాలు గడవకుండా విద్య చేసి చూపించింది. ఆయనకి చాలా సంతోషం అన్పించింది. కాస్సేపటికి మరొక ఇద్దరు మగపిల్లలు చేశారు.

క్లాసు మొత్తం మీద ముగ్గురేనా క్లాసు స్టాండర్డుకి తగినట్లు ఉన్నారని ఆయన కేకలు వేశారు. మార్కుల రిజిష్టరు తీసి ఎందరికి ఫస్టు మార్కులు వచ్చాయో మేష్టారుని చెప్పమన్నాడు.

ఈలోపు ఆయన మరొక రెండు లెక్కలు ఇచ్చారు. ఈసారి మగపిల్లలిద్దరూ కూడా విద్యతోపాటు వేగంగా చేసి చూపించారు. ఆయన విద్యని క్లాసు పిల్లలకి బోర్డు మీద చేసి చూపించమన్నారు.

విద్య తడబడకుండా లెక్కలు చేసింది. ఇలాగే చదివితే తప్పక విద్యకి రేంకు వస్తుందని ఆయన అభినందించి వెళ్లారు. మార్కులు అంతమంది ఎక్కువ తెచ్చుకొని ఈ లెక్కలు చేయలేకపోవడమేమిటని ఆయన మిగిలిన వాళ్లని మందలించారు.

ఆ రోజు లెక్కల మేష్టారికి విద్య మీద ఎంతో అభిమానం కలిగింది. తన పరువు నిలబెట్టిందని ఊపిరి పీల్చుకొన్నారు. ఆ రోజు నుండీ విద్య క్లాసు పేపర్లు తనే దిద్దసాగారు. పిల్లలెవ్వరినీ తీయనీయలేదు.

అయితే క్లాసులోని పిల్లలు ఊరుకొంటారా? ఒకమార్కు అయినా మాకు కలపకపోతే ప్రైవేటు చదివి లాభం ఏమిటని పట్టుకొని వదిలేవారు కారు. విద్యకి ఈ మార్కులు మీద నమ్మకం ఎప్పుడో పోయింది.




పదవ తరగతిలోకి వచ్చాక కస్తూరి విద్యని తమతోపాటు ఈ ఏడాదైనా ప్రైవేట్లకి రమ్మని బలవంతం చేసింది. విద్య ఒప్పుకోలేదు. వాళ్లు విద్యని ఒక మూర్ఖురాలిలాగ చూశారు.

మాష్టర్ల అభిమానం సంపాదిస్తే పదవతరగతి పబ్లిక్‌లో సహాయం దొరుకుతుందని వారి ఆశ. విద్యకి అలాంటివి చెపితే వినదు... నమ్మదు.

విద్య లోకమే ఆమెది. పరికిణీ, ఓణీ జాకట్టులలో ఆమె అందం రెట్టింపయింది. విశాలమైన కళ్లల్లో విజ్ఞానం చోటు చేసుకొంది. చదువు, స్కూలు, నిద్ర, తిండి తప్ప ఏమీ పట్టించుకోదు. అన్నయ్య ఇంటర్‌లో చేరడం వలన అతడి బెంగ ఇప్పుడు ఆమెకిలేదు. అయితే ఇప్పుడు రాణితో పోటీ రెట్టింపయింది.

రాణితోపాటు ఆమె స్నేహ బృందం కూడా పెరగసాగారు. అంతమంది తనని ఎప్పుడూ పొగుడుతూ ఉండటం ఆ అమ్మాయిని గర్విష్టిని చేసింది. ఆ పిల్లని సంతోషపెట్టడం కోసం తల్లిదండ్రులు, అన్నలు ఎప్పుడూ ప్రయత్నిస్తూనే ఉంటారు.

విద్య ఎంత తాపత్రయపడినా, ఎంత ప్రావీణ్యం చూపించినా స్కూల్లో మాష్టర్లు రాణికన్నా అధికంగా ఆమెను ఎన్నడూ ఎన్నిక చేయలేదు. పాటలలో, వ్యాసరచనలో ఒకటే మిటి రాణి పాల్గొనకపోతే విద్యదే ఫస్టుప్రైజు, పాల్గొంటే మాత్రం రెండవస్థానానికి వెళ్లిపోతుంది.

దానితో విద్యకి అహర్నిశలూ రాణిని ఏవిషయంలోనైనా సరే గెలిచి తీరాలనే పట్టుదల రెట్టింపు అయింది. జ్యోతి, కస్తూరి వారిస్తూనే ఉంటారు "తనైతే యం.ఎల్.ఏ గారమ్మాయి. అందరూ గొప్పకోసం ఆమెను అందలం ఎక్కిస్తారు. మనమేం చేయగలం" అనేవారు.

పదవతరగతిలో ఒకసారి ఒక విచిత్ర సంఘటన జరిగింది. రాణి ముందురోజు స్కూలుకి రాలేదు. ఇంటర్ స్కూల్ కాంపిటీషన్సుకి ఎస్‌పిఎల్ విద్య పేరుని, కస్తూరి పేరుని ఆడపిల్లల్లో ఇచ్చాడు. అబ్బాయిలు ఒకరు విద్యతోపాటు వ్యాసానికి, మరొకరు ఉపన్యాసానికి పేరు ఇచ్చారు.

ఎస్‌పిఎల్ సర్క్యులర్ క్లాసుకి పంపకుండా స్టాఫ్‌రూంలో పెట్టించేశాడు. స్కూలు తరపున వాళ్లంతా మర్నాడు వెళ్లిపోయారు.

ప్రైజులు విద్యకి సాంగ్స్‌లో ఫస్టు, కస్తూరికి థర్డు, వ్యాసరచనలో విద్యకి ఫస్టు, సురేష్ అన్న అబ్బాయికి సెకండ్, ఉపన్యాసాలలో విద్యకి సెకండ్, జూనియర్ కాలేజీ హైస్కూల్ అబ్బాయికి ఫస్టు వచ్చాయి.

హెడ్ మాస్టారు ఎంతో పొంగిపోతూ ప్రైజులు తెచ్చిన విద్యార్థినీ విద్యార్థులను సభాముఖంగా పొగిడారు. ఈ స్వాతంత్ర్య దినోత్సవం తనకి చాలా సంతోషాన్నిచ్చిందని, మంచి మార్కులు పబ్లిక్‌లో సంపాదించి, ఈ బేచ్ తన ప్రావీణ్యతని నిరూపించుకోవాలని అర్థించారు.

విద్యంటే ఊళ్లోవారికి కూడా తెలియసాగింది. స్కూలు ఫంక్షనుకి వచ్చిన అతిథులు ఒక మంచి పెన్నుల సెట్‌ను విద్యకి ప్రజెంట్ చేశారు. ఇహ రాణికి ఏమాత్రం ఆ ఫంక్షనులో ఉండాలనిపించలేదు.

తనకి తెలియకుండా వాళ్లందరూ ఎలాగ పోటీలకి వెళ్లారు? తన ఫ్రెండ్స్ అయినా తనకి ఎందుకు కబురు పెట్టలేదు? రాణి మీటింగ్ అవుతుండగానే ఉడికిపోసాగింది. ఆ పిల్ల చూపులు కోపంతో, రోషంతో చూసేవారికి భయం కలిగించాయి. ఎలాగో మీటింగ్ అయ్యేంతవరకూ ఊరుకొంది.

మీటింగ్ అవగానే స్వీట్ల పంపకం జరుగుతోంది. పిల్లలు ఎవరిక్లాసులలో వారు కూర్చున్నారు. రాణి దీప్తిని, శైలజని జబ్బపుచ్చుకొని వసారాలోకి లాక్కెళ్లింది.

వాళ్లను నిలదీసి విషయాలు తనకి ఎందుకు తెలియచేయలేదని గద్దించింది. మధ్యాహ్నం వాళ్లు సభలో ఆ ప్రైజులు పుచ్చుకొంటూంటే తను ఎలా భరించాలని

విసుక్కొంది.

రాణి తిట్లతో వాళ్లకి మొదట నోట్లో నుండి మాటే రాలేదు. అసలు ఆ పోటీల విషయమే తమకి తెలియదన్నారు. రాణి కొంతసేపు వాళ్లనీ నమ్మలేదు. తర్వాత మేష్టారిని వెళ్లి నిలదీసింది.

ఆయన మీక్లాసుకి సర్క్యులర్ పంపాను. అందరికీ చెప్పమన్నాను. మీ క్లాసు మేష్టారిని కనుక్కో అనేశారు. హెడ్‌మేష్టారు అంత మామూలుగా చెప్పడం రాణికి విసుగన్పించింది. క్లాసు టీచర్ క్లాసులో చెప్పానన్నారు. నీ ఫ్రెండ్సు వినకపోతే నాదా తప్పు అని కేకలేశారు. అందుకే ఎప్పుడూ క్లాసులో హస్కుకొట్టకండి అని హితోక్తి చెప్పారు. రాణికి ఇంక తనకోపం ఎవరిమీద చూపాలో తెలియలేదు.

చాక్‌లెట్లు పంచుతున్న ఎస్‌పిఎల్ తన దగ్గరికి వచ్చి ఇచ్చినప్పుడు వాటిని అతడి చేతిలోనుండి ఎగరగొట్టింది. క్లాసులో ఎవరూ మాట్లాడలేదు. విద్య, స్నేహితులు వెళ్లిపోతూంటే దారికి అడ్డంగా నిలబడింది.

"నేను లేనపుడు దొంగలాగ పాల్గొని, ప్రైజులు తెచ్చుకోవడం కాదు. చేవ, శక్తి ఉంటే నాతో తలపడి అప్పుడు ఏదైనా గెలుచుకో! అర్థమైందా?" అంటూ చేతిని పట్టుకొని నిలదీసింది.

విద్య సూటిగా ఆమె కళ్లల్లోకి చూసింది. "మోసాలు, దొడ్డిదారులు నాకుకాని, మా వాళ్లకి కానీ తెలియని త్రోవలు. నోరు ఇచ్చినందుకు సద్వినియోగం చేసుకో' అంటూ చెయ్యి విదిలించుకొని వెళ్లిపోబోయింది.

"మీవాళ్లు చెప్పకపోతే విద్య మీద ఎందుకు ఎగురుతావు!" అంటూ జ్యోతి రాణిని నిలదీసింది.

"మీరందరూ వానపాములు. మీలాంటి వాళ్లతో నాకు మాటలేమిటి?" రాణివాళ్లని చీదరింపుగా చూసింది.

జ్యోతికి ఒళ్లుమండిపోయింది. తమని వానపాములంటుందా! తాను పెద్ద నాగుపామునుకుంటోంది కాబోలు. చూపిస్తాముండు వాన






పాముల సత్తా'' అని కోపంతో కేకలు వేసింది.

"ఛా... పొండి మీరేం చేయగలరు? గాడిద గుడ్డు'' అంటూ రాణి కేర్‌లెస్‌గా వాళ్లని తీసిపారేసి వెళ్లిపోయింది.

ఎస్‌పిఎల్‌కి మాత్రం చాలా సంతోషమ న్పించింది. తనని ఏమీ చేతకాని చవట వెధవని పదిమందిలో తిడుతుందా? ఏమిటి ఈ పిల్ల గొప్ప. వాళ్ల నాన్న యం.ఎల్.ఏ అయితే ఈ అమ్మాయి భూమిమీద ఆగడంలే దు. తండ్రి పేరు చెప్పి ప్రైజులు గెలుచుకో వడం అనుకొంటోంది కాబోలు అని కసిగా అనుకొన్నాడు.

ఇంటికి వెళ్లిన రాణి ఇంట్లో ఒక ప్రపంచ యుద్ధమే లేవదీసింది. జరిగిన విషయం చూ స్తే తనని అందరూ నిర్లక్ష్యం చేశారని తెలు స్తోందని గొడవ పెట్టింది. అన్నం తినకుండా అలిగింది.

పద్మనాభనాయుడు ఊళ్లోనే ఉన్నారు. విషయం ఆయన దగ్గరికి వచ్చేసరికి ఆయన కంగారు పడిపోయారు. కూతురు అన్నం తినకుండా అలిగి పడుకొంటే ఆయన భోజనం ఎలా చేయగలడు?

కూతురికి అనేక విధాలుగా నచ్చచెప్పి అన్నం దగ్గరికి తీసికొని వచ్చేటప్పటికి ఆయ నకి తల ప్రాణం తోకకి వచ్చింది. ఎన్నో వాగ్దానాలు చేశాక అప్పుడు కదిలింది రాణి డైనింగ్ హాలులోకి.

ఆయన సత్యం మేష్టారికి కబురు పెట్టారు. సత్యం మేష్టారు ఉరుకులు పరుగులతో వచ్చా డు. "రావయ్యా రా! ఏమిటీ మీరందరూ పెద్దవాళ్లై పోతున్నారు'' ఆయన చుట్ట కాల్చు కొంటూ అన్నారు.

ఆ ఒక్క మాటకే సత్యం మాష్టారు లుంగ లు చుట్టుకొనిపోయాడు. "అబ్బే... అదేం లేదండీ'' అని నీళ్లు నమిలాడు.

"నువ్వు ఉన్నావని, మా పిల్లను చూసు కొంటావని రాణిని మీ స్కూలుకి పంపాను. పిల్లని మీరందరూ చిన్నచూపు చూస్తే నేను

సహించగలనా?" ఆయన సూటిగానే అడిగారు.

సత్యంమేష్టారుకి విషయం అర్థమైపోయింది. మరొకసారి ఎలాంటి పొరపాటు జరగకుండా చూస్తానని వాగ్దానం చేశాడు. అప్పటికి ఆయన, కూతురు శాంతించారు.

సాహితీ సుధ సెక్రటరీ గిరిధర్‌కి కబురు పెట్టారు. అతడు వచ్చాక "ఏమిటయ్యా! ఈమధ్య మీ సంస్థ ఏ హడావుడులూ లేకుండా నిశ్శబ్దమైపోయింది'' అని మేలమాడారు.

"ఏదీ తీరిక ఉండటం లేదండీ'' అంటూనవ్వేశాడు అతడు.

"అదికాదయ్యా! ఊరందరూ అదిరిపోయేలాగ ఒక ఉత్సవం జరిపించు'' అని చెప్పారు.

"అన్నింటిలో కాంపిటీషన్స్ పెరిగిపోయాయండీ! చివరికి సంస్థల్లో కూడా ఇవి వచ్చేశాయి. పులిని చూసి నక్కవాత పెట్టుకొన్నట్లు, మనం సంస్థ పెట్టి సాహిత్యసేవ చేయడంలేదని నిందలు వేస్తూ వాళ్లొక సాహిత్యసంస్థ పెట్టారు కదండీ! దానితో ప్రతీదానికీ గొడవే'' గిరిధర్ చిరాకుగా చెప్పాడు.

గిరిధర్ దేని గురించి మాట్లాడుతున్నాడో మొదట ఆయనకి అర్థమవలేదు. గిరిధర్ వివరంగా చెప్పాక అదా విషయం అంటూ తేల్చేశారు.

"ఆ... నువ్వెన్ని చెప్పు. మీ సంస్థకి మంజీరలహరికి పోటీయా? ఈ రెండు సంస్థలమధ్య నక్కకి నాకలోకానికి ఉన్నంత తేడా ఉంది'' అనేశారు. "అయినా నీ కళాహృదయం ఆ వామనమూర్తికి ఎక్కడుంది?" యం.ఎల్.ఏగారు గిరిధర్‌ను ములగచెట్టు ఎక్కించేశారు.

గిరిధర్ ఉబ్బి తబ్బిబ్బయిపోయాడు. అంతటి రాజకీయ నాయకుడు తనని పిలిచి, మరీ పొగుడుతోంటే తట్టుకోవడం ఎలాగో అతడికి తెలియలేదు.

'మంజీరలహరి' వామనమూర్తి స్థాపించిన సాంస్కృతిక సంస్థ. పాత యంఎల్ఏ కొడుకు శ్రీరాములు నాయుడు దానికి ప్రెసిడెంటు.

"పొట్టివాడైనా వామనమూర్తి చాలా గట్టివాడండోయ్! అన్నింట్లో తనదే పైచేయంటాడు. మేము స్వార్థపరులమట, డబ్బు ప్రజలనుండి తీసికొని మేము దాచుకొంటున్నామట. ఏవేవో అంటున్నారు వాళ్లు'' గిరిధర్ గింజుకొంటూ చెప్పాడు.

"అలాంటి మాటలు పట్టించుకోకూడదోయ్! ప్రజలు ఎన్నెన్నో అంటారు. మర్నాడే మరిచిపోతారు. మనలాంటి ప్రజాసేవకులకి ఇవి తప్పవు'' ఆయన ఓదార్పుగా గిరిధర్ భుజం తట్టాడు.

గిరిధర్ ఈ రోజు లేచినవేళ చాలా మంచిదనుకొన్నాడు. అంతటి పెద్దమనిషి అలా మాట్లాడుతోంటే తనని నిజమైన ప్రజాసేవకుడిగా కీర్తిస్తుంటే ఆనందంతో తన్మయుడైపోయాడు.

కొంతసేపయ్యాక అసలు విషయం చెప్పారు "మా యంపి శివప్రసాద్‌గారబ్బాయి వాణీప్రసాద్ ఒక గ్రంధం రాశాడు. దాన్ని మీ సంస్థవాళ్లు ఆవిష్కరించాలోయ్. అతడికి సన్మానసభ చేయాలి'' తనకి కావలసిన పనేమిటో గిరిధర్ చెవిని వేశారు. అంతేకాదు మాధవని పిలిచి ఆ పుస్తకం తన గదిలో ఉందని, తెమ్మని చెప్పారు.

గిరిధర్‌కి ఆ పుస్తకం చూస్తే నవ్వు వచ్చింది. అది చాలా చిన్నపుస్తకం. అందులో ఒక ఎనభైవరకూ పద్యాలున్నాయి. అన్నీ కందపద్యాలే. ఆ రత్నావళి అనే పుస్తకాన్ని తమ సంస్థ ఆవిష్కరించాలి.

యధాలాపంగా పేజీలు తిరగేసిన అతడికి అంకితం అన్నది కన్పించింది. కుతూహలంగా చూశాడు. అక్కడ యంఎల్ఏ పద్మనాభ నాయుడుగారి ఫోటో ఉంది. ఆయనకి రచయిత తన గ్రంధాన్ని అంకితమిచ్చాడు. అదన్నమాట సంగతి అని అనుకోకుండా ఉండలేకపోయాడు.

అంత చిన్న పుస్తకాన్ని పట్టుకొని ఆయన




గ్రంధావిష్కరణ మహోత్సవము అంటే అతడికి ఏమనాలో తోచలేదు. యంఎల్‌ఏగారు, యంపిగారు మంచి స్నేహితులు. ఒకరి విజయం కోసం ఒకరు మహా తాపత్రయపడతారు.

యంఎల్‌ఏ గారు వెయ్యి రూపాయలకట్ట తెప్పించి, గిరిధర్ చేతికిచ్చారు. "ఈ డబ్బు ఆ ఫంక్షనుకి అయ్యే ఖర్చులకి ఉంచు. మిగిలినది మీ సంస్థద్వారా ఖర్చుపెట్టు'' ఆయన ఆదేశించినట్లే చెప్పారు. సుదర్శననాయుడు తమ సంస్థకి ప్రెసిడెంటు కనుక అతడు చెపితే బావుండదని తనద్వారా ఈ పని జరగాలనుకొంటున్నారు.

ఈ సన్మానసభ, ఆవిష్కరణ మహోత్సవము బాగా వచ్చేలాగ నేను పత్రికా విలేకర్లతో మాట్లాడతానని కూడా ఆయన చెప్పాడు. సెక్రటరీగా గిరిధర్ కృషిచేసి మిగిలిన సంస్థ సభ్యులను ఒప్పించాలి.

గిరిధర్ మాత్రం ఎలా కాదనగలడు? ఏడాది అతడి కొడుక్కి కాలేజీలో సీటు రాకపోతే యంఎల్‌ఏ తన పరపతి ఉపయోగించి తెప్పించాడు. ఆరోజు పొందిన సహాయం అతడిని మూగవాడిని చేసింది.

సంస్థ అన్నాక అనేక రకాల వ్యక్తులు సభ్యులుగా ఉంటారు. అందరినీ ఒప్పించి ఒక త్రాటి మీదికి తీసికొని రావడం అంత సులభంగా సాధ్యమయ్యే పని కాదు. సర్లే ఒప్పుకొన్నాక తప్పుతుందా అనుకొన్నాడు గిరిధర్.

సారధిగారు, వామనమూర్తి బజార్లో కలిశారు. వాళ్లిద్దరికీ శతావధానం జరిగినప్పటి నుండి మంచి స్నేహం ఏర్పడింది. సారధి నెమ్మదితనం, కావ్యపరిశీలనా గుణం, పాండిత్యం, ఖచ్చితమైన మాటతీరు వామనమూర్తికి నచ్చాయి. సారధి రాసిన పద్యాలు అతడి డైరీలో చదివి ఎంతో ప్రశంసించాడు.

ఒకరినొకరు పలకరించుకొని విశేషాలు చెప్పుకోవడం వారికి అలవాటు. సాహితీసుధ వాళ్లు జరపబోయే గ్రంధావిష్కరణ మహోత్సవం గురించి తెలియచేసి, ఆదివారం ఆ సభకి తనుకూడా ముఖ్యవక్తనని వామనమూర్తి చెప్పాడు.

సారధికి ఆహ్వానపత్రిక పంపిస్తానని, తప్పక రావాలని ఆయన మరీమరీ చెప్పారు. వామనమూర్తి అంతవరకూ పుస్తకం చూడలేదు. ఆ సాయంత్రమే వామనమూర్తికి సంస్థవాళ్లు వచ్చి పుస్తకం ఇచ్చివెళ్లారు.

ఆ పుస్తకాన్ని చూస్తూంటే అతడికి నవ్వువచ్చింది. తాము రాసినది బాగా ప్రచారమవ్వాలంటే ఏ పలుకుబడి ఉన్న రాజకీయ నాయకుడికో అంకితమివ్వాలి. ఈ కాలంవారికి తెలివితేటలుకి తక్కువ లేవనుకొన్నాడు.

ఆదివారమే కనుక విద్య తాను కూడా సభకి వస్తానని తండ్రితో చెప్పింది. సారధి పిల్లల అభిరుచులను కాదనడు.

యంఎల్‌ఏగారితో పాటు రాణి కూడా వచ్చింది తండ్రికి ఎవరో పుస్తకం అంకితమిస్తున్నారంటే ఆ ఉత్సవం చూద్దామని వచ్చిందామె. ఒక యం.పిగారికి, యంఎల్‌ఏ గారికి సంబంధించిన ఫంక్షను కనుక ఆడంబరానికి అట్టహాసానికి ఏమీ లోటులేదు.

సంస్థవాళ్లు మంచి శాలువాకప్పి, సాంప్రదాయ ప్రకారం కవిని గౌరవించారు. కవి వాణీప్రసాద్ స్నేహితులు, ఆశ్రితులు అందరూ తలొక శాలువా, వెండి లక్ష్మి, సరస్వతి విగ్రహాలు బహూకరించారు. యంపి శివప్రసాద్‌గారు గర్వంగా మీసాలు సవరించుకొన్నారు.

యంఎల్‌ఏగారు అట్టహాసంగా వాణీప్రసాద్ ఇచ్చిన గ్రంధకన్యను అందుకొన్నారు. కృతిభర్తగా ఆయనను సంబోధిస్తూ వాణీప్రసాద్ నాలుగు పద్యాలు కూడా చెప్పాడు. యంఎల్‌ఏగారి ఆనందానికి హద్దులేదు.

"పూర్వము రాజులు వాళ్లు కవుల నుండి కావ్యాలు అందుకొనేవారు. ఈ రోజుల్లో రాజ్యాలులేవు. రాజులులేరు. రాజకీయ నాయకులే రాజులు'' అంటూ ఎవరో చమత్కరించారు కూడాను.



తర్వాత యంఎల్ఏగారు కృతికర్తకి సన్మానం చేశారు. తనకి కావ్య కన్యకనిచ్చి సత్కరించినందుకు బదులుగా పట్టుబట్టలు, చందన తాంబూలం ఇచ్చి ఆయన వాణీప్రసాద్‌కి సన్మానం జరిపారు.

సభలో కూర్చుని ఈ తతంగమంతా చూస్తున్నవాళ్లకి విసుగువస్తోంది. సాంప్రదాయం ప్రకారం చేయవలసింది ఏదో నిరాడంబరంగా చేయవచ్చునుకదా! ఈ అట్టహాసాలు, పరస్పర ప్రశంసలు, ఇచ్చిపుచ్చుకోవడాలు ఏమిటి? అని.

గిరిధర్ మైకు దగ్గరికి వచ్చి గ్రంథ ప్రాశస్త్యం గురించి చెప్పడం మొదలుపెట్టాడు. పూర్వం గ్రంధాలు చాలా ఘనంగా ఉండేవిట. వాటి ఆకారం చూస్తేనే భయపడి సామాన్యులైనవాళ్లు చదవాలనే అభిలాషను చంపుకొనేవారుట.

వాణీప్రసాద్ పఠితుల మనసు బాగా తెలిసిన వాడవడంవలన ఇంత చిన్న గ్రంధాన్ని రాశారుట. రాశిలో ఈ గ్రంధము చిన్నదైనా వాసిలో ఇది చాలా గొప్పదిట.

వాణీప్రసాద్‌ను సరస్వతీ అవతారంగా ప్రస్తుతించాడు. ఆయన పుంభావ సరస్వతీమూర్తిట. నడిచి తిరుగాడే ఒక విద్యాలయమట. గిరిధర్ యొక్క అనర్గళమైన ఉపన్యాసానికి యంపి గారి ఒళ్లుపులకరించింది.

ప్రతీవ్యక్తీ విజయం వెనుక ఏదో ఒక శక్తి వుంటుందనే మాట యదార్థమైతే వాణీప్రసాద్ గారి వెనుక ఈ ఉత్సాహానికి, ప్రోత్సాహానికి కారణమైన శివప్రసాద్‌గారు ఉన్నారుట.

యంపిగారి మనసు ఈ పొగడ్తతో పురివిప్పిన నెమలిలాగ నర్తించసాగింది.

వింటున్న ప్రజలకి మాత్రం ఒళ్లుమండిపోసాగింది. మరీ ఇంత అన్యాయంగా పొగడటానికి నోరు ఎలా వస్తుందో అనుకోసాగారు.

గ్రంధపరిశీలనము అంటే ఏవో కొన్ని మచ్చునకు చెప్పడం కాదు చెప్పిందే చెప్పడం, సమయాన్ని తినేయడం సభికులు ఎంతవరకూ సహించగలరు? వారి అసహనం చూసేవారికి స్పష్టంగా గోచరిస్తోంది.

వామనమూర్తిని వేదిక మీదకి పిలిచారు. మంజీరలహరి సంస్థ తరపున వామనమూర్తి మాట్లాడటానికి రాగానే సభ అంతా నిశ్శబ్దమైపోయింది.

వామనమూర్తి ఉపన్యాసం అంటే ప్రజలకు ఎంతో ఇష్టం. ఒకసారి మాట్లాడినట్లు మరొకసారి మాట్లాడడు. పదములు ప్రయోగించడంలో అతడికతడే సాటి. అతడు మాట్లాడుతోంటే హాస్యపు జల్లులు కురుస్తాయి.

చాలా తక్కువ సమయమే స్పీచ్‌కి తీసుకొంటాడు. అవసరమైన విషయాలే చెపుతాడు. యదార్థమైన విషయాలు మాత్రమే చెపుతాడు. అందుకే అతడు చాలామందికి విరోధి అయ్యాడు.

వామనమూర్తిని వక్తలలో పెడితే మరొక సంఘం ప్రోత్సాహం కూడా ఉన్నట్లు ఉంటుందని గిరిధర్, వాణీప్రసాద్‌ను పిలిచారు. యంఎల్ఏగారికి, యంపిగారికి సంబంధించిన విషయం కనుక అతడు కూడా నిరాకరించలేకపోయాడు.

మహాకవుల పుస్తకాల పేర్లుపెడితే మన పుస్తకాలు కూడా అంత గొప్పవైపోతాయనుకోవడం తెలివితక్కువన్నాడు. రత్నావళి అనగానే ప్రజలకు స్ఫురించేది శ్రీహర్షుడు రాసిన 'రత్నావళి' మాత్రమేనన్నాడు.

గ్రంధము యొక్క ప్రాశస్త్యాన్ని చెప్పమని తనని పిలిచారని, అయితే తాను ఒక విమర్శకుడిగా వచ్చినప్పుడు మంచి చెడ్డలు రెండూ చెప్పక తప్పవన్నాడు. అసలు ఆ పుస్తకాన్ని గ్రంధమని అనడం బావుండలేదన్నాడు. 'పుస్తకావిష్కరణ' అన్నంతమాత్రాన పరువు తక్కువకాదన్నాడు.

సభలు, సంస్థలు పెట్టింది వ్యక్తులకు ప్రోత్సాహమివ్వడానికేగానీ, మరీ అతిశయోక్తిగా ప్రశంసించడం సమంజసమా? మహాకవి తిక్కన కాలిగోరుకి కూడా మనం సరితూగ





లేం. అటువంటిది నాలుగు కందపద్యాలు రాసినంత మాత్రంచేత 'అభినవ తిక్కన' అని బిరుదునీయడం హర్షణీయమా?

ఏ సంస్థ అయినాసరే బిరుదులను ఇచ్చేటప్పుడు వ్యక్తులకు ఆ బిరుదులు తగినవా, కావా అని ఆలోచించాలని హెచ్చరించాడు. వ్యక్తిగత ప్రయోజనాలకోసం గొప్పగొప్ప బిరుదులు ఇవ్వరాదన్నాడు.

వింటున్న గిరిధర్‌కి ముచ్చెమటలు పోయసాగాయి. కొరివితో కోరి తల గోక్కున్నట్లు ఇతడిని ఎందుకు వక్తగా ఆహ్వానించానా అని గింజుకోసాగాడు. అప్పటికే సుదర్శన నాయుడు చిరాకుగా అతడిని చూస్తున్నాడు.

"పుంభావ సరస్వతి' అని మనం ప్రశంసించగలిగింది, గౌరవించగలిగింది నన్నయ్య మహాకవి, తిక్కనవంటివారినేనని గట్టిగా చెప్పాడు. ప్రతీ వ్యక్తీ 'పుంభావ సరస్వతి' కాలేడు. అర్హత లేని పొగడ్తలు పొగిడి ఆ వ్యక్తిని ఆకాశంలో నిలబెట్టరాదన్నాడు.

పద్యాలలోని భావం బాగుందని, మచ్చుకి రెండు పద్యాలు చదివి చెప్పాడు. బాగా కృషిచేసి, మంచి మంచి పుస్తకాలు రాయడానికి ప్రయత్నించమని తన ఉపన్యాసం ముగించాడు.

పెద్దల మొహాలు మాడిపోయాయి.

పానకంలో పుడకలాగ ఈయనెందుకు వచ్చాడురా అని లోలోపల అనుకోసాగారు. వాణీప్రసాద్ వామనమూర్తి మాట్లాడుతున్నంత సేపు చాలా ఇబ్బందిగా కుర్చీలో కదలసాగాడు.

ప్రత్యేకంగా తెప్పించి కూర్చోపెట్టిన ఆ కుర్చీ అతడికి చాలా ఇరుకుగా కూర్చోలేనంత బాధగా అన్పించసాగింది. పైకిమాత్రం బలవంతంగా చిరునవ్వు ఎరువు తెచ్చుకొన్నాడు.

సారధి ప్రశంసాపూర్వకంగా వామనమూర్తిని చూశాడు.

ఇంకా ఎవరైనా మాట్లాడదలచుకొంటే మాట్లాడవచ్చునని సంస్థ అధ్యక్షులు చెప్పారు. సారధిని వెళ్ళి మాట్లాడమని వామనమూర్తి మరికొందరు బలవంతం చేశారు. సారధికి తప్పలేదు.

"యాంత్రిక జీవిత నిరంతర సంఘర్షణ నుండి బయటపడాలంటే, మానసికమైన ఆనందాన్ని పొందాలంటే మనిషి కళలను ఆశ్రయించక తప్పదు. కవిత్వం, సంగీతం, శిల్పంవంటి కళలు మానవులకు ఎంతో ఆత్మానందాన్ని ప్రసాదిస్తున్నాయి గనుకనే ప్రజలు కళలకు పట్టంకట్టి ఈనాటికీ ఆదరిస్తున్నారు. సమాజాన్ని ముందుకు నడిపించే బాధ్యత కవులపై, సంస్థలపై ఉంది. వారు బాధ్యతగా ప్రవర్తించిననాడే సమాజ అభివృద్ధి జరుగుతుంది.

"కీర్తిప్రతిష్టలకు కవులుగాని, సంస్థలుగాని తల వంచరాదు. నిష్కర్షగా తాము చెప్పదలచుకొన్నది చెప్పాలి. వ్యక్తిగత ఆరాధనా సంస్థలుగా సాంస్కృతిక సంస్థలు ప్రవర్తించరాదు. ఎందరో కవులు, వారు రాసిన గ్రంథాలు వెలుగుచూడలేకపోతున్నాయంటే దానికి కారణం డబ్బా, పలుకుబడా, ప్రజలా, సంస్థలా?

"అర్హుడైనవాడిని కిందికి తోసేస్తున్నాం. అనర్హుడిని అందలం ఎక్కిస్తున్నాం. ఇది ప్రగతా? ఇవి సంస్థలు చేయవలసిన పనా? కవులనుగాని, పండితులనుగాని ఏదైనా ఒక కృషిని వారు జరిపినప్పుడు ఆనందంతో అభినందించి, మీ కృషిని మేము గమనిస్తున్నాం అని చెప్పడానికి వారు ఉత్సాహంతో ముందుకు నడిచేలాగ ప్రోత్సహించడానికి మాత్రమే సంస్థలు త్రికరణశుద్ధిగా పనిచేయాలి. వీరు మనవారు, వీరు పెడవారు అనే దుర్బలత్వాన్ని సంస్థలు విడనాడాలి"

అంటూ సారధి ఉపన్యాసం ఇచ్చారు. చివరలో వాణీప్రసాద్ చేసిన కృషి అభినందించదగినదని, ఎన్నో ఇటువంటి మంచి గ్రంథాలు రాయాలని కోరుతున్నానని చెప్పి ముగించాడు.



వాళ్ళు మాట్లాడిన విషయాలలో అసత్యం ఉంటేకదా! అందుకే ఎవరూ పైకి ఏమీ అనలేకపోయారు. యం.పి.గారు సారధిని తేరి పార చూడటం అందరూ గమనించారు. ఆయన కళ్ళకి ఒక అపశ్రుతిలా కన్పించాడు సారధి.

మీటింగ్‌కి వచ్చినవాళ్ళుమాత్రం రకరకాలుగా మాట్లాడుకోసాగారు. 'ఒక్క బిరుదు ఇచ్చి ఊరుకొన్నారు. ఇంకానయం 'కవిబ్రహ్మ' అని మరొకటి కూడా తిక్కన్నది తెచ్చి ఇచ్చేశారు కాదు అని ఒకరు, ఈకాలంవాళ్ళకి ఆవగింజంత ప్రతిభ ఉంటే ఆకాశమంత పేరు కావాలిఅని మరొకరు,వింటున్న సంస్థ సభ్యుల మొహాలు మాడిపోయాయి.

విద్యకి ఆరోజు సభనుండి వచ్చేశాక ఎన్నో సందేహాలు బయలుదేరాయి. ఆ అమ్మాయి మనసులో ఏదన్నా బయలుదేరిందా తీర్చుకోనిదే నిద్రపట్టదు. తండ్రి భోజనంచేసి పడుకొని లేచాక తన సందేహాలన్నీ బయటపెట్టింది.

ఆయనకి విద్య అడిగే విషయాలు చెప్పడమంటే ఎంతో ఆసక్తి ప్రతి చిన్న విషయాన్ని ఎంతో శ్రద్ధగా ఆయన చెపుతారు. సంస్థలు ఎలా బయలుదేరాయో, వాటియొక్క ప్రయోజనాలు ఏమిటో అన్నీ తండ్రీకూతుళ్ళు మాట్లాడుకొన్నారు.



విద్య ఒక తపస్సులాగ పబ్లిక్ పరీక్షలకి చదువుతోంది. ఇప్పుడు క్లాసులో ఆమె ఎవరినీ పట్టించుకోవడంలేదు. రాణి హేళనచేసినా జవాబుచెప్పదు. తన చదువేమిటో తానేమిటో!

రాణి అన్నగారితో అంది "అన్నయ్యా! విద్య నాన్నగారిని కాస్త దూరంగా డ్యూటీ వేస్తే సరి. లేకపోతే మాకు, మా ఫ్రెండ్స్‌కి క్లాసులు రావడంకష్టం" మాధవనాయుడు తన అభిప్రాయం కూడా అదే అన్నట్లు చూశాడు.

ఎప్పుడూ లేనిది ఈసారి పబ్లిక్ పరీక్షలకి సారధిని రెసిడెన్షియల్ స్కూలుకి వేశారు. ఆయనకి ఇంటినుండి తిరగడం అవదు. అక్కడే ఉంటే విద్య పరీక్షలకి దగ్గరుండటం అవదు. ఆయనకి ఏమిటోలాగ అన్పించింది.

మొదటిసారి బిడ్డ పబ్లిక్ పరీక్ష రాస్తోంటే దింపడానికైనా తాను ఉండలేకపోవడం బాధగా అన్పించింది. పోనీ సెలవు పెట్టేసుకొందామా అంటే పరీక్షలు, ఎలక్షన్లు ఎంతో ముఖ్యమైనవి. విధి నిర్వహణకు దూరమవడం ఆయనకిష్టంలేదు.

విద్యే ఆయనకి ధైర్యం చెప్పింది. అన్ని సబ్జక్టులూ బాగా చెప్పెయ్యడం అయిపోయింది. తాను జాగ్రత్తగా రాస్తానని హామీ ఇచ్చింది. మురళికి విద్యని అప్పగించి, చేసేది లేక ఆయన డ్యూటీకి వెళ్ళిపోయారు.

విద్య హాల్‌టిక్కెట్ తీసుకొందుకు వెళ్ళేటప్పటికి రాణి, ఫ్రెండ్స్ అక్కడే ఉన్నారు. "పాపం నాన్నకూచి ఎలాగ పరీక్షలు రాస్తుందే?" సుధ విద్యని చూస్తూ వెక్కిరింతగా అంది. రాణి గేలిచేస్తున్నట్లు నవ్వింది.

"స్ట్రిక్టు, స్ట్రిక్టు అంటూ గొప్పగా ఫీలైపోతే ఏమిటవుతుంది? ఏ అడవిప్రాంతానికో డ్యూటీ పేరుచెప్పి తరలిస్తారు. ఊరుకొంటారేమిటి?" కళ్ళు తిప్పుతూ రాణి అంది. "ఆయన లేకపోతే విద్య కాగితంమీద కలం పెట్టగలదా?" దీప్తి జాలిగా అంటున్నట్లు చెప్పింది. విద్య మౌనంగా వాళ్ళవైపు చూసింది.

"అలాగ అనకే! ఆ పిల్ల శక్తి నీకు తెలియదు. స్టేటు రాంకు కొట్టెయ్యగలదు'' అంటూ రాణి పగలబడి నవ్వింది. నీ మొహానికి రాంకు రావడం ఒకటా అన్న హేళన వాళ్ళ





మాటల్లో తొంగిచూస్తోంది. హెడ్‌మాస్టారు ఆమధ్య విద్యను చూస్తూ "పట్టుదలతో చదివితే తప్పక నువ్వు రాంకు సాధించగలవమ్మా!" అని అన్నారు. ఆరోజునుండి విద్య కనబడితే వారు ఇలాగే వేళాకోళం చేస్తున్నారు.

విద్య నెమ్మదిగా నడిచి రాణీవాళ్ళ దగ్గరికి వచ్చింది. "చూడు! పైన తథాస్తు దేవతలుంటారు. నీ మాటలకి వాళ్ళు 'తథాస్తు' అన్నారా తప్పక నాకు రాంకు రాగలదు. అప్పుడు నీకు మంచి ప్రజంటేషన్ ఇచ్చితీరతాను'' అని దృఢంగా అంది. ఆ అమ్మాయి కంఠంలో ధ్వనిస్తున్న ఆత్మవిశ్వాసానికి వాళ్ళు నోరు మూసుకున్నారు.

ఇదంతా వింటున్న కస్తూరి ఊరుకోలేకపోయింది. "పాపం... చిన్నన్నయ్య సాయం తీసుకొంటేకానీ మనం గట్టెక్కడం సాధ్యంకాదు. అవునా జ్యోతీ!" అంది. కస్తూరి మాటలకు రాణికి ఒళ్ళు మండిపోయింది.

"రౌడీలరాజ్యంకదా ఇది. మరి వాళ్ళ సాయం లేకపోతే పరీక్షలు చదవనివాళ్ళు ఎలా రాయగలరు? ఇదేమన్నా స్కూలుపరీక్షా? అభిమానంగా ఫస్టులు వేయడానికి?" జ్యోతి కసిదీరా మాటలు అనేసింది. రాణి మొహం కోపంతో బాగా ఎర్రబడిపోయింది. "షటప్'' అంటూ చెప్పులు చప్పుడు చేసుకొంటూ వెళ్ళిపోయింది.

ఎవరు డి.ఇ.ఓ.కి టెలిగ్రాంలు ఇవ్వడం, పిటిషన్ పెట్టడం చేశారోగానీ రాణి వాళ్ళ సెంటరుకి ముందు ఇచ్చిన ఆర్డర్స్ మారిపోయాయి. స్ట్రిక్టుగా పనిచేస్తారనుకొన్నవాళ్ళని వేరే ప్రాంతాలనుండి పిల్చి, ఇక్కడ పరీక్షలకి వేశారు.

ఎంత గింజుకున్నా చీఫ్‌కి వాళ్ళని డ్యూటీలోకి తీసుకోక తప్పలేదు. పైగా ఆ సెంటరు మీద నిఘా ఉంచమని అందరికీ ఆదేశాలు వెళ్ళాయి. మాధవనాయుడి పని కుడితిలోపడ్డ ఎలుకలాగ అయింది.

రాణి స్వతహాగా తెలివైన పిల్లే. బాగానే చదువుతుంది. కానీ ఇంట్లో, బయట జరిగే గారాబంవలన కష్టపడటానికి ఒప్పుకొనేది కాదు. కష్టపడకుండా వచ్చే మార్కులకి అలవాటుపడిపోయింది.

ఇప్పుడు జరుగుతున్న మార్పులు చూశాక, పరీక్ష పోతే తల ఎత్తుకొని తిరగలేని పరిస్థితి వస్తుందేమోనన్న భయం పట్టుకొంది. మొదటి పరీక్ష స్ట్రిక్టుగా జరిగేటప్పటికి, ఇంక ఇతరులపై ఆధారపడటం మాని చదవసాగింది.

మాధవనాయుడిని సెంటరుకి రమ్మని రాణి ఫ్రెండ్సు అభ్యర్థించారు. అతడు వాళ్ళ మాటలకి లొంగిపోయి, చెల్లెలికోసం నిజంగానే ప్రయత్నాలు ప్రారంభించాడు. మొదటిరోజే సెంటరులోకి రాబోయిన అతన్ని డిపార్టుమెంటల్ ఆఫీసర్ పొమ్మని కేకలేశాడు.

ప్యూనుచేత లోపలికి స్లిప్పులు పంపబోతే ఎలా గ్రహించాడో ఆయనే పట్టుకొని, ప్యూనుని నాలుగు దులిపేశాడు. వాచర్లుగా వచ్చినవాళ్ళు కూడా ఖచ్చితమైన బాచ్ అవడంతో మాధవనాయుడి ఎత్తులు పారలేదు.

విద్యకిమాత్రం ఎంతో ఆనందంగా అన్పించింది. తండ్రి డ్యూటీకి వెళుతూ కూడా తన గురించే ఆలోచించడం గుర్తుకి వచ్చింది. పరీక్షలు ఇంత ప్రశాంతంగా జరుగుతున్నాయంటే ఆయన ఎంత సంతోషిస్తారో అని అనుకొంది.

ఇంగ్లీషు పేపర్లు రెండింటికీ సిటింగ్‌స్క్వాడ్ ఒక రోజైతే, ఫ్లయింగ్‌స్క్వాడ్ ఒకరోజు వచ్చారు. దానితో పిల్లలు కొందరు చాలా నిరుత్సాహపడ్డారు. తల్లిదండ్రులుమాత్రం ఏమనగలరు?

ప్రైవేటు పేరు చెప్పి తమ దగ్గర డబ్బులు తీసుకొని, పిల్లలు స్వంతంగా, నిర్భయంగా పరీక్షలు రాసేలాగ తయారుచేయలేకపోయారని తల్లిదండ్రులు కొందరు బాధపడ్డారు. ఏవో నాలుగు ఇంపార్టెంట్ ప్రశ్నలు చెప్పడం, ప్రైవేట్లలోని పిల్లలకి మార్కులు నాలుగు ఎక్కువ కలిపి వారిని సంతోషపెట్టడంవలన, పిల్లలు



చదువుకోవడానికి బద్ధకించారు. ఇప్పుడు బాధ పడుతున్నది ఎవరు?

జ్యోతిలాంటివాళ్ళకి ఏవిధంగా జరిగినా ఫర్వాలేదు. జ్యోతి, ఇందిర బాగా కష్టపడి చదువుతారు. ఏదైనా లాభం కలిగినప్పుడు అందరితో సమానంగా పోటీకి వస్తారు. అలా గని చదవడం మానరు. ఆ పద్ధతివలన ఇప్పుడు బాధపడకుండా పరీక్షలు రాశారు.

మాధవనాయుడికి, కొందరు మేష్టర్లకి అను మానం సారథిపైనే కలిగింది. ఎవరో డి.ఇ.ఓ.గారికి, ఎగ్జామినేషన్స్ కంట్రోలర్‌కి ఉత్తరాలు రాశారని, టెలిగ్రాం ఇచ్చారని. అందువలనే ఈ మార్పులు ఆ సెంటర్ విష యంలో జరిగాయని టాక్ వచ్చేసింది.

మాధవ, సుదర్శననాయుడు ఎవరెవరినో పట్టుకొని కూపీ లాగారు. వచ్చిన ఉత్తరాలు రాసింది సారథికాదని తెలిసిపోయింది. ఎవరో రాశారని, తాము భయంవలన తమ పేరు బయటపెట్టడంలేదని, అలాగని చర్య తీసుకో వడంలో ఆలస్యం చేయవద్దని ప్రార్థించారట. టెలిగ్రాంమాత్రం విద్యార్థులు ఇచ్చినదేనట. ఈ విషయాలు తెలియడంతో మాధవకి, సుద ర్శననాయుడికి ఒళ్ళు మండింది.

పరీక్షా ఫలితాలు వచ్చేవరకూ పిల్లలు బిక్కుబిక్కుమంటూనే ఉన్నారు. రిజల్ట్సు వచ్చే ముందురోజే ఈవినింగ్ ఎడిషన్‌లో విద్య ఫొటో పడటంతో పిల్లలు ఎంతో సంతో షించారు. విద్యకి రాష్ట్రంలో నాల్గవ రాంక్ వచ్చింది.

విద్య రాంక్ వచ్చిందని తెలియగానే సార థిగారిని ఆనందంతో అల్లుకొనిపోయింది. ఆయనకీ కొద్దినిముషాలు నోటమ్మట మాట రాలేదు. విద్య చేసిన కృషి ఆయనకి తెలుసు. ఆనందంతో ఆయన కళ్ళు చెమర్చాయి.

మురళి చెల్లెలిని ఎత్తుకొని గిరగిరా తిప్పేశా డు. మర్నాడు పత్రికా విలేకర్లు వచ్చి విద్యని ఇంటర్వ్యూ చేశారు. హెడ్‌మాస్టర్‌కీ ఆనందంతో మాటరాలేదు. తమ స్కూలు విద్యార్థిని రాష్ట్రంలో రాంక్ సాధించినందుకు ఆయన పొంగిపోయారు. స్కూలు చరిత్రలోనే ఇది గర్వకారణమని అన్నారు.

విద్యకి అంతా ఏమిటోలాగ అన్పించింది. స్టాఫ్, హెడ్‌మేష్టారు వచ్చి ప్రశంసించడం ఆనందంగా అన్పించింది. ఫస్టుక్లాసు వస్తుందని గ్యారంటీగా అనుకొంది. రాంకువ రకూ అనుకోలేదు. పరీక్షలు అంత ప్ర శాంతంగా నిర్వహించబడకపోతే తనకి రాంకు వస్తుందా అని అనుకొంది.

ఇందిరకి, జ్యోతికి ఫస్టుక్లాసులు వచ్చాయి. కస్తూరికి సెకండ్‌క్లాసు వచ్చింది. మగపిల్లల్లో ముగ్గురికి సెకండ్‌క్లాసులు, ఒకరికి ఫస్టుక్లాసు వచ్చింది. రాణికి సెకండ్‌క్లాసు వచ్చింది. ఆ అమ్మాయి ఫ్రెండ్స్ శైలజకి ఫస్టుక్లాసు వచ్చింది. మిగిలినవారిలో ఇద్దరికి థర్డుక్లాసు, ఒకరికి సెకండ్‌క్లాసు వచ్చింది.

రాణి రిజల్ట్సు చూసి ఏం గొడవ చేస్తుందో అని తండ్రి, అన్నలు భయపడ్డారు. రాణి పేపరు తీసికొని వెళ్ళి, తన గదిలో తలుపులు వేసికొని కూర్చుండిపోయింది. ఆ అమ్మాయికి తనకి ఫస్టుక్లాసు రాకపోవడం చాలా అవమా నంగా అన్పించింది. పైగా పేపర్లోని విద్య ఫొటో తనని చూసి నవ్వుతున్నట్లే అన్పించింది.

రెండుజడలమధ్య విద్యమొహం ఎంతో లేతగా ఉంది. విద్య నవ్వుతున్న తీరు ఆమెకి ఎంతో నచ్చింది. విశాలమైన విద్య కళ్ళల్లోని విజ్ఞానం వెలుగు రాణి గుర్తించింది. ఆ చిరున వ్వే విద్యకి పెద్ద ఆభరణం అనుకొంది.

విద్య చేరినప్పటినుండీ జరిగిన సంఘటన లు రాణి కళ్ళముందు కదలసాగాయి. విద్య స్కూల్లో చేరిననాడు తను ఉండి ఉంటే... తన పక్కనే కూర్చోమని ఆహ్వానించేదేమో... ఏమో... అని అనుకొంది. అయినా ఇప్పుడు తనకి విద్యపై ఆకర్షణ కలగడం ఏమిటని అనుకొంది.

విద్య స్నేహపూరితమైన ప్రవర్తన ఒక్క క్షణం గుర్తుకి వచ్చింది. విద్యని అసలు




తమవైపుకి జ్యోతీవాళ్ళు రానిస్తారా? ఇప్పుడైతే చచ్చినా రానీయరు అని అనుకొంది. రాణి విద్య ఉన్న ప్రాంతాన్ని పేపరులో కటిచేసింది.

తల్లిదండ్రులు, అన్నయ్యలు అందరూ వచ్చి తలుపు తీయమని బతిమాలడంతో రాణికి మంచంమీదనుండి లేవక తప్పలేదు. ఒక్కరోజుకే రాణి మొహం పీక్కుపోయింది. రాణిని చూస్తే వారికి ఎంతో జాలివేసింది.

అందరూ రాణిని భోజనానికి రమ్మని బతిమాలారు. మాధవనాయుడికి రాణి మంచంమీదనున్న పేపరు కన్పించింది. విద్య ఫొటో, వివరాలు ఉన్న భాగం కత్తిరించబడడంతో అతడికి ప్రాణం హాయిగా అన్పించింది.

ఏదిఏమైనా రాణి తమ ఇంటికి ఆడపడుచు. తమ పౌరుషమైన రక్తమే ఆమెలో ప్రవహిస్తోంది. రాణిని చూసి గర్వంగా ఫీలయ్యాడు. పద్మనాభనాయుడు కూతురిని ఓదార్చాడు. రాణి బదులు ఏమీ పలకలేదు.

"పరీక్షలు బాగా రాయడం, ఫస్టుక్లాసు తెచ్చుకోవడం చేతకాదుకానీ అలగడం, భోజనానికి రాకపోవడంమాత్రం ఫస్టుగా వచ్చును'' గొణుక్కుంటూ లక్ష్మి అందరికీ కంచాలలో చెట్నీ వడ్డిస్తోంది. వదినగారి మాటలు రాణికి చెళ్లున తగిలాయి. వాష్‌బేసిన్ దగ్గర చేతులు కడుక్కొంటున్న రాణిని వదినగారు చూడలేదు. రాణి ఆ మాటలు విన్నట్లు ఆమె మొహమే చెపుతోంది.

లక్ష్మికి ఏంచేయాలో తెలియలేదు. రాణి అంటే ఇంట్లో అందరికీ ఎంత గారాబమో ఆమెకి తెలియనిది కాదు. ఎంతసేపైనా ఒక్కరూ భోజనానికి రాకపోవడం, లక్ష్మికి ఆకలేయడంవలన వచ్చిన విసుర్లు ఆ మాటలు. ఒక్కక్షణం భయపడ్డా నేను అన్న మాటల్లో తప్పేం ఉంది అని అనుకొని ధీమాగా వెళ్ళిపోయింది.

భోజనాలదగ్గర సుదర్శననాయుడు విద్య, సారధిల ప్రసక్తి తెచ్చాడు. అసలే ఆ సారధికి గర్వం ఎక్కువ. ప్రతీ విషయంలో తనకే ధైర్యం ఉందని అందరినీ అంటూ ఉంటాడు. అందరూ ఆయనంటే అభిమానపడి చస్తున్నారు. ఇప్పుడు జిల్లాలో కూతురు రాంక్‌వలన ఒకటే పొగడ్తలు అందుకొంటాడు.

"బావుందిరా! రాష్ట్రంలో నాల్గవరాంకు కూతురికి వస్తే ఏ తండ్రి గర్వించడు. అటువంటి అదృష్టం అందరికీ వస్తుందా'' ఎం.ఎల్.ఏ.గారు నిజాయితీగా అన్నారు. తన బిడ్డల చదువు ఆయనకి అటువంటి తృప్తిని కలిగించలేదన్న ధ్వని కూడా ఉంది.

"జిల్లాకే ఆ అమ్మాయివలన ఒక రాంకు వచ్చిందని డి.ఇ.ఓ.గారు వాళ్ళు కంగ్రాచ్యులేషన్స్ చెప్పారుట. కూతురు, తండ్రి మహా గర్వపడిపోతున్నారట. మన సత్యంమేష్టారు చెప్పారు'' సుదర్శననాయుడు అసూయగా అన్నాడు.

"ఆ... మిడిసిపడిపోతే ఏంచేయాలో మనకి తెలియదా? సెంటర్‌లోకి మనల్ని వెళ్ళనిస్తే అప్పుడు తెలిసేది మన రాణి సంగతేమిటో అందరికీ'' మాధవనాయుడు నిర్లక్ష్యంగా అన్నాడు.

అంతేకాదనీ, ఈసారి ఇంటర్మీడియెట్‌లో రాణికి రాంక్ తెప్పించి తీరతానని, ఇప్పుడే ఆ విషయం ఛాలెంజ్ చేస్తానని పౌరుషంగా అన్నాడు. ఎం.ఎల్.ఏ. చిన్నకొడుకునని, తనకి ఉన్న పరపతి ఎవరికీ లేదని అతడికి గర్వం.

"మా యువజన సమితి తలచుకుంటే..." మాధవ నోటినుండి మాటలు పూర్తిగా రాలేదు రాణి చివాలున కంచందగ్గరనుండి లేస్తూ అంది "చిన్నన్నయ్యా! ఇప్పటివరకూ జరిగింది చాలు. నాకు తెలివితేటలు ఉన్నాయి. ఎలాగ చదువుకోవాలో, ఎలా ఫస్టుమార్కులు తెచ్చుకోవాలో నాకు తెలుసును. మీ ఎవరి ప్రమేయం అవసరంలేదు''

రాణి మాటలకి కొడుకులు ఎక్కడ చిన్నబుచ్చుకుంటారో అని ఎం.ఎల్.ఏ.గారి బాధ. పరీక్షలో క్లాసు అనుకొన్నది రాకపోవడంవలన

చెల్లెలు నిరుత్సాహంగా ఉందని, బాధవలన ఏదేదో మాట్లాడుతోందని ఆయన సర్దిచెప్పారు.

నిజానికి బాగా చదవాలనే పట్టుదల రాణిలో తొంగిచూడటం ఆయనకి ఆనందాన్నే కలిగించింది. అమ్మాయి ఆ పట్టుదలలో ఉంటేనే బావుంటుంది. దానికితోడు తన అధికారం, పరపతి ఎలాగో ఉన్నాయి.

విద్య కాలేజీలో చేరినరోజున ప్రిన్సిపాల్గారు సంతోషంతో ఆహ్వానించారు. లిస్టులో ఫస్టుపేరు ఆ అమ్మాయిదే. యం.పి.సి. గ్రూపులో చేరి, ఫీజుకట్టింది విద్య. జ్యోతి, కస్తూరి యం.పి.సి. పెట్టారు. జ్యోతికి వచ్చిందిగానీ కస్తూరికి రాలేదు. ఆ అమ్మాయి ఆర్ట్సులో చేరింది.

విద్యకి మర్నాడు రాణి కన్పించింది. జ్యోతి నోరు ఊరుకొంటుందా? "క్లాసు రానప్పుడు ఏంచేస్తావే! ఏదో గంతకుతగ్గ బొంతలాగ నీ మార్కులకి వచ్చే గ్రూపే చదువుకో' పక్కనున్న స్నేహితురాలినంటున్నట్లు అంది. విద్య వారిస్తున్నట్లు చూసింది. జ్యోతి ఖాతరు చేయలేదు.

"ఇక్కడ సత్యంమేష్టారు లేరు. ఎలాగ నీ ఇంటరు గట్టెక్కుతుందే'' కస్తూరి మరొక చురక వేసింది. "ఏది ఏమైనా రాంకు తెచ్చుకోవాలంటే రాత ఉండాలి'' జ్యోతి విద్యవైపు గర్వంగా చూస్తూ అంది.

రాణి ఇంక సహించలేకపోయింది. "పెద్ద... మీకే ఏదో రాంకు వచ్చినట్లు ఫీలైపోతున్నారే' ఈసడింపుగా చూస్తూ అంది.

"అబ్బే... నీకు వచ్చిందికదూ!" జ్యోతి ఎకసక్కెంగా అంది. మీ గ్రూపువాళ్ళ మార్కులు మాకు తెలియవనుకొన్నావా?" కస్తూరి చులకనగా అంది.

రెండుమార్కులలో రాణికి ఫస్టుక్లాసు రాలేదని వారికి తెలుసును. "విద్యా! నీకింత అహంకారం పనికిరాదు'' రాణి కళ్ళు విద్యవైపు క్రోధంతో చూశాయి.

విద్యకి తనేం చేసిందో అర్థమవలేదు.

తను రాణికి ఇస్తానన్న ప్రజంటేషన్ గురించి అని అనుకొంది. "రాణీ! ఇదిగో నీకోసం దీన్ని తీసుకొన్నాను. ఈ విద్య ఏనాడూ మాట ఇస్తే మరిచిపోదు'' అంటూ హేండ్బేగ్లోంచి వెండి సరస్వతి విగ్రహాన్ని తీసి ఇచ్చింది.

వీణాపాణి అయిన సరస్వతి ఎంతో ముద్దుగా ఉంది. "నీవు ఇచ్చే బహుమతులకోసం ఎవరూ ఇక్కడ మొహంవాచిపోయి లేరు'' రాణి దాన్ని గిర్రున విసిరికొట్టింది. విద్య ఇచ్చిన స్వీట్లు ఇసుకలో పడిపోయాయి.

విద్యకి చాలా కష్టం కలిగింది. రాణి కూడా కాలేజీలో చేరిందని వాటిని తెచ్చింది. "విద్యా! నువ్వు చాలా తెలివైనదానివి. నోరు నువ్వు విప్పకుండా నీ ఫ్రెండ్సుతో అంతంత మాటలు అన్పిస్తావు. గెలుపు ఎప్పుడూ ఒకరివైపే ఉండిపోదు'' మండిపడుతున్నట్లు అంది రాణి.

"అదే మేమూ అంటున్నాము. గెలుపు మీవైపే ఉంటుందని గర్వపడ్డావు శృంగభంగమయింది. ఏదో తండ్రి పరపతి ఉపయోగించుకొని సీటు సంపాదించుకొని పైగా మమ్మల్నే అంటున్నావా? భేష్... చాలా గొప్పదానివి'' అంది జ్యోతి తన చెయ్యిపట్టి విద్య లాక్కువెళుతున్నా లెక్కచేయకుండా వెనక్కి తిరిగి చూస్తూ.

రాణికి ఆ మాటలన్నీ విద్యే అన్పిస్తున్నట్టుగా అర్థమైంది. వాళ్ళని తనపైకి ఎగదోసి ఇప్పుడు నాటకమాడుతోంది. అందుకే వెళుతున్న విద్య చేతిలో సరస్వతీ విగ్రహం పెట్టి, "విద్యా! ఈ క్షణంనుండి కాచుకో! ఏ విషయంలో అయినాసరే నీతో పోటీకి సిద్ధంగా ఉంటాను. రాణి అంటే ఏమిటో నీకు తెలియజేస్తాను'' అంటూ వెళ్ళిపోయి కారు ఎక్కేసింది.

"విద్యతో పోటీపడటం, గెలవడం నీ జన్మలో జరగదు'' అంటున్న కస్తూరి నోరు విద్య మూసేసింది. కాలేజీలో చేరినవెంటనే పోట్లాడుకోవాలా? విషయాలు ప్రిన్సిపాల్ వరకూ వెళితే ఏం బావుంటుంది?




అయినా ఇంకా తాము చిన్నపిల్లలమా? అందుకే విద్య గట్టిగా జ్యోతీవాళ్ళతో దెబ్బలాడింది. అనవసరంగా ఇలాంటి తగాదాలు పడితే తాను వాళ్ళతో మాట్లాడనని బెదిరించింది.

విద్యకి మారుతీ ఎంటర్‌ప్రైజెస్‌వారు లూనా ఒకటి ప్రెజెంట్ చేశారు. వర్తకసంఘంవాళ్ళు, హైస్కూలువాళ్ళు చెక్కులు ప్రజంట్‌చేశారు. సారధి వాటిని మార్చి, విద్యకి గుర్తుగా ఉంగరం చేయించి ఇచ్చాడు. విద్యకి కాలేజీలో స్కాలర్‌షిప్ కూడా వచ్చింది. విద్య చదువు ధ్యాసలో పడిపోయింది.

మురళి చదువు సారధికి ఏమాత్రం తృప్తినీయడంలేదు. ఎంత చెప్పినా అర్థంచేసుకోడు. ఫస్టియర్ రెండు సబ్జక్టులు పోగొట్టాడు. ఇప్పుడు అవి, సెకండ్ ఇయర్‌వి చదవడం ఎంతకష్టం?

మురళి విషయం ఆయనకి బెంగగానే ఉంటోంది. ఫస్టుక్లాసు రానిదే ఏ పై చదువులలో సీటురాదు. ఎలాగ బతుకుతాడు అన్న ఆవేదన కలుగుతోంది. తెలివితేటలు తక్కువా అంటేకాదు. తెలివైనవాడే.

కాని, కష్టపడటానికి ఒప్పుకోడు. దానికి సాయం ఫ్రెండ్స్ ఎక్కువ. అతడి స్నేహితులలో ఎవరికీ చదువుపై ఆసక్తి లేదు. కాలక్షేపం చదువులాగే చదువుతారు. ఎంతసేపూ సినిమాలు, ఆటలు, కబుర్లు వారి ప్రపంచం.

వాళ్ళతో ఎందుకురా స్నేహం? వాళ్ళకైతే ఏ మార్కులు వచ్చినా పర్వాలేదు. డబ్బుతో సీట్లు వస్తాయి. నీకు ఎవరు ఇస్తారురా క్లాసు రాకపోతే అని ఆయన ఎన్నోసార్లు మందలించారు.

"బావుంది. వాళ్ళూ మనుష్యులు కాదా? స్నేహం అన్నది తెలివైనవాళ్ళతో మాత్రమే చేయాలా?" అని తల్లిదగ్గర మురళి గొణుగుతాడు. సారధిగారు అతడికి నచ్చచెప్పాలని ఎంతో ప్రయత్నించారు.

మనకన్నా తెలివైనవాళ్ళతో స్నేహంచేయాలి. మనకి తెలియనివి వారినుండి నేర్చుకోవాలి. మనకన్నా కిందివాళ్ళతో స్నేహంచేస్తే మనకి ఒరిగేదేమిటి?" అన్నది ఆయన వాదన.

"స్నేహం అన్నది హృదయపూర్వకంగా చేసేది. ఇక్కడ కూడా లాభనష్టాల ప్రసక్తి ఎందుకు చూడాలి?" అన్నది మురళి అభిప్రాయం. డబ్బు ఉన్నవాళ్ళకి, తెలివైనవాళ్ళకి గర్వం ఎక్కువని, వాళ్ళు ఎవరితో కలవరని మురళి అభిప్రాయం.

నీ చెల్లెలు అలాగే ఉంటోందా అని ఆయన అడుగుతారు. అన్నయ్య కనుక విద్య తనను ఏ విషయంలో చులకన చేయనిమాట నిజమే. కానీ కాలేజీలోని ఇతరులు ఆమెలాగ లేరుకదా!

సారధికి తన తెలివితేటలు, చాకచక్యం మురళి దగ్గర పనికిరాలేదే అన్న బాధ. మురళి అసలు జీవితాన్ని ఎందుకు లైటుగా తీసుకొంటాడో ఆయనకి అర్థమవదు. పిల్లలిద్దరినీ ఆయన సమానంగానే చూస్తారు. ఇంకా మాట్లాడితే మురళి విషయంలో ఈమధ్య ఆయన తీసుకుంటున్న జాగ్రత్త విద్యవిషయంలో లేదు.

మురళికి తండ్రి తనని ఆంక్షలలో పెట్టాలని చూస్తున్నాడనిపిస్తుంది. ఆయన చెప్పేమాటలు అతడికి రుచించవు. చెల్లిలాగ ఇంట్లో ఉండమంటే ఎలాగ? తను మగపిల్లవాడు. తనకి నలుగురు కావాలి అనుకొంటారు.

చెప్పిచెప్పి మురళి విషయంలో ఆయన అలిసిపోయారు. ఖర్మ... కూతురి విషయంలో పడవలసిన బెంగ కొడుకు విషయంలో పడుతున్నానని ఆయన ఆవేదనగా నుదురు రాసుకొంటారు.

ఒక్కొక్కసారి ఎడాల్‌సెంట్ ఏజ్. వాడే నెమ్మదిగా మారతాడు అని మనసులో ధైర్యం చెప్పుకున్నా, మరొకసారి మురళి స్నేహితులని, వాళ్ళ ప్రవర్తనని చూసి వీళ్ళు ఎలా బతుకుతారు అని బెంగపడతారు.

అసలే మురళి ఆయనకి కాస్త దూరంగా సంచరిస్తాడు. దానికి సాయం వారిద్దరూ

మరింత దూరమయ్యే సంఘటన ఆ ఇంటిలో చోటుచేసుకుంది.

మురళి విషయంలో ఆయనకి తెలియకుండా బెంగపడుతూండటంవలననేమో సారథిగారికి లోబిపి, గుండెదడ పట్టుకొన్నాయి. ఎప్పుడూ లేనిది చాలా నీరసపడ్డారు ఆయన.

డాక్టరుగారికి చూపిస్తే అంత తక్కువగా బి.పి. ఉండకూడదని కోప్పడి మందులు రాశారు. ఏనాడూ సుస్తీ అంటే తెలియని మనిషి అలా డీలాగా ఉండటం చూస్తే రాధమ్మకీ కష్టంగానే ఉంది.

ఒకరోజు రాత్రి సారథి ; ఊరికెళ్ళి వస్తున్నాడు. ఒకపక్క వర్షం, మరొకపక్క చీకటి. అలాగే బస్స్టాండునుండి ఇంటికి నడుస్తున్నాడు. టైం పదకొండు అవడంతో రిక్షాల జాడ లేదు. కొంతదూరం వెళ్ళి ఏదైనా దొరికితే ఎక్కుదామని ఆయన నడుస్తున్నారు. చాలా నీరసంగా ఉంది. బంధువులు ఉండిపొమ్మన్నా వినకుండా బయలుదేరినందుకు తనని తాను తిట్టుకొన్నారు.

ఈ సౌభాగ్యానికి సాయం కరెంటుపోయింది. ఆయన ఆగి తన చేతిలోని సంచిలో నుండి టార్చ్‌లైటు తీసుకొన్నారు. ఎక్కడైనా టీకొట్టు కనబడితే టీ తాగాలనుకొన్నారు. వర్షంవలన ఆయనకి చిరాకుగా ఉంది.

కాంప్లెక్సుకీ, సినిమాహాళ్ళకీ మధ్యగానున్న మార్గంగుండా ఆయన నడుస్తున్నారు. ఆ తోవ చాలా పెద్దది. దానికి సాయం రోడ్డుపక్క దెయ్యాలులాగ చెట్లు. ఎక్కడో దూరంగా అక్కడొకటి అక్కడొకటి ఇళ్ళు కన్పిస్తాయి.

అలాగే ఆయన నడవసాగారు. సినిమాహాలు దగ్గరికి వెళితే రిక్షాలుంటాయని, ఎక్కవచ్చునని మనసులో అనుకొన్నాడు. ఈలోపు బస్సు షెల్టరు ఒకటి వచ్చింది. ఆయన అక్కడికి నడిచేటప్పటికి అనుకోని సంఘటన ఎదురయింది. ఆయనకి హఠాత్తుగా కేకలు విన్పించాయి.





బస్సు షెల్టరు వెనుక ఒక పాడుబడిన ఇల్లు ఉంది. అందులోనుండి కేకలు, మాటలు విన్పిస్తున్నాయి. సారథిగారు ఒక్కక్షణం ఆగారు.

"నీచుడా! ఈ రిక్షావాడితో లాలూచిపడి నన్నిక్కడికి రప్పిస్తావా? నీకూ ఒక చెల్లెలుంది కదా! సాటి ఆడపిల్లని ఇలాగ చేయడం తప్పనిపించడంలేదూ'' ఒక అమ్మాయి గొంతు ఆ నిశ్శబ్దంలో విన్పించసాగింది.

"నా చెల్లెలితో నీకు సాటి ఏమిటే? నువ్వు సినిమాకి రావడం చూసే ఈ ప్లాను వేశాను. ఎన్నిరోజులనుండి నీకు చెపుతున్నాను! నాకు లొంగమంటే వింటున్నావా? ఈరోజు ఎలా తప్పించుకొంటావో చూస్తాను'' ఆ మగ గొంతుక వినగానే ఆయన తుళ్ళిపడ్డాడు.

"ఎన్నిసార్లు నీకు బుద్ధిచెప్పినా సిగ్గురాలేదా? నన్ను మర్యాదగా వదిలెయ్యి. నీకు పుణ్యం ఉంటుంది'' ఆ అమ్మాయి ఎవరో ప్రాధేయపడుతోంది.

"నీవు బుద్ధులు చెప్పవలసింది నాకుకాదు, నీ స్కూలు పిల్లలకి. మా నాన్న ఉద్యోగం వేయించాడన్న కృతజ్ఞతైనా నీకుందా? మనమధ్య జరిగింది ఎవరికీ తెలియనీయను'' అంటూ అతను ఆమెను పట్టుకోబోయాడు. ఆమె తప్పించుకోబోతూ కింద రాయి ఒకటి దొరకగానే చీకటిలోనే విసిరింది.

ఆ రాయి నుదిటికి తగిలేటప్పటికి అతను పిచ్చివాడే అయ్యాడు. నుదురు చిట్లి తడిగా తగిలింది. "నీకింత పొగరా? ఒరేయ్ చూస్తారేంరా? దాన్ని పట్టుకోండి. నన్నే దెబ్బతీస్తుందా?" అంటూ పిలిచాడు. "వదులు, నన్ను వదులు'' అంటూ ఆమె ఎంతగానో అరుస్తోంది.

సారథి ఇంక క్షణం కూడా ఆలస్యం చేయలేదు. టార్చ్‌లైటు వేస్తూ అటువైపు నడవసాగాడు. ఎలాగో ఆ రెండోవాడు ఆమెను పట్టుకొన్నాడు.

మొదటి వ్యక్తి నవ్వుతూ "నన్ను తప్పించుకోవడం నీవలన కాదని ముందే చెప్పానుకదా! ఈరోజు నువ్వు నాకు లొంగక తప్పదు'' అంటూ ఆమెను బలవంతంగా కౌగలించుకో

న్నాడు.

"అబ్బ... ఈ బుగ్గలు యాపిల్ పళ్ళలాగ ఎంత బావున్నాయో'' అంటూ కసిగా కొరికాడు. ఆమె బాధతో అరిచింది.

"మాధవా! మర్యాదగా ఆ పిల్లని విడిచిపెట్టు'' అంటూ లైటు ఫోకస్‌చేస్తూ, అటువైపు నడిచారు సారధి.

"మీరా మేష్టారూ! ఈవేళప్పుడు మీకు నాతో ఎందుకులెండి? మీదారిన మీరు వెళ్ళండి'' అంటూ అతడు ఆయనను లెక్కచేయకుండా మరోపక్కకి తీసికెళ్ళబోయాడు. అతడికి ఒక్కక్షణంమాత్రం ఆశ్చర్యం కలిగింది. తనని అంత చీకటిలో ఆయన గుర్తించడం, అటు రావడం ఊహించని విషయాలే.

"నేను వెళ్ళడం అంటూ ఉంటే ఆ పిల్లతో కలిసే. నువ్వు ఏం చేయబోతున్నావో నీకు తెలియడంలేదు. ఆ పిల్లని వదిలిపో'' అంటూ అతడిని కాలరు పుచ్చుకొని లాగివేశారు. మాధవనాయుడికి బాగా కోపం వచ్చింది. ఆయన గుంజిన గుంజుకి అతడు వెళ్ళి గోడమీద పడ్డాడు.

ఆయనను చూశాక ఆమెకి పోతున్న ధైర్యం వచ్చింది. ఆయన చేయి పట్టుకుని "త్వరగా పదండి మాస్టారూ'' అంటూ ఏడ్చేసింది.

"ఒరేయ్! ఈయనని వెనక్కి లాగండిరా!" అంటూ వాళ్ళకి చెప్పి, ఆయన చేతిని పుచ్చుకోమని కేకలు వేశాడు. వెనకనుండి ఆమెను తనవైపుకు లాక్కొన్నాడు. మాధవనాయుడి ఫ్రెండ్ సారధిని గట్టిగా తోశాడు.

ఆయన చేతిలోని టార్చి వెళ్ళి దూరంగా పడింది. "ఆయనను గట్టిగా పట్టుకోండి'' అని అతడు అనగానే రిక్షావాడు, అతడు కలిసి ఆయనను చుట్టుముట్టారు. లేచి పక్కన దొరికిన కర్రపుచ్చుకొని ఒకటి వేయబోయారు.

అది గ్రహించినవాళ్ళలాగ మాధవ స్నేహితుడు చూచి ఆయన దవడమీద కొట్టాడు. రిక్షావాడు కర్ర లాక్కొని ఆయననే రెండు దెబ్బలు వేశాడు. వాళ్ళు ముగ్గురు, తాను ఒకడు. ఏంచేయగలడు?

అయినా ఆయన అధైర్యపడలేదు. మాధవని బతిమాలుతూనే ఉన్నారు. ఆమెని వదలకపోతే పోలీసు రిపోర్టు ఇస్తానన్నారు. "ఇది నువ్వు పరీక్షలు జరిపించే సెంటరు కాదు. నోరుమూసుకొని వచ్చినదారిన వెళ్ళమంటే విన్నావా? ఫలితం అనుభవించు'' అంటూ నోటికి వచ్చినట్లు ఆయనని తిట్టాడు అతడు.

ఆ అమ్మాయిని ఆయన టార్చివెలుగులో ఒక్క సెకండే చూశారు. అమాయకమైన ఆమె మోము ఆయనకి జాలిగొలపసాగింది. బలవంతంగా వాళ్ళని విడిపించుకోవాలని ప్రయత్నించసాగాడు. ఎలాగైనా ఆమెని రక్షించాలని ఆయన ఉద్దేశ్యం. ఏదీ ఆయన చేతికి దొరకడంలేదు.

చివరికి ఓపిక తెచ్చుకొని రెండు చేతులనూ గట్టిగా ఝాడించి వాళ్ళను విదిలించుకొని, తలతో వేగంగా వెళ్ళి మాధవుడిని ఢీకొట్టాడు. మాధవుడికి ఒక్కక్షణం కళ్ళు బైర్లుకమ్మాయి. ఆ వేగానికి వెళ్ళి ఆమెమీద పడ్డాడు.

సారధి ఆమెవైపు నడిచి, ఆమెను లేవనెత్తి తన వెనక్కి తెచ్చుకొన్నారు. ఇంతలో ముగ్గురూ లేచి ఒక్కటై ఆయనను చుట్టుముట్టారు. "ఎంత చెప్పినా ఈ మేష్టారు వినిపించుకోవడంలేదు. ఇంక వీడిని ఉపేక్ష చేయకండి'' అంటూ టార్చిలైటు అందుకొని ఆయన తల మీద కొట్టాడు.

రిక్షావాడి భుజంమీద ఉన్న తువ్వాలుతో ఆయన చేతులు కట్టేశాడు మాధవ స్నేహితుడు. రిక్షావాడు గోడమూలకి ఆయనను లాక్కువెళ్ళాడు. సారధిగారికి కళ్ళు చీకట్లు కమ్మాయి. నీరసం ముంచుకొచ్చింది.

జరుగుతున్నదానికి ఆమెకి పైప్రాణం పైనే పోయింది. ఎలాగో మాధవమీదపడి టార్చిలాక్కొని, దానితో అందినచోటల్లా కొట్టసాగింది. మాధవనాయుడికి ఒళ్ళు మండిపోయింది. బలవంతంగా రిక్షావాడు, సారధి ఉన్నమూలకి ఎదురుగా ఉన్నవైపుకి ఈడ్చేశాడు.

ఆమె జాకెట్టు చింపేశాడు. ఆమె ఎంత ప్రతిఘటించినా లాభంలేకపోతోంది. సారథిగారు ఎలాగైనా వాళ్ళిద్దరినీ వదిలించుకొని, ఆమెను అతడిబారినుండి కాపాడాలని ప్రయత్నించసాగారు.

కాళ్ళతో వాళ్ళను తన్నినా, తోసినా ప్రయోజనం లేకపోయింది. ఆయన ఎంతో దీనంగా వేడుకోసాగాడు. వాళ్ళు ఆ మాటలు లెక్కచేయలేదు. ఆయన అలాగ ప్రతిఘటించడం చూసి వాళ్ళు మరీ రెచ్చిపోయారు. జనసంచారం అటువైపు పగలే తక్కువ. ఈ రాత్రివేళలో ఎవరు వస్తారు? దగ్గర తోవ కదా అని ఆయన అటు వచ్చినందుకు ఫలితం ఇది. మూసుకొనిపోతున్న ఆయన కళ్ళను చూస్తూ మాధవ స్నేహితుడు ఆయన జుట్టు పట్టుకొని గుంజాడు. ఆయన దానితో కళ్ళు విప్పాడు.

"మా ప్రాణానికి పక్కలో బల్లెంలాగ తయారయ్యావు. నిన్ను ఎలా దెబ్బతీయాలా అని చూస్తున్నాను. నీ అంతట నువ్వే అవకాశం ఇచ్చావు. ఈ జరిగే తంతు వాడు చూసితీరాలరా'' అంటూ మాధవనాయుడు పగలబడి నవ్వాడు.

రిక్షావాడు తెలివిగా టార్చిలైటు మాధవవాళ్ళవైపు వేశాడు. సారథి తల సిగ్గుతో వాలిపోయింది. నోటమాట రావడంలేదు. అప్పటికే అతడు నగ్నంగా ఆమెను కిందపడవేశాడు. తెలివి తప్పిపోయిన ఆమెవైపు చూడలేక ఆయన వద్దు వద్దంటూ చేతులు రెండూ మాధవనాయుడివైపు చూస్తూ కదపసాగాడు. అంతలోనే ఆయనకి స్పృహ తప్పిపోయింది.

సారథికి మళ్ళీ స్పృహ వచ్చేసరికి రెండురోజులు పట్టింది. కళ్ళుతెరిచిన ఆయనకి ఎక్కడ తాను ఉన్నానో తెలియలేదు. విద్య, మురళి, రాధమ్మ ఆత్రుతగా ఆయన చుట్టూ మూగారు. వాళ్ళవైపు చూస్తూ ఏదో అడగబోయిన ఆయనకి మళ్లీ స్పృహతప్పింది.

విపరీతమైన టెంపరేచర్, కొట్టుకొంటోందో లేదోనన్నట్లు ఉన్న గుండె చూసి డాక్టర్లు కూడా భయపడ్డారు. వారంరోజులుగా ఆయనను మామూలు స్థితికి తీసికొని రావడానికి వాళ్ళు ఎంతగానో పాటుపడ్డారు. రాధమ్మ మొక్కని దేవుడు లేడు. ఆయన బతుకుతాడో లేదో అన్నది అందరికీ భయమైపోయింది.

డాక్టర్లు పదిరోజులకి ఆయన స్థితిలో మార్పు కనిపించి రిలీఫ్ ఫీలయ్యారు. హార్లిక్సు తనకి పట్టిస్తున్న భార్యను చూసి ఆయన ఏదో అడగబోయారు. కానీ ఆయన గొంతుకలో నుండి మాట బయటకి రాలేదు.

ఆయన ఎంత ప్రయత్నించినా మాట్లాడలేకపోయారు. ఏవేవో ధ్వనులు, గురక తప్ప గొంతుకలోనుండి శబ్దం రాలేదు. దానితో ఆయన భయపడిపోయారు. రాధమ్మను చూస్తూ కన్నీళ్ళు కార్చసాగారు.

రాధమ్మ పరుగు పరుగున వెళ్ళి డాక్టరుగారిని పిల్చింది. ఆయన వచ్చి చూశారు. సారథి చేతులు, కాళ్ళు వణుకుతున్నాయి. ఆవేదనతో పెదవులు కంపిస్తున్నాయి. ఆయనని ఆ స్థితిలో చూసేసరికి డాక్టరుకి కూడా బాధనిపించింది.

ఆయనని ఎమర్జన్సీ రూంలోకి తీసికెళ్ళి వివిధ పరీక్షలు చేశారు. ఆయన గొంతుకలో నుండి మరి మాట రావడం కష్టం అని గ్రహించారు. విపరీతమైన టెంపరేచర్‌వలన, బిపి బాగా డౌను అవడంవలన ఆయనకి కలిగిన షాక్‌వల్ల మాట పోయిందని చెప్పారు.

రాధమ్మ ఆ మాట వింటూనే నిలువెల్లా కదిలిపోయి ఏడ్చింది. మురళి, విద్యల దుఃఖానికి అంతులేదు. మత్తుమందు ప్రభావంతో నిద్రపోతున్న ఆయనను చూసి, వాళ్ళు వెక్కి వెక్కి ఏడ్చారు.

తన జీవితంలో ఇటువంటి ఆపద ఉంటుందని ఆవిడ ఏనాడూ అనుకోలేదు. తన ప్రాణం, బతుకు ఆయనే అని ఇన్నాళ్ళూ బతికింది. ఆయనే ఇలాంటి ఆపదలో పడిపోవడంవలన ఆవిడ దిక్కుతోచనట్లు అయిపోయింది.




ఏడ్చి ఎర్రబడిన భార్య కళ్ళు, విచారంతో చిన్నబోయిన బిడ్డల మొహాలు చూస్తే ఆయన కి జరగరానిదేదో జరిగినట్లే అర్థమవసాగింది. అదేమిటో మొదట్లో బోధపడలేదు. తర్వాత డాక్టరుగారు చెప్పేటప్పటికి ఆయన నిర్విణ్ణుల య్యారు. జరిగిన దారుణ సంఘటన తనని ఇలాగ మార్చిందా?

తనకి మాట రాదా? ఇదివరకటిలాగ తను మాట్లాడలేడా? ఈ జ్వరంతో, నీరసంతో ఇలాగ జీవచ్ఛవంలాగ తను ఉండిపోవలసిన దేనా? తననే నమ్ముకున్న భార్యాబిడ్డల గతే మిటి?

తన కుటుంబం బరువు బాధ్యతలు ఎవరు మోస్తారు? ఎందుకు భగవంతుడు ఇలాగ చేశాడు? తను చీమకైనా హాని తలపెట్టి ఎరుగడే? మరి ఇటువంటి శిక్ష తనకి ఏమిటి? ఆయన ఆలోచనలతో సతమతమవసాగారు.

డాక్టరుగారు గట్టిగా చెప్పారు ఏమాత్రం మానసికమైన ఆందోళన పడినా కోలుకోవడం కష్టమని. మొదట ఆరోగ్యాన్ని సంపాదించు కొంటే తర్వాత మిగతావి చూసుకోవచ్చునని చెప్పారు.

సారథిని చూడ్డానికి అన్నలు, అక్క వచ్చా రు. వాళ్ళందరికీ ఆయన అంటే చాలా ఇష్టం. ఆఖరివాడవడంవలన చిన్నతనం అంతా గారా బంగానే గడిచింది ఆయనకి. బావగారు, అక్క, అన్నల కుటుంబాలు తనని చూసి బాధపడుతోంటే ఆయనకి మరీ కష్టంగా ఉంది.

రాధమ్మ డాక్టరుగారిని అడగలేక అడగలేక అడిగింది ఆయనకి ఎప్పటికైనా మాట వస్తుందా అని. ఆయన ఆవిడ ఆవేదనను బాగానే అర్థంచేసుకొన్నారు. ఆయనకి మాట ఎలా సడన్‌గా పోయిందో అలాగే సడెన్‌గా రావచ్చునన్నారు. అయితే అలాగని గ్యారంటీ ఏమీలేదన్నారు.

మొదట ఆయన శారీరకంగా, మాన సికంగా కోలుకోవాలని చెప్పారు. దానికి ఆవిడ సహకారం చాలా అవసరమని చెప్పారు. సారథిగారితోమాత్రం కొంతకాలం గడిచాక మాట రావచ్చునని, మొదట ఆరోగ్యం చక్కది ద్దుకోమని మందులు మానకుండా వాడమని చెప్పారు.

సారథిని ఇంటికి తీసికొని వచ్చేశారు. ఆయనకి ధైర్యంచెప్పి, తమకు తోచిన డబ్బు ఇచ్చి అన్నలు వాళ్ళు వెళ్ళిపోయారు. ఆరో జంతా ఆయన డల్‌గానే ఉన్నారు. ఆయనకి తన చిన్నప్పుడు తన ఇంట్లో పనిచేసిన మూగ వాడు గుర్తుకువచ్చాడు.

తన తల్లి వాడు ఏదైనా వెధవపని చేసిన ప్పుడు "మూగవెధవా! మా ప్రాణానికి బాగా దాపురించావు. పొమ్మంటే పోవుకదా!" అని తిట్టేది. తండ్రిమాత్రం అతడిని ఎంతో ప్రేమగా చూసేవాడు.

అయ్యో! తన కొడుకు ఇలాగ అవుతాడని తెలిస్తే అమ్మ వాడిని అలాగ తిట్టిఉండేది కాదేమో అని ఆయనకి అన్పించసాగింది. రాధమ్మ ఆయనని చంటిపిల్లాడిని సాకినట్లు సాకసాగింది.

ఆయన కాస్త తేరుకున్నాక విద్యను పిలిచి ఆరోజు రాత్రి తను ఎలా వచ్చానని అడిగారు. విద్య జవాబు ఇచ్చేలోపే రాధమ్మ వచ్చి, తోవలో స్పృహకోల్పోయి పడివున్న ఆయన ను రిక్షావాడు తీసికొని వచ్చాడని, తామంతా ఆయన స్థితి చూసి భయపడి, హాస్పిటల్‌కి తీసుకొని వెళ్ళామని చెప్పింది.

ఆయనకి ఆమె ఏమైందో తెలుసుకోవాలని ఉంది. కానీ ఎవరిని అడగాలో అర్థమవలేదు. ఆయన ఒక బౌండుపుస్తకం, పెన్ను తనతో ఉంచుకోసాగారు. దానిమీద తనకి కావాల్సి నది రాయడం మొదలుపెట్టారు. పిల్లలు, రాధ మ్మ అది చదువుకొని జవాబులు చెప్పేవారు.

ఆయన సందేహం పాత పేపర్లు తీసి చూడగానే అర్థమైంది. తను అనారోగ్య పడ్డ మర్నాడు వచ్చిన పేపరు తీసి చూశారు. ఎక్కడా ఏ విషయం లేదు. ఓపికగా వరుసగా పేపర్లు తిరగేయడం మొదలుపెట్టారు.



మూడవరోజు పేపర్లో కనబడింది ఆయన వెతుకుతున్న వార్త బాగా అర్థంచేసుకొని చదివాక ఆయనకి చెరువులో బయటపడ్డ శవం వార్తకి సంబంధించిన విషయాలు తెలిశాయి.

ఆయన ఊహ మాధవనాయుడు రేప్ చేసినది ఆమెనేనని. ఎలిమెంటరీ స్కూలు టీచరు రమణి శవం చెరువులో దొరికినదని రాశారు. ఆయన కళ్ళు కోపంతో ఎరుపెక్కాయి. పేపరు తీసికొని పోలీసు స్టేషనుకి వెళ్ళారు.

ఆయన హడావుడిగా బొండుపుస్తకం తీసికొని బయలుదేరడం చూసి మురళి వెనకే వెళ్ళాడు. ఆయన పోలీసు ఇనస్పెక్టర్‌కి ఆ పేపరు చూపించి, చదవమన్నారు. ఇరవైరోజుల క్రితం జరిగిన విషయాన్ని ఆయన కొత్తగా చదవమంటూంటే అతడు ఆశ్చర్యపోయాడు.

సారధి అంటే ఆ ఇనస్పెక్టరుకి చాలా గౌరవం. ఎంతో అవసరం అనుకొంటే కానీ ఆయన తమ సహాయాన్ని అర్థించరని అతడికి బాగా తెలుసు. అందుకే ఆయనను సాదరంగా చూస్తూ ఆ కేసు విషయం వివరంగా చెప్పారు.

సారధి ఇన్‌స్పెక్టర్ చెప్పింది విని తల అడ్డంగా ఊపాడు. రమణి అనే ఎలిమెంటరీ స్కూలు టీచరుకి అన్నయ్య, వదినలు తప్ప ఎవరూ లేరని, ఆమెకి ఇక్కడ ఉద్యోగం వచ్చి ఆరునెలలు అయిందని, చాలా మంచి టీచరని, యం.ఎల్.ఏ.గారి పుణ్యమా అంటూ ఈ మండలంలో వచ్చిందని ఇనస్పెక్టరు చెప్పాడు.

ఎవరో రాసిన ఉత్తరం ఇంటివారికి గదిలో దొరికిందని, తన ఆత్మహత్యకి ఎవరూ కారణం కాదని, జీవితంలో ఎదురైన నిరాశా పరిస్థితులు భరించలేక ఇలాగ చేస్తున్నానని, ఒంటరితనం భరించడం చాలా కష్టంగా ఉందని, అందుకే ఈ జీవితాన్ని ముగించదలచుకున్నానని రాసిందని చెప్పారు.





సారధికి కళ్లనీళ్ళు తిరిగాయి. తను అశక్తుడై ఆరోజు ఆమెను కాపాడలేకపోయాడు. ఆయన ఇనస్పెక్టర్‌కి ఆ రాత్రి జరిగిన విషయం వెంటనే పుస్తకంలో రాసి చూపించాడు. అది చదివి అతడు స్థాణువయ్యాడు.

సారధి అవసరమైతే తాను రిపోర్టు రాసి ఇస్తానని, దయచేసి ఈ విషయంలో నేరస్తులను పట్టుకోమని అర్థించాడు. ఇనస్పెక్టర్ కూడా యువకుడూ, నిజాయితీపరుడవడంతో తాను ఆ విషయం చూస్తానని హామీ ఇచ్చాడు. సారధిని తొందరపడి ఏమీ చేయవద్దని అతడు హెచ్చరించాడు.

సారధి ఇంటికి వచ్చాక మురళివలన విషయం తెలుసుకొని రాధమ్మ భయపడిపోయింది. అవతలివాళ్ళు అసలే దుర్మార్గులు. తమను ఏం చేస్తారో అన్న భయం ఆవిడకి పట్టుకుంది. ఆ విషయంలో ఏమీ కల్పించుకోవద్దని ఆయనని బతిమాలింది. "ఇదే నీ బిడ్డకు జరిగితే ఊరుకోగలవా?" అని ఆయన రాశారు.

ఆవిడ నిర్విణ్ణురాలై మాట్లాడలేకపోయింది. అయితే మరొకవిధంగా ఆ సమస్య అక్కడితో ఆగిపోయింది. ఇనస్పెక్టర్ మాధవనాయుడిని ఎంక్వయిరీ చేయబోతే ఆరోజు తాను యం.పి.గారబ్బాయి వాళ్ళింట్లో టి.వి.లో ఇంగ్లీషు సినిమా చూశానని, యం.పి.గారు కూడా రెండుగంటలు దాటినా పడుకోనందుకు తమని మందలించారని చెప్పాడు.

యం.పి.గారు, ఆయన చిన్నకొడుకు చెప్పిన విషయాలు కూడా అవే. ఇంక ఇనస్పెక్టర్ ఏం చేయగలడు? అంతగా ఎలిబీ సృష్టించుకొన్నవాళ్ళని ఎలా అరెస్టు చేయగలడు?

రమణికి తన తండ్రి ఉద్యోగం వేయించి ఉండవచ్చునేమోకానీ ఆ అమ్మాయి ఎవరో తనకి పరిచయమే లేదని మాధవనాయుడు చెప్పాడు. ఇనస్పెక్టర్ సారధి పేరెక్కడా ఎత్తలేదు. అలాగైతే ఆయనమీద వాళ్ళు వ్యక్తిగత కక్ష పెంచుకోవచ్చు. పోయిన అమ్మాయి ఎలాగూ పోయింది. ఆమె అన్నదమ్ములే విషయం

వదులుకొని వెళ్ళిపోయారు. ఇనస్పెక్టర్ ఎందుకు ఈ కేసు విషయం ఇన్నాళ్ళకి మళ్ళీ విచారిస్తున్నాడో తెలుసుకోవాలని మాధవనాయుడు ప్రయత్నించాడు.

రమణి అన్న తనను చెల్లెలి విషయం విచారించమని కోరాడని, మాధవనాయుడి మీద అతనికి ఎవరో చెప్పారని ఇనస్పెక్టర్ చెప్పాడు. అయినా తనకి దొరికిన విషయాన్ని బట్టి ఎంఎల్యేగారబ్బాయికి, ఈ ఆత్మహత్యకి సంబంధంలేదని తెలుసుకొన్నాడని చెప్పాడు.

మాధవనాయుడి ప్రాణం కుదుటపడింది. ఇంకా సారధి రిపోర్టు ఇచ్చాడేమోననుకొన్నాడు. సారధి అనారోగ్యం గురించి విని, అతడు దానిలోనుండి తెమిలినప్పుడుకదా అని అనుకొన్నాడు.

సారధికి తన చేతకానితనంమీద విసుగు వస్తోంది. కనీసం ఆరోజు తను అతడి స్నేహితుడినికానీ, రిక్షావాడినికానీ చూసిఉంటే బాగుండేది. మాధవనాయుడు తప్పుచేసి, తప్పించుకోవడం ఆయనని చాలా బాధిస్తోంది.

మనం ఏం చేయగలం మేస్టారూ! అతడు తన ఇంట్లోనే కొడుకుతో ఉన్నాడని యం.పి.గారు ఎలిబీ ఇచ్చారు. మరెవ్వరూ అతడిని చూసినవాళ్ళు లేరు. ఈ విషయం ఇంతటితో వదిలేయండి. నేను కూడా ఒక కన్ను అతడిపై వేసి ఉంచుతాను. ఏ విషయంలో అయినా దొరికాడా హరిహర బ్రహ్మాదులు కూడా వాడిని రక్షించలేరు అని మాట ఇచ్చాడు. సారధి ఇంకేం చేయలేక తిరిగి వచ్చాడు. మనసుమాత్రం వ్యధపడుతూనే ఉంది ఈ విషయంలో.

ఆయనకి కుటుంబం గురించి, విద్య గురించి బెంగ ఎక్కువగా బాధిస్తోంది. ఏం చేయడమా అన్న ఆలోచనలో పడ్డారు. ఆయన బాగా కోలుకొనేవరకూ ఏ విషయం ఆలోచించవద్దని రాధమ్మ గొడవచేస్తోంది. వద్దన్నా ఈ ఆలోచనలు ఆయనకి తప్పడంలేదు.

విద్యకు ఆయనని చూస్తే బాధ ఆగడంలేదు. తండ్రిమాటలు ఒక వేదమంత్రాలుగా ఆ ఇంట్లో మారుమోగేవి. ఈనాడు ఇల్లంతా నిశ్శబ్దం. ఆయనకాదు మాటలు వచ్చి తాము కూడా మూగవాళ్ళయ్యామన్న భ్రాంతి ఆ పిల్లకి కలుగుతోంది. ఎవరూ ఎవరితో మాట్లాడలేకపోతున్నారు.

మేకపోతు గాంభీర్యంతో ఇంట్లో ఎవరిమటుకు వారు తిరగసాగారు. ఈ పరిస్థితుల్లో నుండి మొదట బయటపడింది రాధమ్మే. ఆవిడకి ఆయన మాటలు అనేకం గుర్తుకి వచ్చేవి. ఆయన ఒక చైతన్యస్రవంతి.

ఇన్నాళ్ళూ తను, తన పిల్లలు ఆయన అనురాగ స్రవంతిలో హాయిగా జీవించారు. ఇప్పుడు ఆయనకి ధైర్యం ఇచ్చి, మళ్ళీ మునుపటి మనిషిని చేసుకోవాలన్న పట్టుదల ఆమెలో పెరిగింది.

ఒకరి మనసు ఒకరు తెలుసుకోవడానికి మాటలు అవసరం. కానీ ఆయన మనసు తమ కుటుంబంలో అందరికీ తెలుసును. భావాలని పంచుకోవడానికి భాష ఒకటే మార్గమా? భాష ప్రకటించలేనంత మాత్రాన జీవితాలు నిరర్ధకమా? ఆవిడ పడుతున్న క్షోభలో నుండి చెలరేగిన ఆలోచనాతరంగాలు అవి. అవే ఆవిడని కర్తవ్యంవైపు నడిపించాయి.

"రాధా! నువ్వు చూస్తే ఒక మౌనిలాగా ఉంటావు. ఏవీ పట్టించుకోవు. మన కుటుంబానికి నీ అవసరం ఏర్పడిందనుకో ఏం చేస్తావు? ఒకవేళ నేను ఏదన్నా అయితే..." ఆయన పూర్వం తనని ఏడిపిస్తూ అడిగిన మాటలు ఆవిడకి గుర్తుకి వచ్చాయి. ఆరోజు తను ఆయనని మరి మాట్లాడనీయకుండా పెదవులు మూసేసింది. ఏ తథాస్తు దేవతలు ఆ సమయంలో తథాస్తు అన్నారో అని అనుకొంది.

ఆవిడ పిల్లలిద్దరినీ దగ్గర కూర్చోపెట్టుకుని తండ్రితో సాధ్యమైనంత ఎక్కువగా గడపమని కోరింది. ఆయనని ఉత్సాహపరిచే కబుర్లు చెప్పమంది. విద్యకి తల్లి మనసు బాగానే అర్ధమైంది.

# * ఏరిన ముత్యాలు *

☆ "ఉత్తముడు ఎల్లప్పుడూ సంతోషంగానే వుంటాడు. వివేకవంతుడు ఎన్నడూ చిక్కుల్లో పడడు. సాహసవంతుడు ఎన్నడూ భయపడడు''

-కన్ఫ్యూషియన్

☆ "విపత్తులు ఎంతో గొప్పవి. ఆ విపత్తులవల్లే కొత్తవారిలో సైతం సోదరభావం పెంపొందుతుంది''

-విక్టర్ హ్యూగో

☆ "ఎంత గొప్పవాడైనా నేరం చేస్తే ఎప్పుడో ఒకప్పుడు చట్టానికి దొరక్కుండా పోడు. ఆలస్యం జరిగినా శిక్ష తప్పదు''

-వి.ఆర్.కృష్ణయ్యర్

☆ "నీవు చేసే పనులను మానవుడు చూస్తుంటాడు. కాని భగవంతుడు నీ ఉద్దేశాలను కని పెడుతుంటాడు''

-థామస్ ఎ.కృక్స్

☆ "మట్టిలో మాణిక్యంలాగా, మానవునిలో జ్ఞానం, విజ్ఞానం, విషయపరిజ్ఞానం నిలిచి వున్నాయి''

-స్వామి వివేకానంద

☆ "సందర్భశుద్ధి లోపిస్తే ఎంత మంచిపని అయినా చెడు ఫలితాలను ఇస్తుంది''

-సిడ్నీ

☆ "హితవచనాలను పాటించడమంటే మన శక్తి సామర్థ్యాలను పెంచుకోవడమే''

-గేథే

☆ "కష్టాల సముద్రంలో తేలియాడే దీవులు సుఖాలు''

-యంగ్

☆ "వ్యక్తులను కాదు, వారి దుర్గుణాలను ద్వేషించు''

-బ్రైనార్డ్

☆ "ఆకాశంలోనుంచి వస్తున్న వెలుగు ఏ నక్షత్రానిదని చెప్పగలం. అదృష్టాలవల్ల లభించే సుఖం కూడా అంతే''

-బేకన్

☆ "మతం మూఢాచారాలకు విశ్వాసాలకు దగ్గర సంబంధం కలది. శాస్త్రసమ్మతం కాని జీవనదృష్టి మతం వెనుక వుంది. గుడ్డి నమ్మకం, అతీతశక్తిపై ఆధారపడటం మాయావాదం, ఇవన్నీ మత సారాంశాలు''

-జవహర్‌లాల్‌నెహ్రూ

☆ "న్యాయం చెయ్యడంలో ఆలస్యం జరిగితే అది అన్యాయం చేయడంతో సమానమే''

-వాల్టర్‌లాండర్

సేకరణ: కె.వెంకట రామఅక్కయ్య

మురళి ఉత్తప్పుడే ముభావంగా ఉండేవాడు. ఆయనతో ఎక్కువ మాట్లాడటం వాడికి అలవాటులేదు. ఆయన అడిగినవాటికి జవాబులు ఇవ్వడం తప్ప మరొకటి తెలియదు. ఇప్పటి పరిస్థితులు అతడికి మరీ చిరాకుగా ఉన్నాయి. తండ్రిని అలాగ మౌనవీణలాగ చూడటం అతడివల్ల కావడంలేదు.

ఆరోజు ఉదయం తల్లి, చెల్లి ఇంట్లో ఏవో మాట్లాడుకుంటూంటే చూశాడు. ఇంట్లోని డబ్బు అయిపోయింది ఏం చేయడమా అని రాధమ్మ బెంగ. మురళి తనకి తండ్రి ఇచ్చిన డబ్బున్న పెట్టె తీసి చూశాడు. మూడు వందలుంటుంది. బయట తిరుగుతాడు కాని మురళి ఖర్చు ఎక్కువగా పెట్టడు. ఆ డబ్బు తీసుకెళ్ళి తల్లిచేతికి ఇచ్చాడు. రాధమ్మ మురళిని కౌగలించుకొని ఏడ్చింది.

సారధికి ఖరీదైన మందులే వ్రాశారు. చాలా డబ్బు వాటికే ఖర్చయిపోతోంది. ఆయన ఇంకా మామూలు మనిషి కాలేకపోతున్నాడు. రాధమ్మ బాధ అదే. ఏదో ఒకమార్పు ఇంట్లో రావాలి. కానీ అదేమిటో ఆవిడకి అర్ధమవడంలేదు.

నాలుగురోజులు గడిచాక ఆవిడ ఒక నిర్ణయానికి వచ్చింది. తెల్లవారుఝామున లేచి, కొడుకుని లేపింది. విద్య అప్పటికే లేచి చదువుకుంటోంది. కొడుకుని లేపి చదువుకోమని హెచ్చరించింది. అతడు తెల్లబోయాడు.

"ఇంటర్ పరీక్షలు ఇంక నెలరోజులే ఉన్నాయి. అది పాసయితే కానీ నువ్వు ఒక ఒడ్డుకి రావు'' అంటూ ఖచ్చితంగా చెప్పింది. మురళి బద్ధకమంతా వదిలిపోయింది. తల్లి తనని చదువు విషయంలో హెచ్చరించడం కొత్తగా ఉంది.

అసలు ఆరోజునుండి ఆవిడ ప్రవర్తనే మారిపోయింది. ఇల్లంతా నిర్వహించుకోవడం, పిల్లలను చూసుకోవడం, భర్తతో కబుర్లు చెప్పడం. సారధికి ఇదంతా ఏమిటోగా అన్పించింది.

రాధమ్మ పిల్లలు బయటకి వెళ్ళిపోగానే భర్తను తన వంటింట్లోకి పిలిచింది. ఆవిడకి ఇంకా కొంచెం వంటింటి పని మిగిలిపోయింది. మళ్ళీ పిలిచింది భర్త వస్తున్న జాడ కన్పించకపోవడంతో.

కుర్చీలో పడుకొని ఎటో చూస్తున్న ఆయనకి లేవక తప్పిందికాదు. వంటింటి గుమ్మం పట్టుకొని ఏమిటన్నట్లు భార్యవైపు చూశారు. ఆవిడ లేతగోధుమరంగు నేతచీర కట్టుకొంది. అదేరంగు జాకట్టులో ఎంతో అందంగా ఉంది.

"ఏం ఫర్వాలేదు. నా సామ్రాజ్యంలోకి మీరు రావచ్చును రండి'' అంటూ పీటవాల్చింది. ఆయన ఆవిడవైపు కొత్తగా చూశారు. "ఏమిటలా చూస్తారు? ఇది నా సామ్రాజ్యం అయినప్పుడు మీకు కూడా చెందుతుంది. నావన్నీ మీవేకదా! అందుకని హాయిగా వచ్చి కూర్చోండి'' అంటూ చేయిపట్టుకొని తీసికొని వచ్చి కూర్చోపెట్టింది.

ఆరోజు ఆవిడ దేవుని విగ్రహాలు, లక్ష్మీదేవి సింహాసనం తోముకోవాలనుకొని సిద్ధపడింది. ఆయనతో ఆ కబురూ, ఈ కబురూ చెప్తూ ఆ పని పూర్తిచేసింది. తర్వాత భోజనాలు పూర్తిచేసి ఇవతలకి వచ్చారు.

ఆవిడ ఏపని చేస్తున్నా ఆయనకి సన్నిహితంగా ఉండిచేస్తోంది. ఆయనని ఒంటరిగా ఉంచడంలేదు.

ఏవో కబుర్లు చెపుతూనే ఉన్న భార్యను చూస్తే ఆయనకి వింతగా ఉంది. ఆ రాత్రి ఆయన ఆవిడను అడిగారు. "నువ్వు చాలా మారిపోయావు సుమా అని. ఆయన సౌంజ్ఞలు, చూపులు ఇప్పుడు ఆవిడకి బాగానే అర్ధమవుతున్నాయి. భార్యలోని ఉత్సాహం సహజసిద్ధమైనదిగా ఆయనకి తోచడంలేదు.

ఏనాడూ ఆవిడ అంత కలివిడిగా కబుర్లు చెప్పి ఎరుగదు. ఆవిడ ప్రవర్తన, ఇంటి బాధ్యతలు పైనవేసుకోవడం ఆయనకి ఆశ్చర్యంగానే ఉంది. "నాలో మార్పు వచ్చిందంటున్నారా? అవును. వచ్చింది. ఇది ఆరోగ్యకరమైన మార్పేకదా'' ఆవిడ సమా



ధానం చెప్పి, ఆయనవైపు చూసింది.

ఆయన ఇదివరకు ఆమె ఇలావుంటే సంతోషంచేవారేమో? ఇప్పుడు ఆయన మనసు స్తబ్దంగా ఉంది. ఏదో తెలియని నిర్లిప్తత. ఆయన అంతలోనే ఆలోచనలోకి వెళ్లిపోవడం గమనించింది.

"చూడండీ! ఈ ఇల్లు, నా మనసు వేరుగా ఏనాడూ నాకు అన్పించలేదు. ఇవి శూన్యంగా ఉంటే నేను భరించలేనండీ... భరించలేను. మాట్లాడలేకపోయినంత మాత్రంచేత మన జీవితంలో మధురిమని ఏందుకు నేను దూరం చేసుకోవాలి? మీరంటే ఏమిటో నాకు తెలుసు గనుక నాకు ఇది దాటలేని అగాధం కాదన్పించింది.

ఈనాటినుండి మీరు, నేను ఒకటే. నేను మీకు ఇష్టమైనవిధంగా జీవిస్తాను. కాదు నా ద్వారా మీరు మాట్లాడుతున్నారనుకోండి. భగవాన్ నన్ను అదృష్టవంతురాలిని చేశాడు. మీరు దూరమైతే నేను బ్రతకలేనండీ! ఆ దేవుడు మిమ్మల్ని నాకు మిగిల్చాడు. ఈ జన్మకి ఈ అదృష్టం చాలు'' అవిడ ఆయన గుండెలమీద వాలిపోయింది.

ఆయనకి కూడా ఏదో గొంతుకకి అడ్డుపడ్డట్లే అన్పించింది. ఆవిడ వీపు నిమురుతూ చాలాసేపు ఆయన అలాగే ఉండిపోయారు. తను నిరుత్సాహంగా ఉంటే వీళ్లు ఏమాత్రం భరించలేరు.

తను మొదట ఈ పరిస్థితినుండి మనసుని మరల్చుకోవాలి. తనమీద ఉన్న బాధ్యతల గురించి ఆలోచించాలి. ఆవిడ పూర్తిగా స్వాంతన పొందేవరకూ ఆయన అలాగే నిరీక్షించారు.

కొంతసేపు గడిచేటప్పటికి వరద తీసేసిన విధంగా ఆవిడ దుఃఖం తగ్గిపోయింది. ఆవిడకి ఆయన చేతులలో ఎంతో నిశ్చింతగా అన్పించింది.

మర్నాడు ఆయన భార్యను దగ్గర కూర్చోబెట్టుకొని తాను ఇంక ఉద్యోగంలో కొనసాగే అవకాశం లేదని, తన ఉద్యోగం మురళీకి ఇప్పించవలసినదిగా కాగితం పెట్టుకొంటానని వ్రాశారు.

ఆవిడ ఏమీ మాట్లాడలేదు. ఆయన స్కూలు హెడ్‌మాస్టర్, స్టాఫ్ వచ్చి కొన్నాళ్లు ఆయనను ఇంటిదగ్గర రెస్టు తీసుకోమని, విషయం పై అధికారులకి తెలియకుండా చూసుకుందామని చెప్పి వెళ్లారు. ఆయన దానికి ఒప్పుకోలేదు.

ఆయనకి తన వృత్తిని విడిచిపెట్టాలంటే బాధగానే ఉంది. కానీ ఏకాలో, చెయ్యో పోతే ఎలాగో ఒకలాగ వెళ్లి ఉద్యోగం చేసేవారు. గొంతుకే మూగపోతే ఇంక మేష్టరుగా ఎలా కొనసాగగలరు?

విద్యార్థులంటే ఆయనకి ఎంత ఇష్టమో, వృత్తి అంటే ఆయనకి ఎంత ప్రాణమో స్కూల్లో అందరికీ తెలుసును. మొదట ఆయన కొన్ని రోజులు ఉన్న సెలవంతా పెట్టేసుకొన్నారు. తర్వాత ఈ నిర్ణయాన్ని పాటిద్దామనుకొన్నారు.

విద్యకి బయట ప్రైవేట్లు పెట్టారు. విద్య వద్దని వారించినా ఆయన ఒప్పుకోలేదు. అయినా సరే విద్య ఇంట్లోకి ఒక బ్లాక్‌బోర్డు చేయించింది. దానిపై ఆయనను వ్రాయమనేది. తండ్రి చెప్పే చదువుని వదులుకోవడం ఇష్టంలేదు.

ఆమె అడిగినవాటికి ఆయన బోర్డుపై వ్రాసేవారు. విద్య ఆయన చేతిదగ్గర చిన్న నోటు బుక్ ఉంచేది. దానిపై ఆయన ఎవరు ఇంటికి వచ్చి ఏం మాట్లాడినా వ్రాసి జవాబు చెప్పేవారు.

ఒకరోజు ఆయన విద్యను కరాటే నేర్చుకోమన్నారు. ఆడపిల్ల తనని తాను ఎప్పుడూ రక్షించుకోవాలని వ్రాశారు. తండ్రి ఆ రాత్రి జరిగిన సంఘటనను మరిచిపోలేకపోతున్నారని విద్య గ్రహించింది.

ప్రజలు, పోలీసులు రక్షిస్తారని ఎప్పుడూ అనుకోకూడదు. ఏ సమయంలో ఎలాంటి పరిస్థితులు వస్తాయో, కనుక ఆడిపిల్ల తననితా




ను విపత్కర పరిస్థితులనుండి రక్షించుకొనేవిధంగా ఎదగాలి. ఎలా రక్షించుకోవాలో సూచనలు వ్రాసేవారు.

ఒకసారి కాలేజీనుండి వస్తోంటే మాధవనాయుడు ఫ్రెండ్స్‌తో కన్పించాడు. "పాపం గాలి తీసిన బెలూన్‌లాగ అయిపోయావేమిటి?" అంటూ ఎగతాళి చేశాడు. విద్య తనని కాదన్నట్లే ఊరుకొంది.

గ్రూపులోని మరొకడు "పాపం నాన్న ఇంటి కూచి అయిపోయాడు కదగురూ! ఇంక ఏం చేస్తుంది పొగరంతా అణిగిపోయి వుంటుంది'' అని అన్నాడు. జ్యోతి ఏదో అనబోతోంటే విద్య వారించింది.

"ఎంత కష్టపడి చదివితే ఏం లాభం? నాలాంటి వాడిని పెళ్లాడవచ్చునుకదా!" అని మాధవనాయుడు నవ్వుతూ విద్య దారిలో నిలబడి అన్నాడు. విద్యకి చాలా కోపం వచ్చింది. "పెళ్ళాడటానికి కానీ, ప్రేమించడానికి కానీ అర్హతలుండాలి. నీలో ఉన్న అర్హతలేమిటో నీకు బాగా తెలుసనుకొంటాను'' అంటూ చెప్పు పుచ్చుకొని కొట్టినట్లు చెప్పి వెళ్ళిపోయింది.

మాధవనాయుడుకి మతిపోయినట్లు అన్పించింది. నెమ్మదిగా ఉండే విద్య అంత గట్టిగా జవాబు చెప్పటమా? వెనకనుండి చెల్లెలి ఫ్రెండ్స్ వస్తూ కన్పించడంతో అక్కడ నుండి వెళ్ళిపోయారు.

వామనమూర్తి సారథిని కలవడానికి ఇంటికి వచ్చాడు. అతడికి సారథిని అలా చూడటం కష్టంగా ఉంది. సారథి వంటి వక్తకి, పండితుడికి రావలసిన కష్టం కాదన్పించింది. ఆయన వచ్చేసరికి సారథి తోటలోని మొక్కల పని చూస్తున్నాడు.

కాస్సేపు వామనమూర్తి ఏవో కబుర్లు చెప్పాడు. ఆయన బయలుదేరబోతూంటే విద్య వచ్చింది. విద్యను చూడగానే ఆయన మెదడులో ఒక ఆలోచన మెరిసింది. విద్యను మొహం, కాళ్లూ చేతులూ కడుక్కొని రమ్మని పిలిచారు.

విద్య వచ్చాక ఉగాదినాడు తమ సంస్థ కవిసమ్మేళనం జరపబోతోందని, విద్యను ఏదైనా స్వీయకవిత వ్రాసి, తీసుకొని రమ్మన్నారు. యువత తరపున విద్యను పాల్గొనమన్నాడు.

విద్య ఆయనవైపు అయోమయంగా చూసింది. తాను స్వీయకవితతో కవి సమ్మేళనంలో పాల్గొనడమా? అమ్మో... తను ఇప్పటివరకూ ఏ పద్యంగానీ, గేయంగానీ వ్రాయలేదని, తనకి రాదని విద్య నిర్మొహమాటంగా చెప్పేసింది.

వామనమూర్తి మెదడులో ఏ పురుగైనా ప్రవేశించిందా మరి దానిని వదలడు. పని సాధించేవరకూ ఓపిక పడతాడు. అతడికి తన సంస్థ అంటే ప్రాణం. ఎప్పుడూ కొత్తవారికి అవకాశాలు ఇవ్వాలని చూస్తాడు.

విద్య మాటలను ఆయన అంగీకరించలేదు. విద్య ఎన్నో వ్యాసరచన పోటీలలో పాల్గొనడం తనకి తెలుసునని, పద్యమో, గేయమో ప్రయత్నిస్తే ఆమె తప్పక వ్రాయగలదన్న నమ్మకం తనకి ఉన్నదని, తండ్రి సహకారం కూడా ఆమెకి ఉందని గట్టిగా చెప్పేశాడు. విద్య పేరు కవుల జాబితాలో వ్రాసుకొన్నాడు.

విద్య ఎంత వారించినా ప్రయోజనం లేకపోయింది. ఒక వ్యక్తికి అన్ని కళలూ ఎలా వస్తాయని వాదించింది. ఆమె కళ్ళకి వామనమూర్తి నక్షత్రకుడిలాగా కన్పించాడు. ఏ ప్రార్థనాగీతమో కావాలంటే పాడతానంది.

ఆయన ససేమిరా వీల్లేదన్నాడు. స్త్రీలకు ప్రాధాన్యతనీయడం తన ఉద్దేశమని విద్యను తాను ఆనాడు పరిచయం చేయదలచుకొన్నానని విద్యలో ఆశక్తి ఉందని వాదించాడు. మనిషికి ఆసక్తి ఉండాలేగానీ ఎన్ని కళలలోనైనా ప్రావీణ్యతను పొందవచ్చునని చెప్పాడు.

విద్య నిస్సహాయంగా తండ్రివైపు చూసింది. ఆయన నిర్ణయం ఆమెపై వదిలాడు. తనను నిరుత్సాహపరచవద్దని హెచ్చరించి వామనమూర్తి వెళ్లిపోయాడు. విద్య ఆ గొడవ

ను అక్కడితో వదిలి, తండ్రికి కాలేజీ కబుర్లు చెప్పడం మొదలెట్టింది.



ఉగాదినాడు తను చేయవలసిన పని కూడా ఒకటుందని సారథి అనుకొన్నాడు. ఆయన మేస్త్రీని పిలిపించి, వీధిలోకి వచ్చేలాగా ఖాళీ జాగాలో ఒక షెడ్డు కట్టించుకున్నారు. రాధమ్మకి ఇప్పుడు షెడ్డు ఎందుకో అర్థమవలేదు అని అడిగితే ఆయన వేచి చూడమని వ్రాశారు.

ఉగాదినాడు ఆయన షెడ్‌లో ఒకషాపు ప్రారంభించారు. అన్నిరకాల ఫ్యాన్సీ సామానులు ఒకపక్క, మరొక పక్క బిస్కట్లు, చాక్‌లైట్లు షాపులో పెట్టారు. రకరకాల వస్తువులతో షాపు నిండుగా ఉంది.

తనకి ఖాళీగా ఉండటం చిరాకుగా ఉందని, అందుకే ఈ పని ఎన్నుకొన్నానని ఆయన వాళ్ళతో చెప్పారు. వాళ్ళు ఏమనగలరు?

ఆయన తను ఇంక ఉద్యోగంలో కొనసాగలేనని, తన అశక్తత తను తెలియచేస్తూ పైవాళ్ళకి వ్రాశారు. తన ఉద్యోగం కుటుంబంలోని వారికి ఇప్పించవలసినదిగా అభ్యర్థించారు.

ఆయన మురళిని పిలిచి తన ఉద్యోగం ఇంక ఉండదని, అతడు ఇంటర్ పూర్తిచేసికొని అప్లికేషన్ పెడితే ఏదో ఒక ఉద్యోగం వస్తుందని చెప్పారు.

మురళి ఇప్పట్లో ఉద్యోగం చేయడం ఇష్టంలేదు. తను కాలేజీ చదువు చదవకుండా బాధ్యతల రొంపిలో దిగిపోగూడదు. అందుకే అయిష్టంగా మొహం పెట్టి అక్కడనుండి వెళ్ళిపోయాడు.

కొడుకు అభిప్రాయం ఆయనకి బాగానే అర్థమైంది. కానీ ఆయన మాత్రం ఏం చేయగలరు? అక్కడికే కుటుంబ పోషణకోసం షాపు పెట్టారు. మాట్లాడలేనివారు కొట్టు ఎలా నడిపించగలరని రాధమ్మ భయం.

ఏ దుడుకువాళ్ళైనా ఏమాటయినా విసిరితే ఆయన ఏమైపోతారో అని ఆవిడ భయం. ఆయన అట్టలమీద అన్ని వస్తువుల ధరలూ వ్రాయించి పెట్టారు. పలక ఒకటి దగ్గరపెట్టుకొన్నారు.

కొట్టు ప్రారంభించేముందే ఆయన పాంఫ్లెటులు పంచారు. వాటిలో స్పష్టంగా తన బలహీనత గురించి, తను బ్రతుకుతెరువు కోసం ఈ మార్గాన్ని ఎన్నుకోవడం గురించి వ్రాశారు. ఆ వీధిలో సహకారాన్ని తను అర్థిస్తున్నానని చెప్పారు.

వారందరికీ ఆ కుటుంబం అంటే గౌరవం. ఆయన షాపు దగ్గరకే వారందరూ వచ్చేవారు. ఆయన, వారు సదవగాహనతో మెలగసాగారు. సాయంత్రం వేళలో విద్య తండ్రికి సాయంగా వచ్చేది. అక్కడే కూర్చుని వర్క్ చేసుకొనేది.

క్రమంగా ఆయనకి వ్యాపారంలోని మెలకువలు తెలిశాయి. మంచి వస్తువులు ఇచ్చినప్పుడు పావలా ఎక్కువైనా ఎవరూ పట్టించుకోరు. ఆయన ప్రజల నమ్మకాన్ని నిలుపుకోవడానికే ప్రయత్నించసాగారు.

విద్య ఉగాది కవిసమ్మేళనం కోసం పద్యాలు వ్రాసింది. అక్కడక్కడా తప్పులుంటే ఆయన దిద్దారు. ఓ గడ్డిపూవు, పార్కులోనున్న మల్లె, కనకాంబరం, గులాబీ, మందారపూలను చూసి బాధపడుతుంది.

వాటికి ఉన్న రంగుగాని, వాటిలో ఉన్న కొన్నింటి సువాసనగానీ తనకి లేనందుకు చిన్నబుచ్చుకొంటుంది. ప్రతీ పువ్వు ఏదోవిధంగా దేవుడి పాదాల దగ్గరకి చేరుతోంటే తాను మాత్రం నిరుపయోగంగా ఉన్నానని




క్రుంగిపోతుంది.

మరొక పక్కనున్న నాగమల్లిపూలను చూసి మరీ బాధపడుతుంది. శివుడి పాదాల దగ్గర చోటుచేసుకొన్నవాటి అదృష్టానికి వగస్తుంది. ఈ సృష్టిలో అన్నింటికీ ఒక పరమార్థం ఉంది. తన జీవితమే నిరుపయోగమనుకొంటుంది.

ఇంతలో సాయంత్రమవడంతో పిల్లలు ఆటలాడుకోవడానికి పార్కుకి వస్తారు. వారు ఇసుకతో ఇండ్లను, కోవెలలను కట్టి పొంగిపోతారు. వాటిని అలంకరించడానికి గడ్డిపూలను ఆప్యాయంగా కోసిపట్టుకెళతారు.

తాము అలంకరించిన గడ్డిపూలను చూసి పిల్లలు పరమానందభరితులవుతారు. గడ్డిపూవు భగవంతుడి ప్రతిరూపాలైన పసి బిడ్డలను తాను తృప్తిపరచగలిగినందుకు ఎంతో ఆనందిస్తుంది. తన జన్మకి కూడా పరమార్థం ఉందని గ్రహిస్తుంది.

విద్య పద్యాలతో చక్కగా "గడ్డిపూవు" వ్రాసింది. తండ్రిని కూడా తనతో రమ్మంది. ఆయన అంగీకరించివెళ్ళారు.

వామనమూర్తి విద్య తనమాటమీద గౌరవంతో వచ్చినందుకు సంతోషించాడు. ఆమెను, సారథిగారిని పల్కరించి కూర్చోపెట్టాడు. వేదికమీద అధ్యక్షస్థానంలో విజయవాడనుండి వచ్చిన నారాయణమూర్తిగారున్నారు.

నారాయణమూర్తిగారు మంచి పండితులు, వక్త, ఎన్నో మంచి పుస్తకాలను రచించారు. సారథికి ఆయనంటే గౌరవం. వామనమూర్తి సెలక్షన్ ఎప్పుడూ బాగానే ఉంటుంది అని అనుకొన్నారు.

మంజీరలహరి ప్రెసిడెంటు శ్రీరాములునాయుడికి మాత్రం ఈయనని పిలవడం ఇష్టంలేదు. తనకి చిన్నప్పుడు పాఠం చెప్పిన గురువుగారిని పిలుద్దామన్నాడు. ఆయన గురువుగారి గురించి, ఆయన పాండిత్యం గురించి వామనమూర్తికి బాగా తెలుసును. నోరు విప్పాడంటే వేదిక అనైనా చూడకుండా నోటికొచ్చినట్లు మాట్లాడుతాడు. ఎవరిమీద ధ్వజం ఎత్తుతాడో ఎవరూ చెప్పలేరు.

అందుకే అలాంటివాళ్ళని పిలవకూడదని వామనమూర్తి అభిప్రాయం. మిగిలిన సభ్యుల సపోర్టుతో నారాయణమూర్తిగారిని పిలిచాడు. ఫలితంగా శ్రీరాములునాయుడి మొహం కళావిహీనంగా ఉంది.

జాయింట్ సెక్రటరీ అప్పలనాయుడు మాత్రం శ్రీరాములునాయుడిని మెప్పించటానికి, ఏపనైనా చేస్తాడు. అతడు వచ్చిన రచయితలను, కవులను వరుసక్రమంలో పిలవసాగాడు.

ఆయనకిష్టమైన వాళ్ళను "ప్రఖ్యాతకవి" అంటూ, "సుప్రసిద్ధకవి" అంటూ పిలవడం, ఆయనకి ఇంట్రస్టు లేనివాళ్లను "యువకవి, వర్ధమానకవి" అంటూ చెప్పడం విద్య గమనించింది. వాళ్లు ప్రసిద్ధి చెందిన వాళ్ళయినా పొడిపొడిగా రెండు మాటలు వారి గురించి చెప్పడం చూస్తే విసుగు వచ్చింది.

రాణి అన్నయ్య సుదర్శననాయుడు పైజామా, లాల్చీ వేసుకొని మెడలో గొలుసుతో, ఆడంబరంగా సభకి వచ్చాడు. ఆయనను పావుగంట పొగిడి వేదికమీదికి పిలిచాడు అప్పలనాయుడు.

అతడు చాటంత మొహంతో తన కవితాగానం ప్రారంభించాడు. విద్యకి నీరసంగా అన్పించసాగింది. ఎప్పటికీ అవదు. మధ్యలో వచ్చి కొత్తవాళ్ళు ఆయనను అనుమతించమని వేడుకొంటున్నారు.

అప్పలనాయుడు ఇప్పుడు అవకాశం లేదంటున్నా వాళ్లు విన్పించుకోవడంలేదు. ఎలాగైనా అయిదునిమిషాలు ఇవ్వమని ప్రాధేయపడుతున్నారు. చివరికి ఎంతో ఉదారంగా ఇచ్చినట్లు అతడు వాళ్ళకి అవకాశమిస్తున్నాడు.

వామనమూర్తి విద్య పేరు ఇరవైయవదని చెప్పారు. కానీ ముప్పైమంది అయినా పిలవకపోయేటప్పటికి విద్య తండ్రి చేతిమీద ఇంక వెళ్లిపోదామన్నట్లు తట్టింది. విద్యకి తలనొప్పి, నీరసం పట్టుకొన్నాయి.

వీళ్లు లేచి వచ్చెయ్యడం చూసి, వామనమూర్తి దగ్గరకి వచ్చి మళ్ళీ కూర్చోపెట్టాడు.



అప్పలనాయుడిని లిస్టుప్రకారం ఎందుకు పిలవడంలేదని మందలించాడు. అప్పలనాయుడు మొహం మాడ్చుకొని మరో ఇద్దరి తరువాత విద్యని పిలిచాడు.

విద్య తాను వ్రాసి తెచ్చిన "గడ్డిపూవు" చదివింది. విద్య కంఠంలోని సౌకుమార్యం, ఆలోచనా పద్ధతి అందరికీ నచ్చాయి. వారు ఇచ్చిన దేవుడి ప్రతిమను, పుష్పగుచ్ఛాన్ని తీసికొని విద్య వచ్చేసింది.

సారథికి ఆ క్షణంలో విద్యను చూస్తుంటే ఆమే తన ప్రపంచం అని అన్పించసాగింది. ఇంట్లో నిస్సహాయంగా నిలబడిన మనిషి, గవాక్షం ద్వారా బయటప్రపంచాన్ని చూసి మురిసినట్లు ఆయన విద్య ద్వారా తను తృప్తిపొందాలని అనుకొన్నారు.

సుదర్శననాయుడు ఇంటికి వెళ్ళి చెల్లెలికి సభా విషయాలు చెప్పాడు. అలాగని తెలిస్తే తన చెల్లెలికోసం ఎవరిచేతో పద్యాలు వ్రాయించేవాడినని అనుకోసాగాడు. రాణికి, కవిత్వానికి ఆమడదూరం. రేడియో, టి.వి. లలో అవివచ్చినప్పుడే ఠక్కున కట్టేస్తుంది.

"అబ్బ... కలం, కాగితం పుచ్చుకుని ఏవో నాలుగు గీకే ప్రతీవాడూ ఈ రోజుల్లో ఒక కవే. ప్రజల మెదడులను నిర్దాక్షిణ్యంగా తినేస్తున్నారు" అని కసిగా అనుకొంటుంది. విద్యతో పోటీ పడటంకోసం, అందరి రచనలు వినడం తనవల్ల కాదనుకొంది.

కాలం ఒక్కొక్కసారి గిర్రున తిరిగినట్లు అన్పిస్తుంది. మనకి అనుకూలమైనవి జరిగినప్పుడు ఎంత గమ్మున రోజులు దొర్లుతున్నాయి అని అనుకొంటాము. ప్రతికూలంగా ఉన్నప్పుడు ఎంతకీ రోజులు గడవడం లేదనుకొంటాము. జ్ఞానులైనవాళ్ళు కాలం ఎవరికోసం ఆగదని, విలువ తెలుసుకొని ప్రవర్తిస్తారు.

మురళికి తండ్రి ఇదివరకటిలాగా మందలించడానికి శక్తిలేని వాడవడంతో కొమ్ములు వచ్చినట్లయింది. దానికి సాయం, అవగాహన లేని ఫ్రెండ్స్. ఎంతసేపూ రోడ్లమీద నిలబడటం, కబుర్లు చెప్పుకోవడం వారికి హాబీ. మురళి అనకపోయినా అతడి ఫ్రెండ్స్ మా




త్రం వచ్చేపోయేవారిని అంటూనే వుంటారు.

విద్య అన్నగారిని వాళ్ళతో కలిసి అలాగ సెంటర్లలో నిల్చోవద్దని చెప్పింది. అతడు విన్పించుకోలేదు. చివరికి ఆమెకి విసుగేసి ఊరుకొంది. తండ్రికి సాయపడాలని అనుకోడు. అతడి స్నేహితులకి డబ్బుకి కొదవలేదు. మురళిని తమవెంట తిప్పుకోవడం వాళ్ళకిష్టం.

రిజల్ట్సు వచ్చాయి. మురళి ఎలాగో అత్తెసరు మార్కులతో పరీక్ష అయిందనిపించాడు. కొడుకు తండ్రి ఉద్యోగం చేయననడం చూసి రాధమ్మ తనే ఏ ఎటెండరు ఉద్యోగమో ఇస్తే చేద్దామనుకొంది.

ఆవిడకి ఆ క్షణంలో సారధి మాటలు బాగా గుర్తుకి వచ్చాయి. సారధి ఆవిడని పదవతరగతి చదవమని ఎంతో ప్రోత్సహించారు. వయసుకి చదువుకి సంబంధం లేదన్నారు.

ఆవిడ మాత్రం బయటకి వచ్చి నలుగురి ఎదుటా పడటానికి ఎంత మాత్రం అంగీకరంచలేదు. ఆవిడ ఆయన దగ్గరే ఎన్నో విషయాలు తెలుసుకొన్నారు. ఎన్నో పుస్తకాలు చదువుకొన్నారు. కానీ ఏం లాభం? గుర్తింపు కోసం ఒక డిగ్రీ అయినా తెచ్చుకోవడానికి ప్రయత్నించలేదు.

ఆవిడ తనకి తగిన ఏదో ఒక ఉద్యోగం ఇవ్వమని అధికారులకి అప్లికేషన్ వ్రాసింది. దాన్ని చదివి సారధి చింపేశాడు. భార్య ఏనాడూ గడపదాటివెళ్లడానికి ఇష్టపడలేదు. అలాంటి ఆవిడను పరిస్థితులు బయటకి తరమడం ఆయన తట్టుకోలేకపోయారు.

విద్య తాను చదువు మానేస్తానంటే ఆయన అంగీకరించలేదు. విద్యని చదువుకి దూరం చేస్తే ఆ సరస్వతి తనని క్షమించదనిపించింది ఆయనకి. ఏం జరిగితే అదే జరుగుతుందనుకొందామని ఆయన ఉద్యోగం వదులుకోవడానికే సిద్ధపడ్డారు. మురళికి ఏంచేయాలో తోచలేదు.

స్నేహితులు వచ్చిన ఉద్యోగంలో చేరడమే మంచిదన్నారు. తమ మార్కులకి పైచదువుకే సీట్లు రావు. ఇంక ఉద్యోగాలు ఎక్కడనుండి వస్తాయి. కనుక మురళిని హాయిగా తండ్రి

ఉద్యోగం చేసుకోవడమే మంచిదని చెప్పారు.

మురళి అప్లికేషన్ పెట్టడం, ఆరునెలల్లో క్లర్కు ఉద్యోగం రావడమూ జరిగింది. సారధి గారు ఎలాగైతేనేం ఒక సమస్య తీరిందనుకొన్నారు. మురళి పీకకి ఉద్యోగం ఒక గుదిబండ లాగా అనిపించసాగింది.

విద్యకి ఇంటర్‌లో ఫస్టురాంక్ రావడం సారధిని ఎంతో ఆనందానికి గురిచేసింది. ఆయన కళ్లు ఆనందభాష్పాలను వర్షించాయి. ఈ పిల్ల... ఈ చిన్నపిల్ల చదువులో ఎంత కృషి చేసింది అని పదేపదే మనసులో అనుకొన్నారు.

సాధారణంగా ఒక పబ్లిక్‌లో రాంక్ వస్తే మరొక పబ్లిక్‌లో వాళ్లు పాసవడమే కష్టమవుతుంది. మొదట సాధించినదానికే గర్వపడి, భవిష్యత్తును సీరియస్‌గా తీసుకోక పాడుచేసుకొంటారు. విద్య మాత్రం దానికి భిన్నంగా ఒక్కొక్క సోపానమూ ముందుకి అధిరోహించడం చూస్తే ఆయనకి ఆనందం కలిగింది. "ఈ చదువుల సరస్వతికి నేను తండ్రినవడమే నా అదృష్టం" అని అనుకొన్నారు. టి.వి.లో విద్యను చూపిస్తే పొంగిపోయారు.

రాధమ్మ మాత్రం ఉప్పు, మిరపకాయలు తీసి దిగదుడిచి పారేసింది. వెధవర్యాంకులు. బిడ్డను పదిమంది కళ్ళల్లోనూ పడేస్తున్నాయి అని భయపడింది.

ఒకవిధంగా ఇంత ఆనందాన్ని పొందిన సారధి మర్నాటికే డల్‌గా అయ్యారు. ఏ తండ్రి అయినా ఇంత బాగా చదివిన కూతురికి ఇంజనీరింగ్ చెప్పిస్తాడు. తానో...? సీటు గవర్నమెంటు కాలేజీలో వచ్చినప్పటికీ ఫీజులూ, పుస్తకాల ఖర్చూ భరించగలడా?

మురళి చూస్తే జీతం ఇష్టం వచ్చినంత ఇస్తున్నాడు. కొట్టుమీద వచ్చే ఆదాయం కొంత దాని అభివృద్ధికి, కొంత ఇంటికి ఖర్చుపెడుతున్నారు. కనుకే ఇల్లు నడుస్తోంది.

ఎలాగైనా విద్యని కష్టపడి చదివించాలని ఒక్కపక్క కోరిక తినేస్తోంది. ఆయన ఏంచేద్దామా అని ఆలోచనలో పడిపోయారు. రాధమ్మకి విద్య విషయంలోఏం చెప్పడానికీ మనసు రాలేదు.

విద్యకి ఇవేమీ పట్టలేదు. యం. సెట్ పరీక్షలకి తయారవడంలో మునిగిపోయింది. ఆమె ఏకాగ్రత చూస్తే ఆయనకి ఎంతో ముచ్చట వేసేది. రాణికి ఇంటర్‌లో ఫస్టుక్లాసు వచ్చింది. తండ్రి కోచింగ్ సెంటర్‌లో పెట్టారు.

అందరూ ఎదురుచూసే ఫలితాలు రానేవచ్చాయి. విద్య యం. సెట్‌లో రెండవర్యాంకు సాధించింది. మొదటి ర్యాంక్ హైదరాబాద్ స్టూడెంటుకి వెళ్లిపోయింది. ఒక్క మార్కులో అతడు తనని ఓడించడం చూసి నవ్వుకొంది.

రాణికి మంచి ర్యాంక్ రాలేదు. ప్రైవేటు కాలేజీలలో చేర్చవచ్చునని, డొనేషన్ బాగా కట్టవలసి వస్తుందని అనుకొన్నారు. పద్మనాభనాయుడు కూతురిని పిలిచి దగ్గర కూర్చోపెట్టుకొని ఎంత డబ్బు ఖర్చు అయినాసరే రాణి ఇష్టమే తన ఇష్టమని చెప్పారు. అన్నలు కూడా చెల్లెలిని ఇంజనీరింగ్ చదివించాలని ఉబలాటపడ్డారు.

రాణికి అయిదువేలు దాటి ర్యాంక్ వచ్చినందుకే సిగ్గుగా ఉంది. చిన్నన్నయ్యావాళ్లు చెల్లెలి విషయంలో యం. సెట్ పరీక్షలముందు కొంచెం హడావుడి చెయ్యబోయారు. రాణి ఒప్పుకోలేదు. ఏమాత్రం అవకతవకల గురించి బయటపడినా పేపర్లు, ప్రజలు ఏకిపారేస్తారు.

తనమానాన తను చదువుకొంటానని ఆమె పట్టుపట్టడంతో వాళ్లు ఊరుకుండిపోయారు. ఇప్పుడు ర్యాంక్ చూస్తే ఇలా బాగా వెనక్కి వెళ్ళిపోయింది. రాణి ఆలోచనలో పడటం చూసి ఈ విషయమ్మై బాధపడుతోందని అనుకొన్నారు. తమ ఇంటి ఆడపిల్లకి డబ్బుకి బాధ ఏమిటి? అందుకే ఎంత డబ్బు అయినా ఫర్వాలేదన్నారు. బాగా ఆలోచించుకొన్నాక రాణి ఒక నిర్ణయానికి వచ్చింది.

రాణి ఇంజనీరింగ్ చదవనని చెప్పింది. అసలు ఆ లైను మీద తనకి అంత ఆసక్తిలేదని




తేల్చేసింది. హాయిగా, సరదాగా బి.యస్.సి చదువుతానంది. ఎవరూ ఆమె నిర్ణయాన్ని మార్చలేకపోయారు.

కనకమ్మ ఆలోచనలు వేరు. కూతురే కష్టప డి చదవాలా? బాగా డబ్బు మూలుగుతోందిగ నుక హాయిగా ఏ డాక్టరునో, ఇంజనీరునో అల్లుడిగా తెచ్చుకొంటే చాలదా? బిడ్డని చదు వుపేరుతో బాధపెట్టాలా, అని తన వాళ్లతో దెబ్బలాడింది.

విద్యను సారధిగారు ఇంజనీరింగ్ చదవ మన్నారు. విద్య నవ్వింది. తను ఉమెన్సు కాలేజీలో బి.యస్‌సిలో చేరతానంది. కంప్యూటర్ సైన్సు చదవాలని అనుకుంటున్నా నని చెప్పింది.

యంసెట్‌లో ర్యాంక్ వచ్చి బి.యస్‌సి చదవడమేమిటని ఆయన వాదించారు. కుటుంబ పరిస్థితులదృష్ట్యా విద్య ఇంజనీ రింగ్ చదవనంటోందని ఆయనకి అర్థమైంది. ఆయన ఎన్నివిధాలుగా చెప్పినా విద్య ఒప్పుకో లేదు.

"సరదాకొద్దీ యంసెట్ రాశాను. రాష్ట్రంలో నా స్థానం ఏమిటో తెలుసుకోవాలనుకోవడం తప్పుకాదుకదండీ! ఏ చదువు చదివినా అందులో రాణించే విధంగా ఉంటాను. కనుక నన్ను బలవంతం చేయకండి'' అంటూ చెప్పే సింది.

భర్త విచారం చూడలేక రాధమ్మ కూడా సర్ది చెప్పింది. అయినా విద్య వినలేదు. ఆవిడ కొడుకుతో చెప్పింది విద్య ఇంజనీరింగ్ చదవ నంటోందని. మురళి మౌనం వహించాడు.

ప్రస్తుతం మురళి భీమడోలులో క్లర్కుగా చేస్తున్నాడు. ఏ రెండు రోజులు సెలవు కలిసి వచ్చినా ఇంటికి వస్తాడు. చెల్లెలి చదువు గురించి తను మాత్రం ఏం చేస్తాడు. జీతంలో తనకి కావలసినది ఉంచుకొని మిగిలినది ఎలాగూ ఇంటికి ఇస్తున్నాడు. అయినా ఇపుడు చదువుకీ, రేపు పెళ్లికీ వేలకు వేలు ఖర్చుపె ట్టడం మాటలా?

దాని బదులు చెల్లెలికోసం కొంత డబ్బు ఇప్పట్నుంచే దాచి ఉంచడం మంచిద న్పించింది. తనకి ఇష్టమైనదేదో చదువుతా నంటోందికదా ఇంకా వాదనలు ఎందుకని తన అభిప్రాయం చెప్పేశాడు.

రాధమ్మ కొడుకు అలాగ మాట్లాడతాడనుకో లేదు.

విద్య తండ్రిని ఏలూరు వెళ్లిపోదామని కోరింది. అన్నగారు ఒంటరిగా ఉండలేడు. తను ఏలూరులో చదువుకోవచ్చును. అన్నగా రు ఉద్యోగానికి ఇంటినుండి తిరగవచ్చును. వీలు చూసుకొని ట్రాన్స్‌ఫర్ పెట్టుకోవచ్చును.

సారధికి, మురళికి విద్య సలహా నచ్చింది. విద్య వెళ్లిపోతోందని తెలిసి స్నేహితురాళ్లు ఏడుపు మొహాలు పెట్టేశారు. విద్యను వదిలి ఉండలేకవాళ్లు ఒకటే గోల. విద్యకీ వాళ్లని వదలడానికి బాధగానే అన్పించింది.

ఇందిరను, కస్తూరిని తీసికొని రాణికి చె ప్పిరావడానికి విద్య బయలుదేరింది. జ్యోతిని రమ్మని పిలిచినా వాళ్ల గడప తాను తొక్క నంది.విద్య బలవంతం చేయలేదు.

విద్యకి మొదట కన్పించింది యం.ఎ ల్.ఏగారే. ఆయనకి విద్య నమస్కారం పె ట్టింది. ఆయనకి ఆమెను చూస్తే ముచ్చటవే సింది. గులాబీరంగు పరికిణీ, జాకట్టు, నలుపు ఓణీలో విద్య ఆయన కళ్లకి లక్ష్మీదేవిలాగ కన్పించింది.

"రామ్మా! రా! నాన్నగారు బాగున్నారా'' అంటూ కుశల ప్రశ్నలు వేశారు.

తాము ఏలూరు వెళ్లిపోతున్నామని, రాణికి చెప్పి వెళ్లడానికి వచ్చానని విద్య చెప్పింది. ఆ అమ్మాయి వినయం చూస్తే ఆయనకి సరదా అన్పించి కాసేపు కబుర్లు చెప్పారు.

రాణిని క్రిందికి పిలిచారు. తండ్రి పిలుపుతో క్రిందికి రాబోతున్న రాణి కాళ్లు మెట్లమీదే నిలిచిపోయాయి. తండ్రి ఎదురుగా కూర్చుని విద్య, ఆమె స్నేహితులు మాట్లాడుతున్నారు. తండ్రిని చూస్తే చాలా సరదాగా కన్పించారు.

విద్య రాక రాణిని సందిగ్ధంలో పడేసింది.

యంఎల్ఏగారు రాణిని చూస్తూ "అదేమిటమ్మా! అలాగ నిలబడిపోయావు. వచ్చి నీ స్నేహితులను తీసికెళ్లు'' అని అన్నాక ఈ లోకంలోకి వచ్చింది. తర్వాత క్రిందికి దిగి వచ్చింది.

అప్పుడే స్నానం చేసి వచ్చిందేమో రాణి కడిగిన ముత్యంలాగ ఉంది. ఒక రకమైన హుందాతనం రాణి నడకలో ఉంటుందని, రాణికి అది స్వతహాగా వచ్చిందని విద్యా వాళ్లు గ్రహించారు. రాణిని చూస్తూ విద్య సన్నగా నవ్వింది.

రాణి అప్పటికి మామూలు స్థితికి వచ్చి వాళ్లను పైకి తీసికెళ్లింది. యంఎల్ఏగారు నౌకరుని పిలిచి రాణి ఫ్రెండ్స్‌కి టిఫిన్, కాఫీలు పట్టుకెళ్లమన్నారు. విద్య వద్దంటోన్నా ఆయన విన్పించుకోలేదు.

విద్య వెండి సరస్వతి విగ్రహాన్ని రాణి టేబుల్ మీద ఉంచింది. "ప్లీజ్ రాణీ! అన్న మాటను నన్ను నిలబెట్టుకోనియ్యి. కొన్ని సంవత్సరాలైనా మనం కలిసి చదువుకొన్నాంకదా! నా గుర్తుగా ఉండనియ్యి అంటూ మారుమాట్లాడనీయకుండా క్రిందికి వచ్చేసింది. రాణికి ఏం మాట్లాడాలో అర్థమవలేదు.

రాణి తమతో స్నేహంగా మాట్లాడటం చూస్తే కస్తూరికి, ఇందిరకి ఆశ్చర్యమేవేసింది. ఇది కలా, నిజమా అని అనుకొన్నారు. విద్య మాత్రం మౌనంగా ఉండిపోయింది. ఆమె మనసు ఈ ఊరు వచ్చినప్పటినుండి అన్ని సంఘటనలనూ మననం చేసుకొంటోంది.

యంఎల్ఏగారు రాణి గదిలోకి వచ్చారు. అక్కడనున్న సరస్వతీ విగ్రహాన్ని చూసి ఆయన చేతులలోకి తీసుకొన్నారు. వీణాపాణి ఎంతో ముద్దుగా ఉంది. విద్య తనకి దాన్ని బహుమతిగా ఇచ్చిందని, తమమధ్య జరిగిన విషయం గురించి రాణి చెప్పింది.

ఎందుకో విద్య వెళ్లిపోతోందంటే రాణికి ఉత్సాహంగా అన్పించలేదు. విద్య వచ్చిన తర్వాత తన జీవితంలోకి ఏదో హడావుడి వచ్చిందన్పించింది. ఏనాడూ కస్తూరి తమ ఇంటికి రాలేదు. విద్యకన్నా ముందునుంచే తామిద్దరూ కలిసి చదువుకొన్నారు. కానీ వాళ్లు, తాము విడివిడిగానే ఉండిపోయారు.

ఎవరూ తమలో విద్యలాగ చొరవ తీసుకోలేదు. రాణికి ఎందుకో మనసు చాలా దిగులుగా అన్పించింది. విద్య ఇచ్చిన వెండి ప్రతిమను తీసుకొని చూస్తూ కూర్చుంది. తర్వాత ఎప్పటికో దాన్ని టేబుల్ మీద పెట్టింది. ఈసారి ఆమె ఉంచినచోటు ఆ బొమ్మ నిద్రలేవగానే తనకి కన్పించేవిధంగా ఉంది.

కూతురు ముభావంగా ఉండటం చూస్తే కారణం ఏమిటో ఎవరికీ తోచలేదు. మాధవనాయుడు ఇంటికి వచ్చాక విద్య వచ్చిన విషయం తెలిసింది.

"అమ్మయ్య... ఊరునుండి పోతున్నారా? సగం శని విరగడవుతుంది'' అంటున్న అతడిని రాణి 'అన్నయ్యా! ఇంకచాలు ఆపు' అని ఉరిమినట్లు అంది.

అతడికి చెల్లెలికోపం చూస్తే విసుగు వచ్చింది. విద్య వచ్చాక తమకి ఏర్పడిన ఇబ్బందుల గురించి చెపుతూనే ఉన్నాడు. "అసలు ఆ పిల్లకి కళ్లు కన్పిస్తున్నాయా? ర్యాంకు స్టూడెంటునని ఒకటే గర్వం. ఆ విరగబాటు చూస్తే నాకు ఒళ్లుమంట" మాధవ తీవ్రంగానే అన్నాడు.

"విద్యకి గర్వమే ఉంటే అసలు మన ఇంటికి రాదు. మనకి చెప్పి వెళ్లదు. తెలిసిందా? అనవసరంగా నోరు పారేసుకోకు'' అని అక్కడనుండి రాణి వెళ్లిపోయింది.

మాధవనాయుడు తెల్లబోయాడు.

చెల్లెలికి మతిపోయిందేమోనని అనుకొన్నాడు. "దీనికి బుద్ధి ఎప్పుడెటు తిరుగుతుందో చెప్పలేము. వట్టి తిక్కమనిషి'' అని విసుక్కొన్నాడు.

యంఎల్ఏగారు ఊరుకోమన్నట్టు చూశారు.

విద్య తమ కాలేజీలో చేరడం ప్రిన్సిపాల్




సులోచనకి ఎంతో సంతోషమన్పించింది. ఆవిడ మేథమెటిక్సు చెపుతారు. విద్య కాలేజీకి వచ్చిన రోజున ఆవిడ ఎంతో ఆనందంగా వెలెకం మిస్ విద్యాధరీ! వెల్కం" అంటూ చైర్‌లో నుండిలేచి, ఎదురు వచ్చి, కౌగలించుకొన్నారు.

బాగా చదివే పిల్లలంటే ఆవిడకి ప్రాణం. ఆవిడ అవివాహితగా ఎందుకుండిపోయారో ఎవరికీ తెలియదు. ఎవరో డాక్టరు ఆమెను ప్రేమించాడని, తల్లిదండ్రులు అతడిని వివాహం చేసుకోవడానికి అంగీకరించలేదని, ఆవిడ కుటుంబబాధ్యతలు తీరాక వాళ్లిద్దరూ పెళ్లి చేసుకొందామనుకొన్నారని, ఈలోపే ఆయన మృత్యువాతపడ్డారనీ అంటారుగానీ నిజమో, కాదో ఎవరికీ తెలియదు. తెలిసింది ఒకటే. ఆవిడ ఆ కాలేజీ సేవకు అంకితమైపోవడం.

ఈ ప్రిన్సిపాల్ గురించి విద్య ఎప్పుడో తెలుసుకొంది గనుక ఆవిడ పరిష్వంగంలో విద్య గువ్వపిట్టలాగ ఒదిగిపోయింది.

"డిగ్రీలో కూడా నువ్వు గోల్డు మెడల్ సాధించాలి. తెలిసిందా!" అని ఆవిడ అనగానే విద్య అలాగేన్నన్నట్లు తల ఊపింది.

సారధికి తన బిడ్డను మంచి కాలేజీలోనే చేర్పించానన్న తృప్తి కలిగింది. ఆ చుట్టుపక్కల ఆ ఉమెన్స్ కాలేజీకున్న పేరు ఏ ఇతర కాలేజీలకు లేదు. ప్రిన్సిపాల్ మంచి ఎడ్మినిస్ట్రేటర్ అని అందరూ చెప్పుకొంటారు.

ఆవిడ సాయంత్రం స్టాఫ్ మీటింగ్ పెట్టారు. కొత్త సంవత్సరంలో తను తీసుకోదలచుకొన్న స్టెప్స్ ఏమిటో వారందరికీ తెలియచేస్తుంటారామె.

విద్యను అందరికీ పరిచయం చేశారు. ఆవిడ వాళ్లతో నిర్మొహమాటంగా అన్నారు "సమర్థులైన మంచి ఉపాధ్యాయులు లభించడం విద్యార్థులకి ఎలాగ అదృష్టమో, అలాగే మెరికల్లాంటి స్టూడెంట్సు లభించడం మనకీ అదృష్టమే. మన ప్రతిభ ఏమిటో లోకానికి తెలియాలంటే ఇటువంటి విద్యార్థినులు అవసరం.

ఈ అమ్మాయి మళ్లీ మనకి గోల్డు మెడల్ తెచ్చేలాగ మీరందరూ సహకరించాలి'' అన్నారు. వాళ్లు అలాగే అన్నట్లు తల ఊపారు. కాలేజీ అయిపోయాక ఆవిడ విద్యను తన ఇంటికి తీసికెళ్లారు.

ప్రిన్సిపాల్ కాలేజీ హాస్టల్‌లోనే ఒకపక్క మేడమీద ఉంటారు. విద్య ఇల్లంతా చూస్తూ మౌనంగా ఉంది. ఎందుకు ఇంటికి రమ్మన్నారో ఆమెకి అర్థమవలేదు.

బట్టలు మార్చుకొని, ఆవిడ బయటికి వచ్చారు. వంటావిడ ఇద్దరికీ హార్లిక్సు కలిపి ఇచ్చింది. విద్య మొహమాటంగా తీసికోకపోతే ఆవిడ దెబ్బలాడారు. విద్యను చూస్తూంటే ఆవిడకి తను కోల్పోయినదేదో దొరికినట్లు అన్పిస్తోంది.

"విద్యా! నేను నీ పర్సనల్ విషయాలు అడగవచ్చునా?"

విద్యకి ఆవిడ అంటున్నదేమిటో అర్థమవలేదు. తన పర్సనల్ విషయాలా?

విద్య మౌనం చూసి ఆవిడ అన్నారు మన పరిచయమైన కొన్ని గంటలలోనే ఇలాగ అడిగానని ఏమీ అనుకోకు. నువ్వు ఇంజనీరింగ్ చదవకపోవడానికి నాకు కారణాలు కావాలి. ఒక ప్రిన్సిపాల్‌గా నేను అడగడంలేదు. నీ ఆత్మీయురాలిగా మాత్రమే అడుగుతున్నాను. అభ్యంతరం లేకపోతే నే చెప్పు''.

ఆవిడ అలాగ అడగగానే విద్య కొద్దిక్షణాలు తన చేతులను చూసుకొంటూ కూర్చుంది. చివరికి ఒక నిర్ణయానికి వచ్చినట్లు తన కుటుంబ పరిస్థితులు ఏవిధంగా తను ఈ నిర్ణయం తీసుకొనేలాగ చేశాయో చెప్పింది.

విద్య చెప్పింది విని ఆవిడ బరువుగా నిట్టూర్చారు. అది తను ఊహించిన సమాధానమే. ఆవిడ కొంతసేపు గడిచాక విద్యని ఇంజనీరింగ్ చదవమని, ఆమె చదువుకి అయ్యే ఖర్చు తను భరిస్తానని చెప్పింది.

విద్య ఒప్పుకోలేదు. అసలు మొదట ఆవిడ

చెప్పే మాటలు విని స్థాణువులాగ ఉండిపోయింది. ఆ ఆత్మీయతకి కళ్లనీళ్లు తిరిగాయి. తన బంధువులు ఎవరూ అనని మాటలు అవి. ఇవ్వని అవకాశం అది.

విద్య రెండు చేతులూ ఎత్తి ఆవిడకి నమస్కారం చేసింది. తర్వాత నెమ్మదిగా తిరస్కరించింది. సులోచనగారు విద్యని ఆలోచించుకోమని, తొందరలేదని, విద్యలో తన బిడ్డను చూసుకొంటున్నానని చెప్పారు.

విద్య ఆవిడ మాటలకి చలించిపోయింది. ఆవిడ దగ్గర చదువుకోవడమే తన అదృష్టమని చెప్పేసింది.

విద్యకి కాలేజీ ఎంతో నచ్చింది. చాలా క్రమశిక్షణ కలిగినకాలేజీ అది. ప్రిన్సిపాల్ స్టూడెంట్సుకి విద్యను పరిచయం చేసి, ఆమెను స్ఫూర్తిగా తీసికొని బాగా చదవాలని హెచ్చరించారు.

ఆవిడ మనసు ఎంత మంచిదో మనిషి అంత కరకు. ప్రతీ విషయంలోనూ ఎంతో స్ట్రిక్టుగా వుంటారు. క్లాసు విడిచి బయట తిరుగుతున్న స్టూడెంట్స్ని ఎక్స్రే కళ్లతో గమనించి పట్టుకుని వారి పేర్లు నోటీసులో పెట్టి ఫైనువేస్తారు.

రోజుకి రెండు, మూడు రౌండ్లు తిరిగి, కాలేజీ పర్యవేక్షిస్తారు. ఆవిడ క్లాసులంటే విద్యార్థినులకి ఇష్టం. లెక్చరర్లకి, విద్యార్థినులకు ఆవిడ అంటే భయమే.

కాలేజీలో చేరాక విద్యకి ఎక్కడలేని ఉత్సాహం వచ్చేసింది. సారధిగారి షాపు కూడా ఇక్కడ బాగా పుంజుకొంది. మురళికే ఫ్రెండ్సందరూ దూరమయ్యారని కినుకగా ఉంది. విద్యకి కాలేజీలో మంచి ఫ్రెండ్స్ ఏర్పడ్డారు.

ఒక సాయంత్రం కాలేజీ వదిలాక విద్య ఇంటికి బయలుదేరింది. బుక్స్ కొనుక్కోవాలని బజారులో ఆగి, ఒక షాపులోకి వెళ్లింది. కొనుక్కొని లూనా దగ్గరకి వస్తోంటే, విద్య పక్కనే మరొక స్కూటర్ ఆగి ఉంది.

విద్య లూనా స్టార్టు చేయబోతూంటే "ప్లీజ్ విద్యాధరీ! ఒక్కక్షణం" అని విన్పించింది. విద్య తల త్రిప్పి అటు చూసింది. హడావుడిగా తనవైపు వస్తున్న ఓ యువకుడిని చూసి ఆగింది.

"నేను ఎవరో గుర్తు ఉన్నానా?" అతడు ఆమె దగ్గరికి వచ్చి ఆనందంగా అడిగాడు. విద్య చిరునవ్వుతో తల ఊపింది.

"థాంక్‌గాడ్! మిమ్మల్ని ఇంత త్వరలో చూస్తానని అనుకోలేదు. బైదిబై మీకు నా కంగ్రాచులేషన్స్'' అతడు గబగబా చెప్పేశాడు.

విద్య నవ్వుతూ "ఎందుకు? మీకు కన్పించినందుకా?" అని అడిగింది.

"కాదు! రెండు మంచి ర్యాంకులు మీరు కొట్టేసినందుకు'' అతడు మళ్లీ చెప్పాడు.

విద్య "థాంక్స్'' అంది.

"మీరు నాకు మంచి పార్టీ ఇవ్వాలి'' అతడు వెంటనే అన్నాడు. విద్య ఆశ్చర్యంగా చూసింది. తమ మధ్య అంత చనువు లేకపోయినా అతడు అడిగిన విషయం ఆమెకి ఆశ్చర్యాన్ని కలిగించింది.

"నేను ఇన్ని మాట్లాడుతున్నా మీరు ఏమీ మాట్లాడటంలేదు. అసలు మీకు నేను గుర్తు ఉన్నానా? అయితే నా పేరు చెప్పండి'' అతడు విద్యను నిలదీస్తున్నట్లుగా అన్నాడు.

"రాజశేఖరం" విద్య పెదవులు మెల్లిగా పలికాయి. "ఇప్పటికైనా నేను మిమ్మల్ని మరిచిపోలేదని ఒప్పుకొంటారా?" విద్య అతడిని చూస్తూ అంది. రాజశేఖరం మధురంగా నవ్వాడు.

"ఈ పక్కనే హోటలుంది. రండి కాఫీ తీసుకొందాం" అంటూ అతడు దారి తీస్తూంటే ఆమెకి అనుసరించక తప్పలేదు.

ఆమెను చూడటం తనకి చాలా ఆనందంగా ఉందని చెప్పి, ఇక్కడికి విద్య రావడం గురించి అడిగాడు. విద్య తను




ఇక్కడ కాలేజీలో చేరానని చెప్పింది. "విద్యా! మీరు ఇంజనీరింగ్ చదవడంలేదా?" అతడు నిరుత్సాహంగా అడిగాడు. విద్య లేదన్నట్లు తల ఊపింది. ఎందుకో, ఏమిటో కారణాలు అడగలేకపోయాడు. దానికి తమ మధ్య పరిచయం చాలదనుకొన్నాడు.

విద్య తాము ఆ ఊరు వచ్చేశామని చెప్పింది. రాజశేఖరం ఆనందంగా చూశాడు. "అయితే ఇంక మనం ఇక్కడే కలిసి ఉంటాం" అన్నాడు. విద్యకి అతడి మాటలు నవ్వుని తెప్పించాయి.

అతడు విద్యకి వద్దంటున్నా స్వీటు, హాటు తెప్పించాడు. తనుకూడా తింటూ "విద్యాధరీ! మన ఈ కలయిక స్వీట్‌తో సెల్రబేట్ చేసుకొందాం. దయచేసి కాదనకండి'' అన్నాడు. విద్య కాదనలేకపోయింది.

ఇక్కడే తను ఇంజనీరింగ్ ఆఖరి సంవత్సరం చదువుతున్నాననీ, హాస్టలులో బావుండక, వేరే రూం తీసికొని ఉంటున్నానని అతడు చెప్పాడు.

"మిమ్మల్ని మళ్లీ కలుసుకోవాలని ఎంతగా అనుకొన్నానో చెప్పలేను. నిజం విద్యాధరీ! అబద్ధం అనుకోకండి. భగవంతుడు నా కోరిక ఇలాగ తీర్చాడు'' అతడు నిజాయితీగా అన్నాడు.

"విద్యాధరీ'' అని అతడు పిలుస్తోంటే విద్యకు గమ్మత్తుగా అన్పించింది. కాఫీ తనకి అలవాటు లేదని విద్య చెప్పడంవలన అతడు వద్దన్నా విన్పించుకోకుండా హార్లిక్సు తెమ్మన్నాడు. విద్యక్కి ఇంటికి వెళ్లడానికి ఆలస్యమవుతోందని కంగారుగా ఉంది.

అతడికి విద్యను చూస్తే గొప్ప ఆనందంగా ఉంది. ఒక వ్యక్తిని కలుసుకోవడంలో ఇంత ఆనందం ఉందా అని తనని తానే ప్రశ్నించుకొన్నాడు. ముదురు నీలం రంగు పట్టుపరికిణీ, నీలం జాకట్టు విద్య తెల్లటి ఒంటికి ఎంతో నప్పాయి. తెల్లటి ఓణీ ఒద్దికగా ఆమెను చుట్టబెట్టుకొన్న అదృష్టం నాదే సుమా అన్నట్లు గర్వంగా చూస్తోంది.

విద్య ఎదురుగా ఉంటే అతడికి ఏమీ తెలియడంలేదు. విద్య హార్లిక్సు గబగబా తాగి "పదండి... ఇంక వెళదాం" అంటూ లేచింది. ఆ సోగకళ్లలోని ఆత్రుతను చూస్తే అతడికి లేవక తప్పలేదు.

విద్య బండిని బయలుదేరడానికి తీసింది. రాజశేఖరంవైపు చూస్తూ వెళుతున్నానని చెప్పబోయింది. అతడు నెమ్మదిగా విద్యతో అన్నాడు.

"విద్యాధరీ! మిమ్మల్ని కలుసుకొన్న పరిచయాన్ని నేను ఎప్పుడూ మరిచిపోలేను. మిమ్మల్ని ఇలా కలుసుకోవడం నా అదృష్టం. చూడగా మన కలయిక భగవంతుడికి ఇష్టంలానే ఉంది''

విద్య తలెత్తి అటుచూసేలోపలే, అతడు బండి తీసికొని వెళ్లిపోయాడు.

ఎప్పుడూ విద్య అబద్ధాలు చెప్పి ఎరుగదు. ఈరోజు తండ్రి ఆత్రుతగా తన రాకకోసం చూస్తోంటే విద్యకి ఏం చెప్పాలో తెలియలేదు. తండ్రివైపు చూస్తూ "మొహం కడుక్కొని వస్తానుండండి నాన్నా!" అంటూ లోపలికి వెళ్లింది. తర్వాత ఇద్దరూ కబుర్లలో పడిపోయారు.

ఆరాత్రి చదువువైపు మనసు మరల్చడానికి విద్య చాలా కష్టపడవలసి వచ్చింది. ఏమిటీ... నాకేమైంది? అంటూ తనమీద తనే విసుక్కొంది. క్రమ శిక్షణ కలిగిన మనిషి అవడంవలన కొంచెం సేపటికే చదువులో మునిగిపోయింది.

రాత్రి పడుకొన్నా ఎంత సేపటికీ నిద్రరావడంలేదు. రాజశేఖరం ఇక్కడ కనబడటం ఎంతో ఆశ్చర్యంగా ఉంది. అతడి ప్రథమ పరిచయం ఆమె మనసులో మెదిలింది. అది గుర్తుకి రాగానే విద్య పెదవులపై చిరునవ్వు వచ్చింది.

★ ★ ★

"గానలహరి'' వాళ్లు ఆర్భాటంగా ఘంటసాల వర్ధంతి ఉత్సవం తలపెట్టారు. ఘంటసాల, సుశీలల పాటల పోటీ పెట్టారు. బహుమ

తులు కూడా ఘనంగానే ఉన్నాయి. ప్రథమ బహుమతి వెయ్యినూట పదహార్లు, మొమెంటో ద్వితీయ బహుమతి అయిదు వందలు, మొమెంటో, తృతీయ బహుమతి మూడు వందలు, కన్సొలేషన్‌లు రెండు నూటపదహార్ల చొప్పున ప్రకటించారు.

పురుషులకి, స్త్రీలకి వేరువేరుగా పెట్టారు. ప్రైజులు కూడా వేరే. డ్యూయట్స్ పాడకూడదని, ఇతర గాయనీ గాయకుల పాటలు పాడరాదని, వాయిద్యాలు తేకూడదని, పాట అయిదునిముషాలు దాటరాదని, బహుమతుల విషయంలో న్యాయ నిర్ణయం తమదేనని ప్రకటించారు.

రాష్ట్రస్థాయి పోటీలు కావున నిబంధనలు గట్టిగా ఉండటంలో తప్పులేదని అందరూ అనుకొన్నారు. పోటీకి ఫీజు పదిరూపాయలు. విద్య, ఫ్రెండ్స్ ఉత్సాహంగా పోటీలో పాల్గొనాలని నిర్ణయించుకొన్నారు.

వరదాచార్యుల హడావుడికి అంతులేదు. అటువంటి పోటీలు పెట్టడం అనితర సాధ్యమన్నట్లు ఫీలైపోయి తిరిగాడు. సభ ఏర్పాట్లు బ్రహ్మాండంగా చేశారు. పాటలు పాడేవాళ్లకి నెంబర్లు ఇచ్చారు. జడ్జీలని లోపల గదిలో వేరే కూర్చోపెట్టి, అక్కడ స్టీరియో పెట్టించారు.

విద్యాధరి, మురళి మాత్రమే వెళ్లారు. సారధికి విపరీతమైన జ్వరం. విద్య అసలు మొదట్లో మానేద్దామనుకొంది. ఆయనే విన్పించుకోలేదు. నచ్చచెప్పి విద్యను బలవంతంగా పంపించారు.

“ఎక్కడికి వచ్చినా నువ్వు మాత్రం తప్పవుకదూ!” రాణి ఎగతాళిగా స్నేహితురాలిని అంటున్నట్లు అంది. వింటున్న మురళికి ఒళ్లు మండింది. “ఈ పోటీలు నీ బాబు పెట్టించినవి కావు. నువ్వు ఒక్కర్తివీ రావడానికి'' అని చెప్పాడు.

రాణి మొహం మాడిపోయింది. “మేనర్ లెస్ బ్రూట్... నీలాంటి వాడితో మాటలేమిటి'' అంటూ మొహం తిప్పుకొంది. రాణి ఆరోజు






చాలా ఖరీదైన డ్రెస్ వేసుకొంది. ఆ డ్రెస్ అందరినీ సూదంటురాయిలాగ ఆకర్షిస్తోంది. తలంటుకొన్న జుట్టుని అలాగే వదిలేసింది. అది భుజాలను, మెడను కప్పుతోంది.

హాలు కిక్కిరిసిపోయేలాగ జనం వచ్చారు. రాష్ట్రస్థాయి పోటీలవడంతో ఎక్కడెక్కడ నుంచో పాల్గొనడానికి అభ్యర్థులు వచ్చారు. విద్యకి ఆ సందడి చూస్తే ఆశ్చర్యంగాఉంది.

స్టేజి అందం, అలంకరణ మిన్నంటేలాగ ఉంది. ఘంటసాల ఫొటో స్టాండుకు పెట్టారు. ఆ తైలవర్ణ చిత్రానికి పైన పల్చటి తెర ఉంది. సభను ప్రారంభించి, ఉదయమే జ్యోతి వెలిగించారు.

క్రిక్కిరిసిన జనానికి ఉపన్యాసాలు ఎందుకు? పాటలు వినాలని వాళ్లు ఒకటే తొందరపడుతున్నారు. నూటనలభైమంది నుండి ఎంట్రీలు వచ్చాయని, నిబంధనలను గుర్తుంచుకొని పాడాలని వచ్చినవారికి సభవారు మనవిచేశారు.

సాయంత్రం సభకి కలెక్టరు అధ్యక్షత వహిస్తారని, ప్రైజులు నీటిపారుదల శాఖా మంత్రి ఇస్తారని చెప్పారు. పోటీలు అనుకొన్నట్లే ఉదయం ఎనిమిది గంటలకు అన్నారు. కానీ తొమ్మిదికి ప్రారంభించారు.

విద్యకి ఇరవై అయిదవ నెంబరువచ్చింది. అమ్మయ్య అనుకొంది. అంతమందిని చూశాక కొంత జంకుగానే ఉంది.

ఒక్కొక్కరిని పిలుస్తూ ఉంటే వాళ్లు వెళ్లి తమ పాట పాడివస్తున్నారు. చాలామంది మంచి పాటలు ఎన్నుకొని పాడుతున్నారు. ఏలూరు రాజమండ్రి, కాకినాడ, వైజాగ్‌నుండి పాడటానికి ఉత్సాహంగా వచ్చారు.

అంతమంది ఒకచోట సమావేశమవడం అద్భుతంగా, ఆనందంగా ఉంది. రాజమండ్రి నుండి వచ్చిన మగపిల్లలు ముగ్గురూ చాలా ఉత్సాహంగాఉన్నారు. వాళ్లకి ఇదివరకు ఢిల్లీలో, హైదరాబాద్‌లో ప్రైజులు వచ్చాయిట.

మెడికల్ కాలేజీనుండి, ఇంజనీరింగు కాలేజీనుండి ఎందరో వచ్చారు. ఎంప్లాయీస్

అయితే మరీ ఉత్సాహంగా వచ్చారు. బాంక్ ఉద్యోగినని కాకినాడాయన పరిచయం చేసుకొన్నాడు. సభకి ముందే వారందరూ ఒకచోట చేరి ఎనిమిది గంటలనుండీ కబుర్లు చెప్పుకొన్నారు.

విద్య ఫ్రెండ్స్, మురళి ఫ్రెండ్స్ ఒకచోట నిలబడి కబుర్లు చెప్పుకొంటున్నారు. సభ ప్రారంభమయ్యాక హాలులోకి వెళ్లవచ్చునని, వాళ్లు అందరూ తోట దగ్గర నిలబడి, కబుర్లు చెప్పుకొంటున్నారు. విద్యకి కాళ్లు నొప్పులు పుట్టి, క్రోటన్సు మొక్కల దగ్గర కూర్చుండిపోయింది. అందరూ ఆమెతోపాటు కూర్చున్నారు.

కొంచెం దూరంలో శిల్పం ఒకటి అందంగా నిలబడి ఉంది. ఆ పాలరాతి శిల్పం తిన్నెమీద కొందరు మగపిల్లలు కూర్చున్నారు. ఆ మగవాళ్లలో ఒకతను విద్యనే చూస్తూ ఉన్నాడు.

అతను తన పక్కనున్నతడిని చేతితో తడుతూ, "సురేష్! ఆ అమ్మాయి బావుందికదూ! ఆ విశాలమైన కళ్లు ఎంత ఆకర్షణీయంగా ఉన్నాయో? ఆ అమ్మాయి ఎవరోగానీ అందరూ అటే చూస్తున్నారు'' అని ఆసక్తిగా అడిగాడు.

సురేష్‌ది ఆ ఊరే. కాలేజీలో చదువుతున్నాడు. రాజశేఖరంకి మంచి స్నేహితుడు. వాళ్ల చిన్నప్పుడు రెండు కుటుంబాలు ఒకచోటే ఉండేవి. ఆ స్నేహమే ఇద్దరినీ కలిపింది. రాజశేఖరం మాటలకి సురేష్ అతడు చూపించినవైపు చూశాడు.

మాటలలోపడి విద్య వాళ్లు రావడాన్ని తను చూడకపోయినందుకు నొచ్చుకొని, రాజశేఖరం వైపు చూస్తూ వాళ్ల గురించి చెప్పాడు. విద్య పేరు అతడు చెప్పగానే టెన్త్‌లో రేంకు తెచ్చుకొన్న అని... రాజశేఖరం అనబోతూండగానే సురేష్ అవునన్నట్లు తల ఊపాడు.

రాజశేఖరంని ఆ అమ్మాయి బాగా ఆకర్షించిందని సురేష్‌కి తెలిసిపోయింది. అయినా తన మొహంగానీ తన కాలేజీ అబ్బాయిలు ఎందరో ఆ అమ్మాయిని ఆరాధనగా చూడటం తనకి తెలియదా?

విద్య కాసేపటికి ఎందుకో మాట్లాడుతూ తల ఎత్తి అటువైపు చూసింది. అక్కడ నిలబడిన అతడి చూపులు తనమీదే ఉండటం గమనించింది. విద్య తనవైపు చూడటంతో అతడు చూపులు మరల్చుకొన్నాడు.

అదీ కొంచెంసేపే. మళ్లీ ఆమె మరొకవైపు చూస్తూ మాట్లాడుతోంటే, మళ్లీ ఆమెవైపు చూస్తూ కూర్చున్నాడు. విద్యకి అంతవరకూ ఇలాంటి అనుభవంలేదు. స్కూలుకి, కాలేజీకి వెళ్లినప్పుడు ఎవరైనా కామెంటు చేసినా ఆమె పట్టించుకొనేదికాదు.

వాళ్లు ఆరాధనగా చూసినా కొంతసేపే. ఇలాగ చూపులు మరల్చుకోకుండా పట్టుబడటం జరగలేదు. ఎవరోలే నాకెందుకు అని అనుకొన్నది విద్య. పాటలపోటీ ప్రారంభమయ్యాక అతడి విషయం తాత్కాలికంగా మరిచిపోయింది.

ఆ అమ్మాయి మరిచిపోయినా అతడు మరిచిపోలేదు. వీళ్లు కూర్చున్న వైపుకి, పక్కవైపున ముందు వరుసలో కూర్చున్నాడు. అక్కడికి విద్యా వాళ్లు చక్కగా కన్పిస్తున్నారు. సురేష్ పాటలు వినడంలో నిమగ్నమైపోయాడు.

ఆడవాళ్ళలో పాల్గొనడానికి వచ్చినవాళ్ళు నలభైమంది వరకూ ఉంటారు. మగవాళ్ళే ఎక్కువ. వాళ్ళు ఒకరితో ఒకరు పోటీపడినట్లు పాడసాగారు. భయం అన్నది తెలియనివారు కొందరైతే, మైకు పట్టుకొని వంకరలు తిరిగిపోతున్నవారు కొందరు, భయంతో మధ్యలో మరిచిపోయేవారు కొందరు.

వినడానికి వచ్చిన శ్రోతలు కూడా తక్కువ వాళ్ళు కారు. ఏమాత్రం ఇష్టంలేని పాట మొదలైనా గోలపెట్టేవారు. ఆడపిల్లలు స్టేజి ఎక్కితే ఈలలే. వీళ్ళ గొడవకి భయపడి కొందరు ఆడపిల్లలు విరమించుకొన్నారు.

"అల్లరి చేస్తున్న వీళ్ళని తీసికెళ్ళి బలవంతంగా స్టేజిమీద నిలబెట్టి పాడమంటే




అప్పుడు తెలుస్తుంది వీళ్ళ ప్రతాపం" అని రాణి కాస్త కోపంగా, కాస్త చిరాకుగా వాళ్ళను చూస్తూ అంది.

నెమ్మదిగా మాట్లాడటం ఆ అమ్మాయికి తెలియని విషయం. "ఊ... నీ అధికారం వస్తే అలాగే చేద్దువుగాని తల్లీ! మీ నాన్న అధికారం చూసే ఇలాగ పేలుతున్నావు. ఇంక నువ్వు అధికార పీఠం ఎక్కితే... అంతే సంగతులు'' అంటూ ఎవరో పోకిరీ కుర్రవాడు గట్టిగానే జవాబు ఇచ్చాడు. అందరూ నవ్వేశారు.

రాణి పళ్ళు కొరుకుతూ అటువైపు తిరిగిపోయింది. వీళ్ళ గొడవ చూసి శైలజ, దీప్తి పాడలేమని గొడవ మొదలుపెట్టారు. రాణికి పిరికివాళ్ళంటే విసుగు. కొంతవరకూ చెప్పి చూసి, వాళ్ళు ఇంకా భయపడుతూంటే వదిలేసింది.

మగవాళ్ళు చాలా మంచిపాటలు ఎంచుకొన్నారు. నిజంగా ఘంటసాలే వచ్చి పాడుతున్నాడా అన్నట్లు పాడసాగారు. 'నా హృదయంలో నిదురించే చెలీ' అని ఒకరు,

'ప్రేమించి పెళ్ళిచేసుకో నీ మనసంతా హాయి నింపుకో అని మరొకరు,

'రాగమయీ... రావే అని ఒకరు.

'కుడిఎడమైతే పొరపాటు లేదోయి' అని వేరొకరు,

'నిన్న లేని అందమేదో నిదురలేచె ఎందుకో అని మరొకరు అపర ఘంటసాలల్లాగ పాడేశారు

రాణి నెంబరు పిలిచారు. రాణి అతి ఠీవిగా స్టేజిమీదికి వెళ్ళింది. స్టాండింగ్ మైకా, రన్నింగ్ మైకా ఎవరో స్టేజిమీద అడిగారు.

ఆ అమ్మాయి రన్నింగ్ మైకే తీసుకుంది. మైక్ టెస్టు అంటూ వన్, టూ, త్రీ అని అంది. ఎవరో కొంటెకుర్రవాడు "పాడు తల్లీ! ఆనక తీరిగ్గా అన్ని టెస్టులూ చేద్దువుగాని'' అంటూ కేకవేశాడు. దానితో అందరూ నవ్వేశారు.

రాణి అదేం లెక్కలేనట్టే పాట గురించి చెప్పింది. నేను పాడబోయే పాట 'వైశాలి' సినిమాలోనిది అంది. తర్వాత చిటిక వేస్తూ పాట మొదలుపెట్టింది. 'ప్రేమజీవన నాదం పంచమం ఈ వేదం' అంటూ గట్టిగా పాడటం మొదలుపెట్టింది. అందరూ ఒక్కసారి నిశ్శబ్దమైపోయారు.

రాణి చేత్తో తాళం వేస్తోంది. మరొకచేత్తో స్టయిలుగా మైకు తీసుకుంది. ఆ పాట వినగానే విద్య అన్న మొహంలోకి చూసింది. మురళి రాణిని చూస్తున్నాడు తదేకంగా. ఈ అమ్మాయి ఎంత అదృష్టవంతురాలు. ఇంట్లో, బయట అంతా అపురూపంగా చూస్తారు. అతడి మొహంలో ఈర్ష్య కదలాడింది.

"అన్నయ్యా!" విద్య నెమ్మదిగా చేత్తో తట్టి పిలిచింది. విద్యవైపు చూశాడు అతడు. విద్య ఏదో చెప్పబోతోందని గ్రహించి ఆమెవైపు వంగాడు. విద్య నెమ్మదిగా చెవిలో చెప్పింది. విన్నాక అతడు "చూద్దాం ఉండు'' అని కోపంగా అన్నాడు. ఈలోపు వెనకనుండి మరొక గ్రూపు అమ్మాయి విద్యని పిలిచింది.

గుసగుసగా "విద్యా! రాణి పాడే పాట చిత్ర పాడింది కదూ!" అని అంది. విద్య అవునన్నట్టు తల ఊపింది. అయితే మామూలుగా పాడనిచ్చారేమో అని అనేసింది. డ్యూయట్స్ ఎవరైనా పాడితే వెంటనే జాయింట్ సెక్రటరీ 'ఇది డ్యూయట్ సాంగ్. నోట్ చేసుకోండి' అంటూ 'ఎనౌన్సుమెంటు టుది జడ్జిస్' అని పిలిచి చెప్పేవాడు. ఈ పాట విషయంలో అలాంటిది ఏమీ జరగలేదు.

తర్వాత పదిమంది పాడాక విద్య నెంబరు వచ్చింది. విద్య నెమ్మదిగా తనని తాను నిగ్రహపరచుకొంటూ స్టేజిమీదికి వచ్చింది. విద్య 'ఆకులో ఆకునై పూవులో పూవునై, ఈ అడవి దాగిపోనా... ఎటులైనా ఇచటనే ఆగిపోనా!' అంటూ పాట ఎత్తుకొంది. విద్య మొదట రాగం ఎత్తుకొనేటప్పటికే అందరూ ఆసక్తిగా ఆ అమ్మాయివైపు చూసి వినసాగారు.

క్రేప్ సిల్కు నిలువు చారల పరికిణీ కట్టుకొంది. లైట్ ఆకుపచ్చ ఓణీ వేసుకొని, నలుపు

ఎంబ్రాయిడరీ జాకట్టు వేసుకొంది. పరికిణీమీ దనున్న చారలు మెరుస్తున్నాయి. రాజశేఖ రంకి ఆ అమ్మాయిని ఎంత చూసినా తనివి తీరడంలేదు. ఆమె పాట, సుకుమారమైన ఆమె గొంతుక అతడికేకాదు అందరికీ నచ్చాయి. అందరూ పాట అయ్యాక ఈలో కంలోకి వచ్చారు.

విద్యలో ఏదో తెలియని ఆకర్షణ అతన్ని పట్టి లాగుతోంది. తర్వాత ఒంటింగంటప్పుడు అతడి నెంబరు వచ్చింది. విద్య అతడిని చూసి 'బాప్‌రే! ఇతను కూడా పోటీకి వచ్చాడా' అనుకుంది.

అతడు స్టేజి ఎక్కి స్టేండింగ్ మైక్ తీసుకొ న్నాడు. ఒకచేత్తో మైకు పట్టుకొని, మరొకచేత్తో క్రాపు సవరించుకొన్నాడు. 'పాట కూడా సస్పె న్సు కాబోలు' ఎవరో అమ్మాయి సన్నగా కామెంటు చేసింది.

అతడు విద్యవైపు ఒకసారి చూశాడు. చూసి నేను పాడబోయే పాట... అని క్షణం ఆగాడు. 'ప్రేమనగర్' సినిమాలోది. పాడినవా రు అమరగాయకులు ఘంటసాల. ప్రస్తుతం ఇక్కడ మాత్రం నేను..." అంటూ నవ్వాడు.

ఎవరో వెనకనుండి 'మనసుగతి ఇంతే' అంటూ అరిచారు. అతడు నవ్వాడు. "ఆ పాట అవసరం నాకు లేదు'' అంటూ 'తేటతేట తెనుగులా... తెల్లవారి వెలుగులా... తేరులా, సెలయేరులా కదలి వచ్చింది కన్నె అప్సరా, వచ్చి నిలిచింది కనులముందరా!' అంటూ కొంటెగా పాడసాగాడు.

అతడి స్వరంలో గమకాలు వాటంతట అవే పలుకుతున్నాయి. ఒక చెయ్యి ఊపుతూ అత డు మృదుమధురంగా పాడాడు. "అదేమి టిరా! 'పునర్జన్మ'లో పాట పాడతానని చెప్పి, ప్రేమనగర్‌లోకి వెళ్ళిపోయావు'' అతడు వచ్చి తనపక్కన కూర్చోబోతోంటే సురేషు అడిగా డు. అతడు జవాబు చెప్పలేదు. నవ్వి ఊరుకొ న్నాడు.





మాధవి అనే రాజమండ్రి అమ్మాయి 'నీవు లేక వీణా పలుకలేనన్నదీ' అంటూ చక్కగా పాడింది. ఆ అమ్మాయికి ఒక ప్రైజు తప్పద నుకొన్నారు.

సాయంత్రం మూడు గంటలకి పాటల పోటీలు ముగిశాయి. జడ్జీలు గదిలోనుండి ఇవతలకి వచ్చారు. వాళ్ళల్లో ఒకరిని చూసి ఎవరో అరిచారు గట్టిగా 'చచ్చాంరో నాయనా! ఈయనని జడ్జీగా పెడితే సావిత్రి పాటకి ఫస్టుప్రైజే అని ఎవరో గట్టిగా అరిచారు.

'నీకు ఎలా తెలుసు?' మరొకరు అడిగారు

'ఇదివరకటి పోటీలో చూశానుకదా! సావి త్రి ఫాన్ ఆయన' అని ఎవరో అడగ్గా చెప్పాడు.

"నా మాట తప్పయితే చూడండి. సాయంత్రం ప్రైజుల విషయం తేలుతుంది కదా!" అని.

"అయ్యేం మాటలులెండి. ఆ పిల్ల బాగా పాడింది కనుక ఇయ్యవచ్చును'' మరొక పల్లెటూరాయన కొట్టిపారేశాడు.

విద్య, మురళి సాయంత్రం ఆరుగంటలవు తుండగా మీటింగ్‌కి బయలుదేరారు. పిల్లలు జాగ్రత్తగా వస్తారో, లేరోనని సారధి పక్క ఇంటి ఆయనని సాయంగా వెళ్ళమని కోరాడు.

ప్రైజు డిస్ట్రిబ్యూషన్‌కి జిల్లా జడ్జీగారిని పెట్టారు. అనుకొన్నవిధంగా మంత్రిగారు రా రని తెలియగానే ఈ ఏర్పాటు చేశారు. ప్రైజు లు ఉపన్యాసాల అనంతరం చెప్పారు. ఫస్టు ప్రైజు మాధవి, సెకండ్‌ప్రైజ్ రాణి, థర్డ్‌ప్రైజు విద్యాధరి, కన్సొలేషన్‌లు రెండూ 'మేఘమా, మేఘమా కురవకే' అని పాడిన అమ్మాయికి ఒకటి, నీలిమ అన్న అమ్మాయికి మరొక కన్సొలేషన్ ఇచ్చారు.

మగవాళ్ళ ప్రైజులలో ఫస్టు పూజాఫలంపా టకి, సెకండ్ రాజశేఖరం పాడిన 'తేటతేట తెలుగులా' పాటకి, థర్డు 'నా హృదయంలో నిదురించే చెలీ' పాటకి ఇచ్చారు. ప్రైజులు ప్రకటిస్తుంటే పెద్ద గొడవయిపోయింది.

"విద్యాధరి'' అని పేరు పిలవగానే విద్య స్టేజిమీదకి వెళ్ళింది. జడ్జిగారు ఆమెకి ప్రైజు

ఇవ్వబోతుంటే "ఒక్క నిముషం మాట్లాడే అవకాశం ఇస్తారా?" అని అడిగింది. జడ్జీగారు సరేనన్నారు.

"ఈ ప్రైజు నాకొద్దు. ఇక్కడ ఏదో న్యాయ నిర్ణయం జరుగుతుందని పాడటానికి పొరపాటున వచ్చాను. నన్ను మన్నించండి'' అంటూ దిగిపోబోయింది.

"అదేమిటమ్మా! నీ మాటలు మాకు అర్థమవలేదు. సరిగ్గా చెప్పు'' అని జడ్జీగారు పిలిచారు. కలెక్టరుగారు కుతూహలంగా విద్యవైపు చూస్తున్నారు.

"ఈ పోటీలు పెట్టేది కళాభిమానులను ఉత్సాహపరచడానికి, ప్రోత్సాహపరచడానికి అయితే ఆ ఆశయం నెరవేరడంలేదు. ఆశ్రిత పక్షపాతం, రాజకీయాలు కళల్లో చోటుచేసుకోవడం మన దురదృష్టం" విద్య ఆగింది. కలెక్టరుగారి నుదుటిమీద ఆలోచనగా ముడత పడింది.

"మిస్..." ఆయన ఆ అమ్మాయిని పిలువబోతూ ఆగారు.

"విద్యాధరి'' విద్య కంఠం ఖంగున మోగింది.

"మీరు చెప్పదలచుకొన్నదేదో డొంకతిరుగుడు లేకుండా చెప్పాలి'' కలెక్టరుగారు గంభీరంగా అన్నారు.

"పాటలకి విధించిన నియమాలు మీకందరికీ తెలుసును. ఈ పోటీలో ఘంటసాల, సుశీలల పాటలు మాత్రమే పాడాలని రూల్ పెట్టారు. కానీ వచ్చిన జడ్జీలకుగాని, పోటీలను నిర్వహిస్తున్న సంస్థవారికి గానీ ఎవరి పాటలు ఏవో తెలిసినట్లు లేదు'' విద్య ఒక్కక్షణం ఆగింది.

ఆ అమ్మాయి మాటలకి సంస్థవారి, జడ్జీల మొహాలు ఎర్రబడ్డాయి. ఈ అమ్మాయి మమ్మల్ని అనేపాటిదా అన్న చిరాకు వారిలో స్పష్టంగా కన్పించింది.

"మీరు సెకండ్ ప్రైజు ఇచ్చిన పాట 'ప్రేమ జీవననాదం' 'వైశాలి' సినిమాలో చిత్ర పాడిన పాట. ఇంక కన్సొలేషన్ ప్రైజు ఇచ్చిన 'మేఘమా, మేఘమా' పాట శ్రీమతి జానకిగారు పాడిన 'మంచుపల్లకి'లోని పాట.

"ఇంక మగవారికిచ్చిన కాన్సొలేషన్‌లు కూడా తప్పే. బాలమురళీకృష్ణగారు, బాలసుబ్రహ్మణ్యంగారు పాడిన పాటలు అవి. వాటికి ప్రైజులివ్వడం న్యాయమా? విద్య సూటిగా వాళ్ళందరినీ చూస్తూ అంది.

"నీకు ఎలాగో ప్రైజు వచ్చింది కదమ్మాయి. ఈ గొడవంతా ఎందుకు?" ఎవరో వేదికమీదవారు అనబోయారు. కలెక్టరుగారు వారిస్తున్నట్లు ఒక చూపు చూశారు.

"సక్రమంగా లేని ఈ ప్రైజు నాకు వద్దు'' అంటూ విద్య వేదిక దిగిపోయింది.

రాజశేఖరం అప్పుడు లేచి నిలబడ్డాడు. ఒక ఆడపిల్ల ధైర్యంగా నిలబడి మాట్లాడినప్పుడు తాము మౌనంగా కూర్చోవడం అర్థంలేని పని.

అతడు ఏదో చెప్పదలచుకొన్నాడని గ్రహించి వేదికమీదికి రమ్మన్నారు. తామందరూ దూరప్రాంతాలనుండి పోటీలలో పాల్గొవాలని వచ్చామని, కానీ న్యాయమైనవిధంగా ప్రైజులు ఇవ్వడం జరగలేదని అతను ప్రారంభించాడు. "రాగమయీ రావే పాట చాలా బాగా పాడారు, అలాగే మరొక మిత్రుడు 'దేవదాసు'లోని 'కుడిఎడమైతే' చాలా బాగా పాడారు. కాని, వాళ్ళకి ప్రైజులు లేవు. హైదరాబాద్‌లో ఫస్టుప్రైజు తెచ్చుకొన్న వ్యక్తికి ఇక్కడ ప్రైజు లేదు. మధ్యలో తప్పు పాడినవాళ్ళకి ప్రైజులిచ్చారు. ఏమిటీ అన్యాయం? సక్రమంగా పోటీలు నిర్వహించలేనివాళ్ళు మౌనంగా ఉండిపోవాలి. రాష్ట్రస్థాయిలో పోటీలు అని గొప్పగా పిలిచి, ఇలాగ చేయడమేమిటి?

న్యాయనిర్ణయం సరిగా లేదుకాబట్టి నా ప్రైజును నేను తిరస్కరిస్తున్నాను. అంతేకాదు, ఈనాటి యువతరం పూనుకొని, ఇలాంటి అన్యాయాలను ఖండించాలి'' అతడు ఆవేశంగా వేదిక దిగి వచ్చేశాడు.

తర్వాత ఆ ఊపులో చాలామందే గట్టిగా,

నిర్మొహమాటంగా మాట్లాడసాగారు.

కలెక్టరుగారు సంస్థవారిని పిలిచి ఎందుకు ఇలాగ జరిగిందని మందలించారు. మరొక సారి అలాగ జరగకుండా చూస్తానని, చెప్పినా ఎవ్వరూ ప్రైజులు తీసుకొందుకు ముందుకు రాలేదు.

ఎవరూ తీసుకోనప్పుడు తాము తీసు కొంటే బాగుండదని ఫస్టుప్రైజు తీసుకొని, గొప్పగా తమవాళ్ళకి చూపించినవారు కూడా తమ ప్రైజులు వదిలేశారు. అందరూ నిర్వా హకులని సూటిపోటి మాటలనసాగారు.

ఆనాటి పరిచయం తర్వాత ఇన్నాళ్ళకి మళ్ళీ రాజశేఖరం కన్పించడం విద్యకి ఆశ్చ ర్యంగా తోచింది. రాత్రి పన్నెండు గంటలయి నట్లు గంటలు మోగడంతో పడుకొందుకుపక్ర మించింది.

చెవిలో రాజశేఖరం స్వరం 'మన ఈ కలయిక భగవంతుని నిర్ణయంలాగుంది' అంటున్నట్లే విన్పించసాగింది. విద్య మాట విననట్లు మనసు అల్లరి చేయసాగింది.

చదువు నా మొదటి ధ్యేయం. ఇటువంటివా టికి నేను చోటు ఇవ్వకూడదనుకొంటూ పడు కొంది.

పదిరోజుల తర్వాత కాలేజీకి వెళ్ళిన విద్యకి ప్రిన్సిపాల్ రూం దగ్గర కూర్చున్న రాణి, వాళ్ళ అన్నయ్య సుదర్శన నాయుడు కన్పించారు. వాళ్ళని చూడగానే విద్య వారి దగ్గరకు వెళ్ళి పలకరించింది.

రాణికి అక్కడ కాలేజీలో చదవాలన్పించలే దని, ఆమె చిరాకుగా ఉండటం చూసి తండ్రి ఇక్కడ కాలేజీలో టి.సి. మీద చేర్చమన్నారని, అన్నయ్య చెప్పాడు. వాళ్ళు ఇక్కడికి రాణితో వచ్చేశారుట.

విద్యకిదంతా నమ్మలేనివిధంగా తోచింది. తండ్రి కారుపట్టుకెళ్ళమనగానే సుదర్శన నా యుడి మొహం చేటంత అయిందిట. ప్రాక్టీసు ఇక్కడికి మార్చుకొన్నారుట. విద్య అభిమా నంగా రాణిని పలకరించింది.

విద్యను, విద్య స్నేహితులను చూస్తే రాణి కి చిన్న అసూయలాంటిది కలగసాగింది. లెక్చరర్లందరూ విద్యను ప్రేమగా, గౌరవంగా చూడటం ఆమె గమనించింది.

"విద్యా! ఎవరా అమ్మాయి?" అంటూ అందరూ విద్యనడిగారు. తన స్నేహితురాలని విద్య చెప్పింది.

విద్య లేడీస్ రిప్రజెంటేటివ్ అనీ, ప్రిన్సిపా ల్‌గారు విద్యంటే మక్కువ చూపిస్తారనీ ఒక్కొక్క విషయమే రాణికి తెలిసింది. ఇదివ రకైతే అందరూ ఆమెను ఒక దేవతగా చూసేవా రు. ఇక్కడ ఆ గుర్తింపులేదు. తండ్రి అధికారా న్ని లెక్కచేసేవారు లేరు.

ఒకసారి ఏదో సందర్భంలో విద్య స్నే హితురాలు స్నేహలత అననే అనేసింది, "ఎం.ఎల్.ఏ.లు, ఎం.పి.లు అంటే ఎవరికి గొప్ప? వాళ్ళు ప్రజలకు సేవకులు మాత్రమే. అది కూడా ఒక ఉద్యోగంలాంటిదే. ఇంకా నిజం మాట్లాడాలంటే మిగిలిన ఉద్యోగాలకి రిటైరయ్యేవరకూ గారంటీ ఉంది. వీరినిమా త్రం ప్రజలు ఎప్పుడు పీకేస్తారో తెలియదు'' అని.

అందరూ నవ్వేశారు.

రాణికి ఆమె మాటలు అసహనాన్ని కలి గించాయి. "చూస్తాను అదేమిటో' అనుకొంది మనసులో. ఆలస్యంగా చేరడంవలన వెనుక సీటులో మాత్రమే ఖాళీ ఉండటంవలన రాణి అక్కడే కూర్చుంది. ఇక్కడ ఎంతసేపూ తెలి వైన, చురుకైన అమ్మాయిలకే అందరూ గౌ రవం ఇస్తారని గ్రహించింది.

విద్యను రోజూ ఎలాగో ఒకలాగ చూస్తూనే ఉంటాడు రాజశేఖరం. ఒక్కొక్కసారి కాలేజీ కాంపస్ బయట వేచి ఉంటాడు. కొద్ది అడుగు లు నడుస్తూ మాట్లాడినా అతడికి తృప్తే.

విద్యతో అతడి చనువు చూసి స్నేహితురా ళ్ళు ఆటలు పట్టించడం మొదలుపెట్టారు. 'విద్యా' అని అతను ఎప్పుడు పిలవడం ప్రారంభించాడో కూడా విద్యకి గుర్తులేదు.




హోటల్‌లో అతడు ఏవో వాళ్ళ కాలేజీ విషయా లు చెపుతాడు. విద్య మౌనంగా వింటుంది. రెండు రోజులకి ఒకసారైనా అతడు విద్యను హోటల్‌కి రమ్మంటాడు. రోజూ ఇదేం బాధని విద్య అన్నా పట్టించుకోడు.

"కాసేపు నాతో కలిసి కాఫీ తాగడం కూడా మీకు ఇష్టంలేదా? అలాగైతే నేను నిరాహార దీక్షప్రారంభిస్తాను'' అని నవ్వుతూ అంటాడు. విద్య అతడిని మౌనంగా చూస్తుంది. అతను నవ్వుతోంటే విద్యకిష్టం. పచ్చటి అతని చెక్కిళ్ళు కాంతివంతమవుతాయి. సూదంటురాయి లాంటి అతడి కళ్ళు నవ్వితే మరింత కాంతితో మెరుస్తాయి.

"విద్యా! మీ ఇంజనీరింగ్ ఫ్రెండ్ కనిపించాడే!" అంటూ స్నేహలత, హిమబిందు వెక్కిరిస్తారు. "మీలాగే అతను కూడా ఒక స్నేహితుడు. అంతే'' అని విద్య అన్నా వాళ్ళు ఒప్పుకోరు. చిలిపిగా నవ్వుతారు. "అంతేనా, అంతేనా'' అంటూ రెట్టిస్తారు. అంతకంటే ఏంలేదు అని విద్య కోపంగా వెళ్ళిపోతుంది. వాళ్ళు విద్య చేతిని పట్టుకొని ఆపేస్తారు.

"ఈరోజు మీరు మా ఇంటికి రండి'' ఒకరోజు విద్య రాజశేఖరంను అడిగింది. ఎందుకో అతన్ని తండ్రికి పరిచయం చేయాలన్పించింది.

"అమ్మయ్య ఇన్నాళ్ళకైనా ఇంటికి ఆహ్వానించారు'' అంటూ ఆమెను అనుసరించాడు. విద్య అతడు ఇప్పుడు ఎందుకులెండి అంటాడనుకొంది. అలాగ అతడు బయలుదేరడం చూసి విస్తుపోయింది.

"ఏమిటలాగ చూస్తారు? సిగ్గులేకుండా పిలవగానే వచ్చేస్తున్నాననా? ఇంత మంచి, తెలివైన అమ్మాయిని కన్న తల్లిదండ్రులను చూడాలని క్యూరియాసిటీ'' అతను నవ్వుతూ అనేశాడు.

రాజశేఖరం విద్య తల్లిదండ్రులను చూసి ఎంత ఆనందించాడో, వాళ్ళూ అతన్ని చూసి అంతే ఆనందించారు. అతడి రూపం, ఠీవి, ప్రవర్తన వారికెంతో నచ్చింది. పెద్ద చదువు చదువుతున్నానన్న గర్వం మచ్చుకైనా లేని అతడిని వాళ్ళు విస్మయంగా చూశారు. ఈనాటి యువతరం భేషజం వాళ్ళకు తెలియనిది కాదు.

సారధితో అతడు చాలాసేపు మాట్లాడాడు. విద్య అతనికి కాఫీ కలిపి తెచ్చింది. విద్య ఇల్లు చూపిస్తోంటే అతడు నెమ్మదిగా అన్నాడు, "అమ్మయ్య! ఇన్నాళ్ళకి మీనుండి కాఫీ లభించింది. ఇంక చూడండి వారానికి రెండు సార్లయినా ఎలా వసూలుచేస్తానో?" విద్య అతని మాటలకి నవ్వేసింది.

చదువు విద్యకి పంచప్రాణాలని అతడు గ్రహించాడు. అందుకే ఆదివారం మాత్రమే ఇంటికి వచ్చేవాడు. మిగిలిన రోజులలో ఎక్కడో అక్కడ ఆమెను చూడటమే. రోజులు ఎలాగ గడుస్తున్నాయో అతడికి తెలియడంలేదు. అతడి కాలేజీలో కొద్దిమందికి మాత్రమే ఈ విషయాలు తెలుసును.

ఒక స్టూడెంటుని లెక్చరర్ కొట్టారని మెన్స్ కాలేజీ అబ్బాయిలు స్ట్రయికు ప్రారంభించారు. అతడు తనతో అవమానకరంగా మాట్లాడాడని లెక్చరర్ వాదన. మూడవరోజు వచ్చేటప్పటికి మిగిలిన కాలేజీ స్టూడెంట్సు కూడా స్ట్రయిక్ చేయాలని వీళ్ళు పట్టుపట్టారు.

వారు అలాగే తమ మద్దత్తునిస్తామన్నారు. విద్య కాలేజీ యూనియన్ మీటింగ్ పెట్టింది. కాలేజీ సెక్రటరీ, ప్రెసిడెంటు కూడా ధైర్యమున్నవాళ్ళు, చదువంటే ఆసక్తి ఉన్నవాళ్ళు ప్రిన్సిపాల్ సులోచనగారు తమను ఎంత అభిమానంగా చూస్తారో, అవసరమైతే అంతగా శిక్షిస్తారని కూడా వాళ్ళకి తెలుసు.

మీటింగ్‌లో విద్యను ఏం చేద్దామని అడిగారు. అనుచితంగా ప్రవర్తిస్తే శిక్షించే హక్కు లెక్చరర్లకి ఎప్పుడూ ఉంటుంది. పైగా ఆ అబ్బాయి పొగరుమోతు, గర్విష్టి అని తెలిసింది. అలాంటివాళ్ళ గొడవలోకి మనం ఎందుకు వెళ్ళాలి? ఇప్పుడు వీళ్ళకి మద్దత్తునివ్వడం అనుచితమన్పిస్తోంది'' అని విద్య తన

అభిప్రాయం చెప్పింది. ఏ చిన్న కారణం కన్పించినా స్ట్రయిక్ చేయడం మంచిదికాదని చెప్పింది.

ప్రిన్సిపాల్ ఇలాంటివాటిని మెచ్చరని సెక్రటరీకి తెలుసును. అందుకే అందరూ కలిసి స్ట్రయిక్‌లో పాల్గొనకూడదని నిర్ణయించుకొన్నారు. ఆ కాలేజీ చరిత్రలోనే అది నూతన అధ్యాయం. ప్రిన్సిపాల్‌గారు వాళ్ళ నిర్ణయం తెలుసుకొని ఆనందించారు.

మర్నాడే ఆ కాలేజీవాళ్ళు వీళ్ళని కలిశారు. విద్యార్థులను శిక్షించే హక్కు లెక్చరర్లకి ఎప్పుడూ ఉంటుందనీ, తాము ఇటువంటివాటిని బలపరచమనీ కాలేజీ సెక్రటరీ ఖచ్చితంగా చెప్పేసింది. వాళ్ళు నచ్చచెబుదామని ఎంతో ప్రయత్నించారు. వీలవలేదు.

ఈ కాలేజీవాళ్ళు స్ట్రయిక్ మానేయడంతో గర్ల్స్ హైస్కూలు వాళ్ళు మానేశారు. దానితో మరొక సంస్కృత పాఠశాలవాళ్ళు మానేశారు. ఇది తెలుసుకున్నాక మెన్స్ కాలేజీవాళ్ళకి ఒళ్ళు మండిపోయింది.

కృష్ణమోహన్‌ను, మరికొంతమందిని తీసికొని వాళ్ళ సెక్రటరీ విద్యావాళ్ళ కాలేజీ దగ్గర కాపలాకాశాడు. సెక్రటరీ నీలిమ సైకిలు మీద ఫ్రెండ్స్‌తో కలిసి వస్తోంది. వాళ్ళు ఆమెను అక్కడే ఆపేశారు. లోపలకి వెళ్ళనీయమని పేచీ పెట్టారు. కృష్ణమోహన్ డిగ్రీ ఫైనల్ ఇయర్ చదువుతున్నాడు. స్ట్రయిక్‌కి కారణమైన అబ్బాయికి ప్రాణస్నేహితుడు.

ఇది తన ప్రెస్టేజి ఇష్యూగా ఆ అబ్బాయి తీసుకోవడంతో కృష్ణమోహన్ అందరినీ కూడగట్టుకోవడానికి వచ్చాడు. ముందు నెమ్మదిగా బతిమాలుతూ చెప్పాడు. నీలిమ మొండికేయడంతో తమ బలం చూపక తప్పలేదు అతనికి.

నీలిమ, కొంతమంది అమ్మాయిలు గేటు దగ్గరే ఆగిపోవడం చూసి నెమ్మదిగా అందరూ వచ్చినవాళ్ళు వెనక ఆగిపోయారు. నీలిమ ఏం చెప్పినా వాళ్ళు అర్థంచేసుకోవడంలేదు.

ఈలోపు విద్య, స్నేహలత వస్తున్నారు.

నీలిమ వెనక్కి తిరిగి సౌంజ్ఞ చేసింది. దానితో విద్య స్పీడు పెంచింది. లూనా దూసుకొని రావడంతో గుంపు చెదిరిపోయింది. వాళ్ళు విడిపోవడం చూసి కొందరు విద్యార్థినులు కాలేజీ లోపలకి వెళ్ళిపోయారు.

విద్య బండితో లోపలకి వెళ్ళిపోతుందని వాళ్ళు అనుకొన్నారు. సెక్రటరీ చేత స్ట్రయిక్ నోటీసు ఇప్పిస్తే అందరూ చచ్చినట్లు చేస్తారని వాళ్ళ ఉద్దేశ్యం. కానీ విద్య వెనక్కి వచ్చి లూనా ఆపి స్నేహలత చేతికిచ్చింది.

తమ కాలేజీ యూనియన్‌కి స్వయం నిర్ణయం చేసుకొనే హక్కు ఉందని, దానిని ఎవరూ కాదనలేరని, బలవంతంగా తమచేత స్ట్రయిక్ చేయించాలనుకోవడం అవివేకమని చెప్పింది.

రేపు మీకు ఏదైనా జరిగినప్పుడు మా సహకారం అవసరం లేదా?" అని కృష్ణమోహన్, కాలేజీ సెక్రటరీవాళ్ళని అడిగాడు.

నీలిమ గట్టిగానే సమాధానమిచ్చింది. తమకి ఏదైనా అవసరం వచ్చినప్పుడు తమ శక్తిమీదే తాము నిలబడతామని, సామరస్యంగానే విషయాన్ని పరిష్కరించుకొంటామని చెప్పింది.

వాళ్ళు ఏది ఏమైనాసరే వెళ్ళనీయమన్నారు.

దానితో విద్యకి కోపం వచ్చింది. ఏదో ఒక వంకపెట్టి కాలేజీని, క్లాసులను వదలాలనుకొనేవారితో మాటలు అనవసరమనుకొంది. చీటికీమాటికీ అకారణంగా చేసే స్ట్రయిక్‌లకి విలువ ఉండదని, తమను లోపలకి వెళ్ళనీయకపోతే పోలీసులకి రిపోర్టు చేయవలసి వస్తుందని, అంతవరకూ వెళ్ళడం మంచిదికాదని చెప్పి, నీలిమతో కలిసి లోపలికి వెళ్ళిపోయింది.

నీలిమ చేతిని పట్టుకొని ధైర్యంగా లోపలకి వెళుతున్న విద్యను చూస్తే వాళ్ళకి ఒళ్ళు మండిపోయింది. విద్య మాటల ప్రభావంవలన అందరూ చక్కగా లోపలకి వెళ్ళిపోయారు.




వాళ్ళకి అక్కడినుంచి కదలక తప్పలేదు.

అయితే కొందరు విద్యార్థినులనైనా కూడగట్టుకొని సమ్మె చేయించాలని వాళ్ళు విశ్వప్రయత్నం చేశారు. ఆ పనిలోనే కృష్ణమోహన్ రాణిని కలిశాడు.

ఎం.ఎల్.ఏ.గారు తన తండ్రికి స్నేహితులని, తామంతా ఒకటేనని, రాణి ఎలాగైనా తమకి మద్దత్తునివ్వాలని కోరాడు. రాణికి కృష్ణమోహన్‌ను చూస్తే సదభిప్రాయమే కలిగింది. చేతికి గొలుసు, మెడలో గొలుసు, వేళ్ళకి రెండు ఉంగరాలు అతడి స్థితిని తెలియజేస్తున్నాయి.

కృష్ణమోహన్ వెనకాల ఎప్పుడూ పాతికమంది ఫ్రెండ్స్ ఉంటూనే ఉంటారు. అతడిచ్చే సినిమాల, టిఫిన్ల మహత్మ్యం అది. రాణికి ఇంతమంది వచ్చి తనను అర్థించడం చూసి గర్వపడింది. తన శక్తిమీద వాళ్ళకి ఉన్న నమ్మకాన్ని వమ్ముచేయకూడదనుకొంది.

తన కాలేజీనుండి నోటీసు తీసుకొని వస్తానని వాళ్ళకి చెప్పింది. క్లాసుకి వెళ్ళి క్లాసు రిప్రజెంటేటివ్‌ను కలిసింది. విషయం తమకి అనవసరమని, సాటి విద్యార్థులు స్ట్రయిక్ చేస్తున్నప్పుడు పాల్గొనడం తమ విధని వాదించింది. కొందరు రాణి వాదనను ఆసక్తిగా విన్నారు.

రిప్రజెంటేటివ్‌కి రాణి అంటే అసహ్యం వేసింది. ఊరందరిదీ ఒకదారి, ఉలిపికట్టది ఒకదారన్నట్టు పదిమందిని పట్టుకొని ఘాట్లాడుతున్న రాణిని చిరాకుగా చూసింది. సెక్రటరీతో చెప్పగానే 'ఆమె మరో నాలుగు చివాట్లు వేసి, మొత్తం పిల్లలను పిలిచి, విషయం చెప్పింది.

స్టూడెంట్లందరూ సెక్రటరీ మాటకే కట్టుబడతామని చెప్పేశారు. విషయం ప్రిన్సిపాల్‌గారి వరకూ వెళ్ళి, రాణిని పిలిచి కాలేజీలో గ్రూపులు లేవదీయవద్దని మందలించారు. కాలేజీ ప్రెసిడెంటు, సెక్రటరీ విద్యకి ఇలాంటి స్నేహితురాలేమిటని ఎగతాళి చేశారు.

అనుకోని ఈ విషయానికి రాణికి తిక్కరేగింది. అందరూ ఒకటేమాటపై ఉంటారని ఆమె అనుకోలేదు. పూర్వం తన ఫ్రెండ్స్‌లాగ తను ఇచ్చే కానుకలకి లొంగుతారనుకొంది. నీలిమ అంటే విద్యార్థినులకి ఉన్న ఆరాధనని గ్రహించలేకపోయింది.

చివరికి విద్య కూడా రాణి అలాగ ప్రవర్తించినందుకు సిగ్గుపడింది. ఏదిఏమైతేనేం స్టూడెంట్లు సమ్మె మానుకొని క్లాసులకి హాజరయ్యారు. అందరికీ మహిళా కళాశాలంటే గౌరవం పెరిగింది. గొడవలు రాకుండా సమస్య పరిష్కరించారని అనుకొన్నారు.

అధికారం చేతిలో ఉంటేనే స్టూడెంట్లు లొంగుతారని రాణి అనుకొంది. మళ్ళీసారి ఎన్నికలలో సెక్రటరీగా పోటీ చేయాలనుకొంది. కొందరు విద్య సెక్రటరీగా ఉంటుందని రాణిని లేడీస్ రిప్రజెంటేటివ్‌గా ఉండమన్నారు.

ఆమె వదిలేసిన పదవి నాకు అక్కరలేదంది. దానితో విద్యకి, ఆమెకి పోటీ ఏర్పడింది. కృష్ణమోహన్, అతడి కాలేజీవాళ్ళు రాణిని ప్రోత్సహించారు. తామే ఆమె తరఫున కాన్వాసింగ్ చేశారు. డబ్బు ఖర్చుపెట్టినా ఫలితం దక్కలేదు. విద్యే గెలిచింది.

దానితో రాణికి, విద్యకి మధ్య మళ్ళీ స్పర్థలు పెరిగాయి. ఒకసారి చూడకుండా ప్యూన్ వచ్చి ఢీకొట్టాడని, రాణి అతడిని లెంపకాయ కొట్టింది. అది పెద్ద గొడవ అయిపోయింది. వాడు మేడమీదనుండి వస్తూండడంవలన, అది దారిపక్కకి తిరగడంవలన రాణి కన్పించలేదు. దానికి ఆమె అలాగ ప్రవర్తించడం తప్పని వాడి గొడవ.

విద్య రాణిని నువ్వు ఎలాగ చూసుకోలేదో, వాడూ అలాగే చూసుకోలేదు. దీనికి గొడవ ఏమిటి, క్షమార్పణ చెప్పెయ్యి అంది. ఒక ప్యూనుకి తాను తల వంచడమా అని రాణి అహంకారం. విషయం ప్రిన్సిపాల్‌గారి వరకూ వెళ్ళింది. ఆవిడ ఇలాంటి గొడవలు మరొకసారి తీసికొని వస్తే కాలేజీనుండి టి.సి. ఇచ్చి,

పంపిస్తానని హెచ్చరించింది. మొత్తానికి రాణి క్షమార్పణ చెప్పకపోవడం కష్టంగా ఉన్నా, ప్రిన్సిపాల్‌వలన వాళ్ళు ఊరుకొన్నారు.

విద్యంటే ప్యూన్లదగ్గరనుండీ అభిమానమే. ఎదుటి వ్యక్తిని ఆ అమ్మాయి మనిషిగా గౌరవిస్తుంది అని అంటారు. ఈ పరిస్థితుల్లో విద్యకి భువనేశ్వరిదేవి పరిచయం అయింది.

భువనేశ్వరి దేవి ఆ పట్టణంలోని ధనవంతులలో ఒకర్తి. దారిద్ర్యాన్ని భరించలేక అందం, తెలివి, చదువు ఉన్న ఆమె ఓ హెూటల్ ప్రొప్రయిటర్ రంగారావును వివాహం చేసుకుంది. రెండవ పెళ్ళి అవడంతో మొదటిభార్య పిల్లలు ఈమెని పట్టించుకోలేదు.

అంత వయస్సు వచ్చాక మళ్ళీ వివాహమేమిటని వాళ్ళు తండ్రిని నిలదీశారు. కానీ భువనేశ్వరీదేవి సౌందర్యానికి లొంగిపోయి అందరినీ కాదని ఆయన పెళ్ళిచేసుకొని పెళ్ళయిన రెండేళ్ళకే కారు ఏక్సిడెంట్‌లో పోయాడు.

రంగారావుగారి భార్యగా అతని ఆస్తికి వారసురాలు కాగలిగింది కానీ అతడి బిడ్డలకి తల్లి కాలేకపోయింది.

ఆస్తి పంచుకొని అందరూ దూరంవెళ్ళిపోయారు. ఒక సినిమాహాలు, హెూటల్, పెద్ద మేడ, కొంత క్యాషు ఆవిడవంతు వచ్చాయి. సుఖం లేకపోగా బంధువుల సూటిపోటిమాటలు, సంఘంలో చిన్నచూపు, దానితో ఆవిడ తాగుడుని ఆశ్రయించింది.

ఒకసారి అలాగ త్రాగి పడిపోబోతున్న సమయంలోనే విద్య ఆవిడను కలుసుకొంది. డ్రైవర్‌ను మరొక పనిమీద పంపి ఉండటంవలన ఆవిడ స్వయంగా కారు నడుపుకొంటూ బయలుదేరింది. బట్టలషాపులోకి వెళ్ళి, వస్తూ స్పృహలేక పడిపోయింది. విద్య బట్టలు కొనుక్కొనివస్తూ ఆమెను చూసింది.

మరొకరిని పిలిచి బతిమాలి, ఎలాగో ఆమె ఇల్లు కనుక్కొని, చేర్చింది. ఆవిడను నౌకర్లు విసుక్కొంటూ లోపలకి తీసికెళ్ళారు. ఏదేదో గొణుక్కుంటూ, నవ్వుకొంటూ, ఏమాత్రం తెలివిలేకుండా మంచంమీద పడిపోయిన ఆవిడనుచూస్తే విద్యకి చాలా బాధగా అన్పించింది.

మర్నాడు కాలేజీలో ప్యూను స్లిప్పు ఇచ్చి ప్రిన్సిపాల్‌గారు రమ్మంటున్నారంటే విద్య క్లాసులోనుండి ఇవతలకి వచ్చింది. ప్రిన్సిపాల్ గారి ఎదురుగా భువనేశ్వరి కూర్చుని ఉంది. ప్రిన్సిపాల్‌గారు ఆవిడ నిన్ను కలవాలని వచ్చారు విద్యా అంటూ చెప్పారు. ఆవిడకి, విద్యకి ఎలా పరిచయం కలిగిందో ప్రిన్సిపాల్ గారికి అర్థమవలేదు. విద్య మౌనంగా భువనేశ్వరిని అనుసరించింది.

ప్రిన్సిపాల్‌గారు భువనేశ్వరికి ఇచ్చిన గౌరవం విద్య చూసింది. భువనేశ్వరి అందం, ఠీవి విద్యని ఆకర్షించాయి. కానీ ఆవిడ బలహీనతను విద్య క్షమించలేకపోయింది. కారులో మౌనంగా కూర్చున్న విద్యను ఆవిడ క్రీగంట చూసింది. పసిపిల్ల కదా, నన్ను చూసి అసహ్యపడుతోంది అని గుంభనగా నవ్వుకొంది. కానీ విద్య కళ్ళల్లోని అసహ్యాన్ని ఆమె భరించలేకపోయింది. విద్య అందరిలాగ వెళ్ళిపోకుండా తనని కాపాడినందుకు ఆవిడ ఇంటికి వెళ్ళాక కృతజ్ఞతలు చెప్పింది. నౌకరుని పిలిచి కాఫీ టిఫిన్ తెమ్మంది.

విద్య ఏదీ వద్దని తిరస్కరించింది. మరొకసారి తాగి రోడ్డుమీద పడిపోతే కాపాడటానికి తాను ఉండకపోవచ్చునని, చేసేపని ఏదో గౌరవంగా ఇంట్లో చేయమంది.

ఒక చిన్న పిల్ల తనకి బుద్ధిచెప్పడమా? భువనేశ్వరికి కోపం వచ్చింది.

"విద్యా! హద్దుమీరుతున్నావు. మీ ప్రిన్సిపాల్‌గారన్నా, కాలేజీ అన్నా నాకు అభిమానం. అందుకని నిన్ను క్షమిస్తున్నాను'' ఆవిడ ఆగ్రహాన్ని అణచుకొంటూ అంది.

"నేను కాదు హద్దు దాటింది మీరు. స్త్రీ సహజమైన హద్దులు మీరు దాటుతున్నారు'' విద్య నిర్భయంగా అంది.

ఆవిడ మాట్లాడలేని దానిలాగ "విద్యా..."




అంది.

"అవును. రాష్ట్రంలోని మహిళలందరూ సారా వద్దని వ్యతిరేకించారు.

మహిళల శక్తి ఏమిటో దేశానికి రుచిచూపించారు. మీరు మాత్రం అదేమి పట్టించుకోకుండా హాయిగా తాగి రోడ్డున పడిపోతున్నారు'' విద్య ఏమాత్రం జంకకుండా ఒక్కొక్క మాటా అనేసింది.

భువనేశ్వరీదేవి ఆ అమ్మాయిని వారించబోయారుగానీ విద్య తన అభిప్రాయం, ఏహ్యత ప్రదర్శించడంలో వెనుకంజవేయలేదు.

"విద్యా... ఆవిడ రోషంగా, కోపంగా పిలిచింది. నువ్వు అతి చనువు చూపిస్తున్నావు. నాకు ఉన్న బాధలు నీకు ఏం తెలుసును?" ఆవిడ చిరాకుగా అంది.

"బాధలు... ఈ ప్రపంచంలో బాధలు లేనిదెవరికి? నాకు లేవా? చదవాలని ఎంతో కోరిక ఉండి ఇంజనీరింగ్ సీటు వచ్చినా, అది చదవగల స్థోమతునివ్వలేదు భగవంతుడు. మా నాన్నగారు అనారోగ్యపడ్డారు. అయితే ఇవి మరిచిపోవాలంటే నేనూ మీలాగ చెయ్యాలా?" విద్య నిలదీసింది.

భువనేశ్వరీదేవి ఏమీ మాట్లాడలేకపోయింది.

"మీలో మార్పు వచ్చేవరకూ నేను మీ ఇంట్లో పచ్చిమంచినీళ్ళు తాగలేను. నాతో సన్నిహితంగా ఉండాలని ఉందన్నారు కనుక ఇవన్నీ చెప్పాను. వస్తాను'' విద్య చెప్పేసి వెళ్ళిపోయింది. వెళుతున్న విద్యని చూడటం తప్ప ఏమీ చేయలేకపోయిందామె.

విద్య మాటలు ఆవిడని ఇంట్లో నిలబడనీయలేదు. మళ్ళీ చిరాకుగా ఉన్నా తాగలేకపోయింది. ఏమిటీ బలహీనత అని అనుకొంది. ఒక చిన్నపిల్ల చేత చెప్పించుకొనే స్థితికి నా జీవితం వచ్చిందా! అని ప్రశ్నించుకొంది.

వారం రోజులు గడిచేసరికి విద్య, భువనేశ్వరీదేవి ఇంట్లో ఉంది. తనకి జీవితం డల్‌గా ఉందని, ఏం చేయాలో తోచడం లేదని ఆవిడ విద్యతో అంది "నువ్వు నా జీవితంలో ప్రవేశించి బలవంతంగా నా దారి మరల్చావు. ఇప్పుడు ఆ దారిన వెళ్లలేను. మరేం చేయకుండానూ ఉండలేను'' భువనేశ్వరీదేవి సగం చిరాకుగా, సగం నిస్సహాయంగా అంది.

"అదే ఆంటీ... నేను చెప్పేది కూడా అదే. మీలో ఏదైనా సరే చెయ్యగల శక్తి ఉంది. డబ్బుకి మీకు లోటులేదు. ఈ ప్రపంచంలో ఎన్నో పనులు మీరు చెయ్యవచ్చును. మీవంటి సమర్థులు శక్తిని వృధాచేసుకోవడం న్యాయమా?

విద్య కిటికీ దగ్గరకు వెళ్ళి నిలబడి, బయటకు చూస్తూ ఉండిపోయింది. కాస్సేపు గడిచాక వెనకకి తిరగకుండానే అంది "ఆంటీ! మీరు ఒక సాంస్కృతికకళా సంస్థను స్థాపించండి. మీకు ఉన్న పరిధిలో కళాసేవ చేయండి. నా చిన్నప్పటినుండే చూస్తున్నాను. కళలలో కూడా రాజకీయాలు, స్వార్థప్రయోజనాలు చోటుచేసుకొంటున్నాయి. నిస్వార్థంగా పనిచేసే సంస్థలు అరుదయిపోతున్నాయి. కళలు కలుషితమైపోకూడదు. ఎందరో కళాకారులు ఎన్నో రంగాలలో ప్రోత్సాహం, గుర్తింపు లేకుండా మరుగునపడి ఉన్నారు. మీరు వాళ్ళందరికీ చేయూతనీయండి. ఏ ప్రలోభాలకి, రాజకీయాలకి తలవంచకుండా మీ సంస్థను నడపండి.

మాట వచ్చింది కనుక చెపుతున్నాను. మా ప్రిన్సిపాల్ మా సూచనలను ప్రోత్సహించి వింటారు. నేను కాలేజీ సెక్రటరీనయ్యాక మా ఫంక్షనుకి చక్రవర్తిగారిని పిలిచి గాత్రకచేరీ పెట్టాము.

చక్రవర్తిగారంటే మీకు తెలుసును కదా! సుప్రసిద్ధ గాత్ర విద్వాంసులు. కొంత కాలమై ఆయన మరుగున పడిపోయారు. దారిద్ర్యంతో అతి బరువుగా రోజులు వెళ్ళదీస్తున్నారు.

మేము పిలిచి ఇచ్చింది తక్కువే అనుకోండి. కానీ దాని వలన మరలా వెలుగులోకి వచ్చారు. మళ్లీ కొన్ని ఆఫర్లు వచ్చాయి.

అలాగే ఒక నటుడు తాగుడుకి బానిసై జీవితాన్ని పాడుచేసుకోవడం నేను చూశాను. ఆయన ఇల్లు మా వీధిలో వుంది. మా విద్యార్థుల ఫేర్‌వెల్ ఫంక్షనునాడు మేమందరమూ డబ్బులు వేసికొని ఆయన నాటకం పెట్టించాం"

విద్య మాటలు భువనేశ్వరీదేవికి మంత్రాక్షరాలులాగ కన్పిస్తున్నాయి, విన్పిస్తున్నాయి.

నిజమే... ఒక గాత్రవిద్వాంసురాలై ఉండీ తను కళనే మరిచిపోయింది. ఆవిడ గొంతు సంతోషంతో మూగపోయింది. తప్పక ఆ పని చేస్తానని మాట ఇచ్చి, విద్యను సెక్రటరీగా ఉండమంది.

విద్య చేతులు జోడించి నమస్కారం పెట్టేసింది. తనకి చదువుకోవడానికి అవదని చెప్పేసింది. అప్పుడప్పుడు వచ్చి మీ సంస్థ కార్యకలాపాలు చూస్తాను. సెక్రటరీగా మాత్రం మరొకరికి ఛాన్సు ఇవ్వండి. నేను చెప్పిన్న విషయాలు దృష్టిలో పెట్టుకోండి. మీ సంస్థ ప్రజలను మెప్పించాలి.

అంతే కాదు ప్రజలకు, కళాకారులకు మధ్య మీరు, మీ సంస్థ నిజమైన వారధిగా ఉండాలి'' విద్య మనస్పూర్తిగా చెప్పేసింది.

తర్వాత విద్యను రమ్మని కొద్దిరోజులకే విద్యతో తాము "చైతన్య'' సంస్థను ప్రారంభిస్తున్నట్లు చెప్పింది. తన సెక్రటరీగా "ప్రత్యూష" సెలక్టయిందని చెప్పి, పరిచయం చేసింది. ప్రత్యూష విద్యకి బాగా నచ్చింది. ఆమె యం.ఏ. పాసై ఉద్యోగం దొరకక ఇబ్బంది పడుతోంది. ఆమె కుటుంబానికి ఉద్యోగం ఎంతో అవసరం.

వినయం, తెలివితేటలు, ఉత్సాహం ఉన్నవారు భువనేశ్వరికి కావాలి. అందుకే తన పి.ఏ.గా ఉండమని ఉద్యోగం ఇచ్చింది. అంతే కాక సంస్థకి సెక్రటరీగా బాధ్యతలు నిర్వహించాలని చెప్పింది. ఆవిడ ఇస్తానన్న జీతానికి, చూపించిన బతుకుతెరువుకి ప్రత్యూష ఎంతో ఆనందపడిపోయింది.





"ఇదిగో! నిన్ను, నన్ను మెచ్చవలసినది ఈవిడగారు. ఈవిడ ఇష్టపడకపోతే నీ ఉద్యోగం..." అంటూండగానే విద్య భువనేశ్వరీదేవి నోరుమూసేసింది నవ్వుతూ.

"విద్యా! ఇప్పుడు నాతో భోజనం చేయాలి సుమా'' ఆవిడ చిన్నపిల్లలాగ అడిగింది.

విద్య తటపటాయింపుగా చూసింది.

"అయితే పద... నేనూ మీ ఇంటికే వస్తాను'' అంటూ విద్యతో కలిసి బయలుదేరింది.

సారధిగారికి, రాధమ్మకు భువనేశ్వరిని. ప్రత్యూషను విద్య పరిచయం చేసింది'' మీ అమ్మాయిని మా ఇంట్లో భోజనం చేయమంటే మా నాన్నగారితో తినందే నాకు తోచదు అంది. అందుకే నేనూ ఇక్కడికి వచ్చేశాను'' భువనేశ్వరి నవ్వుతూ రాధమ్మతో చెప్పింది.

రాధమ్మ అంత డబ్బు ఉన్నా, గర్వంలేని ఆమె ప్రవర్తనకు ముగ్ధురాలైంది. అరగంటలో వండి, అందరికీ భోజనాలు వడ్డించింది.

"విద్యా! ఒక సందేహం. ఇప్పుడు సరే రేపు నీకు 'పెళ్ళయినప్పుడో..." భువనేశ్వరీదేవి నవ్వుతూ అడిగింది.

"ఇప్పట్లో పెళ్ళి చేసుకోను. చేసుకున్నాకనై నా నాన్నగారూ, అమ్మా నా దగ్గరే ఉంటారు'' విద్య ధీమాగా మజ్జిగ అన్నం తింటూ అంది. సారధికి కళ్ళ నీళ్ళు తిరిగాయి ఆ మాటలకి.

ఈమధ్య తరచుగా రాధమ్మ విద్యకు సంబంధాలు చూడమని గొడవ చేస్తోంది. ఇప్పటినుండీ చూస్తే డిగ్రీ పూర్తయ్యేటప్పటికి కుదురుతుందని ఆశ.

దానికి సాయం విద్యమేనత్త ఒక సంబంధం పట్టుకొనివచ్చింది. దానితో రాధమ్మకి మరింత తొందర కలిగింది. కానీ సారధిగారు అప్పుడే అక్కతో చెప్పేశారు. ఇప్పట్లో అలాంటి ప్రయత్నాలు చేయద్దని. ఆవిడ భర్తవైపు సంబంధం అది. తమ్ముడు చెప్పిన జవాబుకి చిన్నబుచ్చుకొని ఆవిడ వెళ్ళిపోయింది.

విద్య పెళ్ళి త్వరలో జరిపిస్తే తాము

ఎక్కడ ఉన్నా, ఏం చేసినా ఇంక బెంగలేదని రాధమ్మ వాదన. ఆయన నవ్వుతూ పాకెట్ బుక్‌లో రాశారు. "విద్య అందరిలాంటి పిల్లా కాదు దానికి తగిన వాడిని వెదకడం కష్టమైన పని, విద్య ఆలోచనలను అర్థం చేసికొని పంచుకొనేవాడికే విద్యను ఇవ్వాలి'' అని.

రాధమ్మకి ఇది జరిగే పనేనా అన్పించింది "వెర్రిదానా? విద్యకి ఏం తక్కువ! అందంలో, చదువులో, గుణంలో ఇటువంటి అమ్మాయిని కళ్ళకద్దుకొని మరీ ఎవరైనా చేసుకొంటారు'' అని చెప్పారు. రాధమ్మకి రాజశేఖరం గుర్తుకి వచ్చాడు.

కానీ అంతటి ధనవంతుడు, విద్యావంతుడు తన బిడ్డను చేసుకొంటాడా అని ఆలోచన. సారధి ఆవిడ ఆలోచనకి నవ్వారు. "వేచి చూడు. విద్యకి ఎలాంటి భర్త వస్తాడో నీకే తెలుస్తుంది'' అని ఆయన ధీమాగా రాశారు.

విద్య కాలేజీకి వెళుతోంటే రాజశేఖరం కన్పించాడు. విద్య తనంతట తానే బండి ఆపి దిగింది. "ఏమయ్యారు? చాలా రోజులై కన్పించలేదు'' అని అడిగింది యధాలాపంగా.

"మీకు నా గురించి ఎక్కడపడుతుంది? కాలేజీ ఉత్సావాలు, సంస్థల స్థాపనలు, అక్షర విజయం కార్యక్రమాలు, లోకోద్ధరణ... ఈ అభాగ్యుడు వీటన్నింటిమధ్య ఎక్కడ గుర్తుకి వస్తాడు'' రాజశేఖరం దిగులుగా అన్నాడు.

"బావున్నాయి ఈ దెప్పుళ్ళు మీకు ఏవో పనులుండి కన్పించకపోగా నామీద నింద వేస్తున్నారు'' అంది నవ్వుతూ. రాజశేఖరం ఇంటర్వ్యూ వస్తే హైదరాబాద్ వెళ్ళానని చెప్పాడు.

కాలేజీ టైమవుతోందనీ, వెళతాననీ విద్య బయలుదేరింది. సాయంత్రం తప్పక కలిసి కాఫీ తీసుకొందామని అతడు అర్థించాడు. విద్య తలూపుతూ వెళ్ళిపోయింది.

రాజశేఖరంకి ఎప్పుడు సాయంత్రం అవుతుందా అన్పించింది. చాలారోజులై విద్యను కలవలేదు. నాలుగు గంటలకే ముస్తాబై బయల్దేరాడు.

అమ్మాయిలు కాలేజీనుండి బయటకి వస్తున్నారు. విద్యకోసం ఒళ్ళంతా కళ్ళుచేసుకొని చూస్తూ "ఒక్క అవర్ మానేస్తే ఏమవుతుందిట?" అని కినుకగా అనుకొన్నాడు.

కాలేజీ వదిలి అందరూ వెళ్ళిపోతున్నా విద్య రాలేదు. అతడికి చాలా విసుగ్గా అన్పిస్తోంది. నిరీక్షణ ఇంత బాధాకరమా అని అనుకొన్నాడు. మరికొంచెం సమయం గడిచాక విద్య, పదిమంది పిల్లలు వస్తూకన్పించారు.

విద్య వాళ్ళతో చెప్పి ఇవతలకి వచ్చేసింది. విద్య అలసిపోయిన మొహం చూస్తే అతడికి ఏమీ అనాలన్పించలేదు. వడలిన గులాబీ పూవులాగ ఉన్న విద్యను సానుభూతిగా చూశాడు.

అతడి చూపులను అర్థంచేసుకొన్నదానిలాగ "ఈరోజు మాకు ప్రాక్టికల్స్ ఉన్నాయి'' అని చెప్పింది. అతడు హోటల్‌లోకి దారితీసి టిఫినుకి ఆర్డరిచ్చాడు. ఆ రూంలో వారిద్దరే ఉన్నారు.

"విద్యా! నాకు ఒకటి అన్పిస్తోంది''

"చెప్పండి. అని విద్య ప్రోత్సహించింది''

"ఏది ఏమైనా చదువు, ఉద్యోగాలు ఆడవాళ్ళలోని సున్నితత్వాన్ని చంపేస్తున్నాయి. ఆడవాళ్ళు ఇంటిదగ్గర ఉంటేనే హాయిగా ఉంటారు''

"విద్య అతడి మాటలు విని నవ్వేసింది.

"బావుంది. ఈ మాటలు ఈ నాటివారు వింటే కర్రపుచ్చుకొంటారు'' అని మళ్ళీ నవ్వింది. "అయినా మీరు కాలేజీ అవగానే ఎందుకు రావాలి? ఇంటికి వెళ్ళి రిలాక్సు అయ్యాక కలవవచ్చును కదా!" అని అడిగింది.

"మనం ఇంటికి వెళ్ళేసరికి మరీ ఆలస్యమవుతుందని ఇక్కడికి వచ్చాను'' అతడు నిజాయితీగానే అన్నాడు. "అయితే ఇన్నాళ్ళూ మాయమయ్యారే'మని అడిగింది.

"ఉద్యోగం పురుషలక్షణం అన్నారు కదా అందుకని వెళ్ళాను'' అన్నాడు రాజశేఖరం సీరియస్‌గా.

"బావుంది... మీకు డబ్బుకి ఏమీ లోటులేదు కదా! మీరు హాయిగా పై చదువు చదివితే బాగుంటుంది కదా!" విద్య టిఫిన్‌ప్లేటు దగ్గరకి లాక్కొంటూ అంది.

"ఏం బావుండదు. నాకు ఉద్యోగస్తుడిని అయిపోవాలని ఉంది. హాయిగా కాలం గడపాలని ఉంది'' అతడు తన మనసులోని విషయం చెప్పేశాడు.

"మరి పై చదువు మాటో..." విద్య రెట్టించింది.

"చదువుతాను. ప్రైవేటుగా వీలైతే చదువుకొంటాను'' అతడు జవాబు చెప్పి "ఏమిటో! ఈ మధ్య నాజీవితంలోకి అకస్మాత్తుగా ఒక అమ్మాయి దాడి చేసింది. దానితో నాకు ఏ ఇతర విషయాలమీదా ఆసక్తి లేదు'' అన్నాడు.

విద్య అతడు చెప్పబోయే విషయాన్ని గ్రహించినా, గ్రహించని దానిలాగ నవ్వుతూ "మీరేదో బుద్ధిమంతులనుకొన్నాను. మీకూ ఇలాంటి విషయాలు ఉన్నాయా''

"మీకైనా అలాంటి అబ్బాయి దొరికినప్పుడు చదువు, గిదువు జాంతానై. తెలిసిందా? ఎంత గమ్మున ఆ అమ్మాయితో జీవితం పంచుకొందామా అన్పిస్తోంది'' అతడు నిర్మొహమాటంగా అనేశాడు.

"విద్యా! ఒకమాట అడగనా?"

"మీకు వాక్స్వాతంత్ర్యముంది. హాయిగా మాట్లాడండి'' విద్య కొంటెగా జవాబు ఇచ్చింది.

"వాక్స్వాతంత్ర్యముందని ఏ అమ్మాయి దగ్గరకైనా వెళ్ళి నోటికొచ్చింది వాగానను కోండి. పళ్ళు మరి ఉండవు''

ఇద్దరూ నవ్వుకొన్నారు.

"విద్యా! మీరు ఎవరినైనా బాగా ఇష్టపడ్డారా?"

... విద్య ఒక్కక్షణం ఓరగా అతడివైపు చూసింది. అతడు ఎంత సీరియస్‌గా అంటున్నాడో అర్థమైంది. "మా నాన్నగారిని, మా అమ్మని, మా మురళిని, మా..." ఇంకా విద్య చెప్పబోతోంది.

"మా కస్తూరిని, మా జ్యోతిని, మా అత్తయ్యని... ఇలాగ మీ లిస్టు కొల్లేరు చాంతాడంత వస్తుంది కదూ?" అతడు కోపంగా అంటూ టేబుల్ దగ్గరనుండి లేచాడు.

విద్య అతడికోపానికి నవ్వుకొంది.

"మరి నేను వెళ్ళి వస్తాను'' చెప్పేసి వెళ్ళిపోయింది.

రాజశేఖరం విద్య వెళ్ళినవైపే చూస్తూ నిలబడ్డాడు.

అతడికి తన మీద తనకే కోపం వచ్చింది. మనసులోని ప్రేమను తెలియచేయలేని ఈ అశక్తత ఏమిటి? ఇంటి దగ్గర ఎన్నెన్నో అనుకొని వస్తాడు. తీరా విద్య కనబడేసరికి అన్నీ ఖాళీ.

తమమధ్య సంభాషణ ఎక్కడ వేశావు గొంగళీ అంటే అక్కడే ఉన్నాను గొంగళీ అన్నట్లుఉంది. అయినా తన మనుసు విద్యకి తెలియదా?

విద్య చాలా గడుసుది. సంవత్సరం నుండీ తామిద్దరూ కలుస్తూన్నారు అయినా తమ పరిచయం ఏమీ ముందుకి వెళ్ళలేదు. అతడికి నవ్వు వచ్చింది.

విద్యలాంటి వ్యక్తులతో ఎన్ని సంవత్సరాలు చేసినా స్నేహం ఇలాగే చెక్కు చెదరకుండా ఉంటుంది.

రాజశేఖరంకి తల్లిలేదు. తండ్రికి అతడంటే ప్రాణం. కొడుకు ఎవరిని ఇష్టపడినా అతడు అభ్యంతరం పెట్టడు. కొడుకు వ్యక్తిత్వం కలవాడని అతడికి తెలుసును. సంబంధాలు చూస్తే ఒక్కలాగ వస్తున్నాయి. కొడుకును చూస్తే ఆ విషయమే మాట్లాడడు. వచ్చిన వాళ్ళకి ఏం చెప్పాలో ఆయనకి అర్థమవడం లేదు. కొడుకుని పిలిచి ఈ విషయం మాట్లాడాలని

 

ఆయన అనుకొంటున్నాడు.

తండ్రి చెప్పకపోయినా నౌకరువలన సంబంధాల విషయాలు అతడి చెవిన పడు తూనే ఉన్నాయి. అతడికి తండ్రిమీద గౌరవం కలిగింది. ఇదే ఇంకొకరైతే ఊదరగొట్టేసేవార నుకొన్నాడు.

ఏదిఏమైనా విద్యను ఈ విషయంలో కద పాలనుకొన్నాడు. అతడికి త్వరగా తాడో, పేడో తేల్చుకోవాలని ఉంది. ఉప్పెనలాగ వచ్చే ఆలోచనని అతడు బలవంతగా నిగ్రహించు కొంటున్నాడు.

ప్రిన్సిపాల్‌గారు క్లాసుక్లాసుకి సర్క్యులర్ పంపారు. అంతేకాక విద్యను ప్రత్యేకంగా పిలిచి చెప్పారు "ఇంటర్ కాలేజియేట్ డిబేట్సు అవుతున్నాయి. మన కాలేజి తరఫున స్టూ డెంట్సు ఇద్దరు వెళ్ళండి'' అని! ఆ పని ఒక మేడమ్‌కి అప్పచెప్పారు.

ఆవిడ కాలేజీలో పోటీ పెట్టారు. పోటీలో విద్య, అరవింద సెలక్టయ్యారు. అరవింద ఫస్టియర్ స్టూడెంటు. వాళ్ళని అభినందించి పోటీకి పంపారు. లోకల్ కాలేజీలన్నీ ఈ డిబేటులో పార్టిసిపేట్ చేశాయి.

"భారతదేశ విదేశాంగ విధానం సమర్థనీ యమా?" అని టాపిక్ ఇచ్చారు. విద్య సమర్థ నీయమైనదని, అరవింద కాదని మాట్లాడదల చుకొన్నారు. పోటీలు ప్రారంభమయ్యాయి. వ్యాస రచనలోను, డిబేటులోను కూడా పాల్గొ నాలని విద్య నిర్ణయించుకొంది.

డిబేటుకిచ్చిన విషయం బావుందనుకొంది. అందరూ మాట్లాడుతోంటే శ్రద్ధగా వింది. తమవంతు వచ్చేసరికి అవన్నీ గుర్తుపెట్టుకొని ఏ కారణాలచేత సమర్థనీయమో చెప్పనా రంభించింది. విద్యతోపాటు ఆరోజు ఆరుగురు అమ్మాయిలు పాల్గొన్నారు.

ఫంక్షనులో విద్యకి ఫస్టుప్రైజు, ఇంజనీ రింగ్ కాలేజీ అమ్మాయికి సెంకడ్ వచ్చింది. వ్యాసరచనలో కూడా విద్య సెకండ్ వచ్చింది. ప్రైజులు మర్నాడు కలెక్టరేట్‌లో ఇస్తారని చె ప్పారు. మెన్స్ కాలేజీ వాళ్ళు వ్యాసంలో ఫస్టు వచ్చినందుకు సంతోషిస్తూ వెళ్ళారు. విద్యతో పాటు మేడమ్ ఒకరు ఫంక్షనుకి వస్తారని చెప్పారు.

విద్యకి ఫస్టుప్రైజుగా ఒక స్టీలు కేరేజీ, సెకండ్ ప్రైజుగా ఒక వాటర్ బాటిల్ ఇచ్చారు. వ్యాసంలో ఫస్టు వచ్చిన అబ్బాయికి ఫ్లాస్కు ఇచ్చారు. డిబేటులో సెకండ్ వచ్చిన అమ్మా యికి కూడా స్టీలు ఆర్టికల్ ఇచ్చేశారు.

విద్యకి ఆ ప్రైజులు పుచ్చుకోవడం చాలా అవమానంగా అన్పించింది. తాము ప్రతిభతో ఈ ప్రైజులు గెలుచుకొన్నారు. ప్రతిభకి గుర్తు స్టీలుసామానులా? ఎందుకు వీళ్ళు ఇలాంటి పనులు చేస్తారని మనసులో మండిపడింది

విద్యను పేరుపెట్టి పిలిచారు. రెండుసార్లు పిలిచినా విద్య వెళ్ళలేదు. విద్యా వాళ్ళ మేడమ్ "అదేమిటి విద్యా వెళ్ళి ప్రైజు తీసు కో' అని చెప్పారు. విద్య గత్యంతరం లేనిదా నిలాగ స్టేజిమీదికి వచ్చింది. ఆమెకు ప్రైజులి వ్వడానికి కలెక్టరుగారు ఇటు తిరిగి చూశారు.

"విద్యాధరీ! నువ్వా!" ఆయన విద్యను చూడగానే సంతోషంతో అడిగారు. విద్య ఆయ నకి నమస్కారం చేసింది.

ఆయన ప్రైజులు అందివ్వబోయారు "క్ష మించండి. ఈ ప్రైజులు నాకు వద్దు'' విద్య స్పష్టంగా చెప్పింది ''ఏం? ఈసారి కూడా అవకతవకలు జరిగాయా?" ఆయన ఆత్రుతగా అడిగారు. విద్యతో ఇదివరకటి అనుభవం ఆయనకి గుర్తు ఉంది. విద్య లేదన్నట్లు తల ఊపింది.

విద్య మేడమ్‌కి చేతులు చెమటలు పట్టేస్తు న్నాయి. ఈ అమ్మాయి ఏమిటనుకొంటోంది? కలెక్టరుతో ఆ మాట లేమిటి? ఆవిడ భయంగా చూస్తోంది.

"మరి తీసుకోవడానికేం?" కలెక్టరుగారు విసుగ్గా అడిగారు. ఆ జిల్లా జాయింట్ కలెక్టర్ కూడా ఆసక్తిగా చూస్తున్నారు. విద్య ఒక్క క్షణం ఆయనవైపు చూసింది.

"ఈ పోటీలు మీరు మా మేధస్సుపై పెట్టినవి. మేము ఎంతో కష్టపడి మా కాలేజీ తరపున వచ్చి వీటిని గెలుచుకొన్నాం. మాతో పాటు ఎందరో పాల్గొని ఓడిపోయారు'' విద్య మధ్యలో ఆగింది.

కలెక్టరుగారు కుతూహలంగా వింటున్నారు. అందరూ ఆసక్తిగా ఆ సన్నివేశాన్ని గమనిస్తున్నారు. "గెలిచిన మేము ఆడవాళ్ళం అనే చులకన అభిప్రాయం మీలో ఉన్నట్లుంది. కాకపోతే లిటరరీ సైడు పోటీలకి కేరేజీలు, వాటర్ బాటిల్స్ ప్రైజులేమిటి? పెళ్ళిళ్ళకి, పేరంటాలకి ఇచ్చినట్లు. ఇదే మగవాళ్ళకయితే ఇవే ప్రైజులు ఇచ్చేవాళ్ళా?

"జిల్లాకి ప్రథమ పౌరులైన కలెక్టరుగారి ఆధ్వర్యంలో మమ్మల్ని ఇలాగ చిన్న బుచ్చడం బాధగా ఉంది''

విద్య అభిప్రాయం ఆయనకి బాగా అర్థమైంది. జాయింట్ కలెక్టర్‌గారు ముసిముసి నవ్వులు నవ్వుతున్నారు.

"ఏవీ లేకపోతే పెన్ను లిమ్మనండి. మంచి బుక్స్ ఇమ్మనండి అంతేగానీ ఇవి నేను తీసుకోదలచలేదు. మీ కలెక్టరేట్‌కి నా బహుమతులుగా ఉంచుకోండి'' అనేసి విద్య స్టేజి దిగిపోయింది.

కలెక్టరుగారు నవ్వుతూ మైకుదగ్గరకి వచ్చారు.

"విద్య చెప్పింది తనకి చాలా నచ్చిందనీ, తమ మనుష్యులు అలవాటుగా ఈ పొరపాటు చేశారనీ, మరొకసారి ఇలాంటివి జరగవనీ ప్రైజులు మార్పించి కాలేజీలకి పంపిస్తామని'' చెప్పారు.

విద్యతో వచ్చిన మేడమ్ అమ్మయ్య అనుకొంది.

మీటింగ్‌లో జరిగిన విషయం అప్పుడే అందరికీ బయట తెలిసిపోయింది. జాయింట్ కలెక్టర్ లేడీ అవడంవలన విద్యను దగ్గరకి పిలిచి అభినందించారు. అటువంటి మెరిక లాంటి అమ్మాయి తమ జిల్లాలో ఉన్నందుకు ఆవిడ ఎంతో సంతోషించారు.

ఇంటికి ఆటోలో వస్తోంటే మాత్రం మేడమ్ విద్యతో దెబ్బలాడారు. కలెక్టరుగారు మరోలా






నిర్ణయం తీసుకొంటే ఏమవుదువు? అని.

విద్య ఆయనతో తనకి లోగడ ఉన్న అనుభవాన్ని చెప్పింది.

లోగడ పాటలపోటీల అవకతవకలు గురించి చెప్పినప్పుడు ఆయన సంస్థవాళ్ళని బాగా మందలించారు. అదీగాక విద్యకి ఆ సాయంత్రం మీటింగ్‌లో కూర్చున్నప్పుడు జడ్జీలలో ఒకరు పార వేసుకొన్న మార్కుల కాగితం దొరికింది.

అందులో మార్కులు అవతలి కొందరు వ్యక్తులకన్నా విద్యకి ఎక్కువ వచ్చాయి. టోటల్ చేయడం కోసం అవన్నీ ఒకచోట వేసుకొన్నారు. మగవాళ్ళల్లో ఇద్దరికి సమాన మార్కులువచ్చాయి. అయినా ఇవేమీ చూడకుండా ప్రైజులు వాళ్ళ ఇష్టానుసారం ఇచ్చేశారు. ప్రైజులిచ్చిన పాటలూ తప్పే.

విద్య మీటింగ్ నుండి వస్తూ కలెక్టరుగారు చూస్తూండగా సంస్థవాళ్ళకి దొరికిందని మార్కుల కాగితం ఇచ్చింది. వాళ్ళు తర్వాత ఆ అమ్మాయి చేసిన పనికి గింజుకొన్నారు. కలెక్టరుగారికీ అందులో ఏదో లోపం జరిగిందని అర్థమైంది.

ప్రజలు తెలివి తక్కువ వాళ్ళు కారనీ, మనకన్నా బాగా గమనిస్తారనీ, సమర్థవంతంగా నిర్వహించలేనపుడు ఇలాంటి ప్రయత్నాలు చేయవద్దనీ మర్యాదగా మందలించారు.

పెద్దవాళ్ళని పిలవనప్పుడు ఏవి జరిగినా వెలుగులోకి రావు. పెద్దల ఆధ్వర్యంలో జరిగితే ప్రజలు ఊరుకొంటారా? పత్రికలు ఊరుకొంటాయా?

మేడమ్‌కి ఈ విషయాలన్నీ చెపుతోంటే విద్య పెదవులపై నవ్వు తొంగిచూసింది. "ఏమో గానీ ఈ అమ్మాయికి ఇన్ని విషయాల్లో ఇంత చొరవ పనికి రాదు'' అని అనుకొంది మేడమ్ "ఏమైనా విద్యా! ఈ సాహసం..."

ఆవిడ మాట పూర్తి చేయకుండానే విద్య అందుకొంది.

"మేడమ్! ఈ సాహసం నాన్నగారివలన వచ్చినది. నాన్నగారి రక్తంలో ఉన్నది. మరి దీన్ని అణచగలనా?" విద్య ఉద్వేగంగా అడి

గింది.

ఆవిడ ప్రేమగా విద్య తల నిమిరి మౌనంగా ఆశీస్సులందించారు.

మర్నాడు సులోచనగారికి కలెక్టరుగారి నుండి మెమెంటోలు, మంచి బుక్స్ అందాయి. ఆవిడ విద్యను పిలిచి అవి ఇచ్చారు. "వట్టి మొండిపిల్ల'' అని ముద్దుగా విసుక్కొన్నారు.

మేడమ్ ఏ ముహూర్తంలో తెగింపు అన్ని వేళలలో పనికిరాదని చెప్పిందో కానీ అది అక్షరాల సత్యమే అయింది విద్య ట్యూషన్ ముగించుకొని వస్తోంటే పార్కుదగ్గర లోపలకి వెళుతూ ఒక జంట కన్పించారు.

విద్యకి అనుమానం కలిగి స్కూటర్ బయటపెట్టి, లోపలికి వెళ్ళి రహస్యంగా వారిని గమనించసాగింది. విద్య అనుమానం నిజమే అయింది.

కృష్ణమోహన్, రాణి నవ్వుకొంటూ కబుర్లు చెప్పుకొంటున్నారు. రాణి భుజంమీద అతడి చేతిని చూస్తే వారిద్దరి మధ్యా చాలా చనువు పెరిగినట్లు అన్పించింది. విద్య ఇదివరకే కృష్ణమోహన్‌ను ఇద్దరు ముగ్గురు అమ్మాయిలతో చూసింది.

పైగా విద్య అతడి గురించి చాలా విషయాలు వింది. అతడికి స్త్రీలంటే ఆటవస్తువులు. ఏమాత్రం గౌరవం ఇవ్వడు. వ్యసనాలు కూడా ఉన్నాయని వినికిడి. ఎవరినో పెళ్ళిచేసుకొంటానని చెప్పి, మోసగించాడని స్నేహలత చెప్పింది. అటువంటి వాడితో రాణి చనువు పెంచుకోవడమా? విద్యకి ఎంతో భయంవేసింది.

ఇంటికి వచ్చినా విద్యకి రాణి ఆలోచనలే. రాణి ఇదివరకు తనతో పోట్లాడితే పోట్లాడవచ్చును. కానీ తన సాటి ఆడపిల్ల. అసలు విషయం చెప్పడం చాలా మంచిదని అనుకొంది. తర్వాతే విద్యకి హాయిగా నిద్రపట్టింది.

మర్నాడు కాలేజీ వదిలాక రాణి ఇంటికి వెళ్ళింది. రాణి అన్నగారు, వదినగారు కేరమ్స్ ఆడుకొంటున్నారు. రాణి ఇంట్లో లేదని, కూర్చోమని చెప్పారు. తోటిపిల్ల కాలేజీనుండి వచ్చినా, రాణి ఎందుకు రాలేదో వాళ్ళకి పట్టలేదు.

విద్యే ఇంక ఉండబట్టలేక రాణి కృష్ణమోహన్ అన్నవ్యక్తితో చనువుగా ఉంటోందని, అతడు మంచివాడుకాదని చెప్పింది. తనకి తెలిసిన విషయాలు చెప్పి, కనుక్కోమంది.

రాణి అన్నయ్య ప్రళయకాలరుద్రుడే అయ్యాడు. తన చెల్లెలు అంటే గిట్టక పుకార్లు పుట్టిస్తోందని విద్యను నిందించాడు. ఇన్నాళ్ళూ విద్య చదువు చూసి సంతోషించానని, ఇప్పుడు విద్య కుళ్ళు మనసుచూసి అసహ్యించుకొంటున్నానని చెప్పాడు. అందుకే రాణికి నువ్వంటే అసహ్యమన్నాడు.

క్షణం కూడా ఇంటిలో ఉండవద్దని, తమ చెల్లెలి బాగోగులు తమకి తెలుసునని అన్నాడు. విద్య అవమానభారంతో ఇంటికి వచ్చింది.

మర్నాడు కాలేజీకి వెళ్లినప్పుడు గేటు దగ్గరే రాణి, కృష్ణమోహన్ ఎదురయ్యారు. నీతో మాట్లాడాలి పనుందని విద్యను ప్రక్కకి పిలిచారు. కృష్ణమోహన్ విద్యను లాగి చెంపమీద కొట్టాడు. విద్య స్థాణువే అయింది.

రాణి అటువైపు చూడకుండా నిలబడింది. విద్యకి కళ్ళనీళ్ళు గిర్రున తిరిగాయి. "కబడ్దార్! జాగ్రత్త, పెద్ద లోకోద్ధకురాలివి బయలుదేరావు. అందరి విషయాలూ నీకే కావాలా? మా గురించి రాణి అన్నయ్య దగ్గర వాగుతావా? నీకు సిగ్గులేదూ? మరొకసారి మా జోలికి వచ్చినా, మా గురించి ఎవరి దగ్గర మాట్లాడినా నీ ప్రాణం నీకు దక్కదు! జాగ్రత్త' అతడు హూంకరిస్తూ వెళ్ళిపోయాడు.

విద్యకి ఈ లోకంలోకి రావడానికి చాలా సమయమే పట్టింది. కొందరు ఇది చూసి, అసలు విషయం గ్రహించుకొన్నారు. రాణి నిర్లక్ష్యంగా ఒకసారి తల ఎగురవేసి, స్నేహితులతో కలిసివెళ్ళిపోయింది. కొందరు విద్య దగ్గర సానుభూతిగా నిలబడ్డారు.




విద్యకి ఈ అవమానం భరించలేనిదిగా అన్పిస్తోంది. పుట్టి బుద్దెరిగాక ఇలాంటివి ఎదుర్కొని ఎరుగదు. ఈ భూమి చీలిపోయి తనలో దాచుకొంటే బావుండునన్పిస్తోంది. ముందుగా ఊహించి ఉంటే కృష్ణమోహన్‌ను అలాగ వెళ్ళనిస్తుందా?

విద్యకి క్రమేపీ ఆగ్రహం రాసాగింది. ఒక వెధవ తనని కొట్టడమా? ఎందులోనూ తనతో నిలబడలేనివాడు ఇంతపనికి పూనుకొంటాడా? వాడికి ఎలా బుద్ధి చెప్పాలి? పరిపరివిధాలుగా మనసు మండిపోసాగింది.

కాలేజిలో క్లాసులు ఎలా జరుగుతున్నాయో ఆమెకి తెలియదు. ఈ విషయం ఎవరో ప్రిన్సిపాల్‌గారికి చెప్పారు. ఆవిడ విద్యను పిలిచి అడిగింది. విద్య కళ్ళనీళ్ళు నిగ్రహించుకోవడానికి చాలా అవస్థ పడవలసివచ్చింది.

సులోచనగారు మండిపడుతూ మెన్స్‌కాలేజీ ప్రిన్సిపాల్‌గారికి కృష్ణమోహన్‌మీద కంప్లైంట్ చేశారు. ఆడపిల్లల కాలేజీ దగ్గరకి వెళ్ళి, అమర్యాదగా ప్రవర్తించినందుకు ఆయన తలవాచేలాగ చివాట్లుపెట్టి, ఒకవారం రోజులు సస్పెండ్ చేశారు. కృష్ణమోహన్ తల ఎగురవేస్తూ వెళ్ళిపోయాడు. ఈ విషయం ఎవ్వరికీ తెలియదు.

విద్య ఇంట్లో చెప్పకపోయినా రెండవరోజుకి మురళికి స్నేహితులద్వారా విషయం తెలిసింది. అంత అవమానం జరిగినా, మౌనంగా ఇల్లుచేరిన విద్యను చూస్తే ఒళ్ళుమండింది.

మర్నాడు రాణి కాలేజీకి వస్తోంటే మురళి దారి కాశాడు. రాణికి అతడిని చూడగానే జంకుగానే ఉంది. కానీ ఆగి వెనక్కి వెళ్ళిపోతే ఏమీ బాగుండదు. స్నేహితులదగ్గర చులకనవుతుంది. అందుకే ధైర్యంగా నడవసాగింది.

మురళి రాణి తోవకి అడ్డంగా నిలబడ్డాడు. రాణి స్నేహితులు భయపడి కాస్త పక్కకి తొలిగారు. "తప్పు చేసిన వాళ్ళకి కానీ, చేయించిన వాళ్ళకి కానీ ఇలాగే భయంవేస్తుంది'' మురళి కాస్త కటువుగా అన్నాడు.

"నేనేం తప్పు చేయలేదు. మీ చెల్లెలే అనవసరంగా గొడవ కొనితెచ్చుకొంది'' రాణి నిర్భయంగా అంది. వీడికి నేనెందుకు భయపడాలని అనుకొంది.

"నిజమే... మా విద్యకి అనుభవం లేదు. ఏదో స్నేహితురాలివి కదా అని నీకు మంచి చెప్పబోయింది. అదే నేనైతే నువ్వెవడితో తిరిగినా, ఏమైనా పట్టించుకోను'' మురళి ఎద్దేవా చేస్తున్నట్లుగా అన్నాడు.

"మాటలు మర్యాదగారానీ! నేనేం నీ మేనత్త కూతురిని కాను నీ మాటలు పడటానికి. నీ చెల్లెలు వాడితో పేరాటళ్ళకి తిరిగినప్పుడు ఏం చేశావు. పైగా పెద్ద కబుర్లు చెవుతున్నావు. గురివింద గింజ సామెత నిన్ను చూసే వచ్చి ఉంటుంది''

రాణి మాటలకు మురళి తోకతొక్కిన తాచులాగా అయ్యాడు.

"నా మేనత్త కూతురివైతే నిన్ను ఇలాగ పొగరుగా తిరగనిస్తానా? నీ కోరలు ఏనాడో పీకేసేవాడిని. మా విద్య నీలాగ చాటుగా తిరగదు. అది ఎవరితో స్నేహం చేస్తోందో, వారు మా ఇంటికే వస్తారు. నీలాంటిది కాదు అది. దాని కాలిగోరుకి పోలవు నువ్వు'' మురళి అసహ్యంగా చూశాడు.

రాణికి అతడి మాటలు శూలాల్లాగా గుచ్చుకొన్నాయి "అయితే ఇంకేం? నువ్వు, నీ చెల్లెలు కట్టకట్టుకొని ఊరేగండి'' అంది.

"అబ్బే... నిన్నూ ఊరేగిస్తాం. ఎవడో వెధవని తీసుకొచ్చి నా చెల్లెలిని కొట్టిస్తావా అంటూ దగ్గరగా వచ్చి, చెంపమీద వేయబోయాడు. రాణి భయపడి ముందుకి పారిబోతూంటే, మురళి ఆమెను పట్టుకొని ఆపాలనుకొన్నాడు. కానీ అవకాశం దొరకక అనుకోనివిధంగా పమిట పట్టుకొన్నాడు.

నిజానికి పైట పట్టుకొని వెనకనుండి ఆపాలన్నదే అతడి ఉద్దేశ్యం. కానీ ఎప్పుడైతే పైట పట్టుకొన్నాడో రాణి భయపడిపోయింది. ఏం

చేస్తాడో అనుకొని మురళిని ఎడాపెడా వాయించింది. మురళికి ఆవేశం వచ్చేసింది.

ఓణీ పట్టుకొని గుంజి, రాణిని వదలకుండా కొట్టేశాడు. చివరికి అటువైపు పిల్లలు వచ్చి వాళ్ళని విడదీయకపోతే ఇంకా గొడవైపోయేది. రాణి అనుకోని ఈ చర్యకి వణికిపోయింది.

పిల్లలు రాణిని తీసికెళ్ళి ప్రిన్సిపాల్‌గారి రూంలో అప్పచెప్పారు. ఆవిడ ఏదడిగినా చెప్పకుండా రాణి ఏడవసాగింది. దానికి సాయం విద్య ఆరోజు ఒంట్లో బావుండక కాలేజీకి రాలేదు.

మర్నాడు విద్య కాలేజీకి వచ్చాక ప్రిన్సిపాల్‌గారు పిలిచారు. విద్యకి మురళి ఇంట్లో ఏమీ చెప్పలేదు. కాలేజీకి రాగానే ఈ కబురు. విద్యను చూస్తూనే ప్రిన్సిపాల్‌గారు మండిపడ్డారు. విద్య అయోమయంగా ఆవిడవైపు చూసింది.

"ఛీ... నువ్వు బాగా చదువుతావుకదా అని అభిమానించాను. ఎవరికీ ఇవ్వని చనువు నీకు ఇచ్చాను. బజారు వాళ్ళలాగ పోట్లాటలు పెట్టుకొంటారా? ఇదసలు ఆడపిల్లలు చదివే కాలేజీయేనా?

రాణికి, నీకు తగాదాలు ఉంటే మీ ఇళ్ళదగ్గరో, ఏ నడిబజార్లోనో చూసుకోండి. నా కాలేజీ ప్రెమిసెస్‌లో తన్నుకోవడానికి మీకు ఎన్ని గుండెలు? మంచీ, మర్యాదా మీకసలు ఉన్నాయా! ఉంటే అలాగ చేయించేదానివా?" ఆవిడ రొప్పుతూ ఆగారు.

"నేను... నేనేం చేయలేదు మేడమ్!" విద్య నెమ్మదిగా అంది. "షటప్... ఇంక మాట్లాడకు. మీ అన్నయ్యకి నువ్వు అంతా చెప్పలేదా? మీ అన్న కాలేజీకి వచ్చి దుశ్శాసనుడిలాగ రాణిని ఓణీపట్టుకొని లాగి కొట్టలేదా? ఏమీ ఎరగనట్లు అడుగుతున్నావా?" ఆవిడ ఉరిమినట్లు అన్నారు.

"నిజం చెపుతున్నాను. మేడమ్ నేను ఎవరికీ ఏమీ చెప్పలేదు. ఎవరినీ పంపలేదు'' విద్య నెమ్మదిగానే అయినా స్పష్టంగా అంది. దానితో ఆవిడకి ఒళ్ళు మండిపోయింది.

"నాతో అబద్ధాలు చెపుతావా? ఏమీ నీకు తెలియదంటే నమ్ముతానా? ఇవన్నీ జరిపించడానికే నువ్వు రెండు రోజులు కాలేజీ మానేశావు'' అని విద్య లెంపలు వాయించారు.

విద్య స్థాణువే అయింది. ఇన్ని ఏళ్ళల్లో ఏనాడూ తిట్టి కూడా ఎరగని ఆవిడ అలాగ కొట్టి శిక్షిస్తూంటే విద్య వారించలేకపోయింది.

ఎడ్మినిస్ట్రేషన్ విషయాలలో చిన్న పొరపాటు జరిగినా సహించని పరిపాలనా దక్షురాలు ఆవిడ. చివరికి ఆవిడే విద్యను వదిలి "నువ్వు మళ్ళీ నా ఎదుట పడాలంటే వెళ్ళి ఆ రాణిని క్షమార్పణ అడుగు. అప్పుడే నిన్ను నేను క్షమిస్తాను'' అని కటువుగా అన్నారు. తన సీట్లోకి వెళ్ళి కూర్చుండిపోయారు.

విద్య జీవచ్ఛవంలాగ బయటికి వచ్చింది. బయటనున్న స్నేహలత విద్యని ఓదార్చి, అంతకుముందు రోజులలో జరిగిన విషయాలు చెప్పింది. విద్య అంతా విన్నా ఏమీ మాట్లాడలేదు "లతా! నేను ఇంటికి వెళ్ళిపోతాను. నా మనసు బావుండలేదు'' అంటూ పుస్తకాలు తీసికొని బయలుదేరింది.

ప్రిన్సిపాల్‌గారు కొట్టిన దెబ్బలకి విద్య తెల్లని చెంపలు వాచిపోయి, కందిపోయాయి. విద్య ఎవరితో ఏం మాట్లాడలేదు. తన గదిలో పడుకుండిపోయింది. సారథిగారు విద్య రావడం చూశారు. చెప్పే విషయం ఏదైనా అయితే విద్య చెపుతుందని ఆయనకి బాగా తెలుసును.

సాయంత్రం స్నేహలత కాలేజీనుండి విద్య ఇంటికి వచ్చింది. విద్యతో కాలేజీ విషయాలు మాట్లాడింది. ప్రిన్సిపాల్‌గారు జరిగింది తెలుసుకోకుండా విద్యను శిక్షించడం లతకీ చిరాకుగా ఉంది. ఈ ఏడాదితో చదువు పూర్తవుతుందని అనుకొంటే ఇన్ని ఆటంకాలు, సమస్యలు వచ్చి పడుతున్నాయి.




స్నేహలతవలన రాధమ్మకి అసలు విషయం తెలిసింది. ఆవిడకి మురళిమీద పట్టరాని కోపం వచ్చింది. వెనకా, ముందూ చూసుకోకుండా ఏదితోస్తే అది చేసెయ్యడమే నా?

విద్య పుట్టాక తామే ఏనాడూ ఒక్క దెబ్బ వేసి ఎరుగరు. అసలు విద్యే ఏనాడూ ఏ మందలింపుకీ అవకాశం ఇవ్వకుండా పెరిగింది. అలాంటిది ఈనాడు కాలేజీలో చెయ్యని నేరానికి శిక్ష అనుభవించి వచ్చిందా?

ఆవిడ కూతురిని దగ్గర తీసికొని ఏడ్చేశారు. వెధవ చదువు మానేయమన్నారు. విద్య తల్లి బాధపడుతుందని ఏమీ మాట్లాడలేదు. సారధికి రాధమ్మే విషయం చెప్పారు. ఆయన ఏమీ మాట్లాడలేకపోయారు.

తల్లితండ్రి బాధపడతారని విద్యే నాలుగు మెతుకులు తిని లేచింది. తన గదిలోకి వెళ్ళి పడుకుంది. సారధి ఆమె గదిలోకి వెళ్ళారు. విద్య నైట్‌డ్రెస్‌లో ఉంది. ఆయనను చూసి పక్కమీదనుండి లేచి కూర్చుంది. ఆయన పాకెట్‌బుక్ తీసి రాశారు. "జీవితం అంటే అనేక ఆటుపోటులుంటాయి. ఆనందం వచ్చినప్పుడు పొంగిపోకూడదు. దుఃఖము కలిగినప్పుడు కుంగిపోకూడదు. జీవితం అంటే ఘటనా ఘటనాల కలయిక. ప్రిన్సిపాల్ నీకు తల్లిలాంటివారు. ఆవిడ అన్నారని బాధపడకు. నిజం తెలుసుకొన్నాక ఆవిడే నిన్ను దగ్గరికి తీస్తారు. జీవితం అంటే అనుభవాల సంగమం. ఒక్కొక్క అనుభవం ఒక్కొక్క పాఠం చెపుతుంది'' ఆయన మాటలు విద్యకి ఓదార్పుని, ఆలోచనని కలిగించాయి. ఆయన విద్య తల నిమిరారు.

అంతవరకూ అదిమిపట్టిన దుఃఖమంతా కన్నీటి రూపంలో బయటపడింది. ఏడ్చినందువలన మనసులోని బరువు తగ్గుతుంది. అందుకే ఆయన విద్య వెన్ను నిమురుతూ ఉండిపోయారు. విద్య అలాగే నిద్రలోకి జారిపోయింది.

మురళి ఇంటికి వచ్చి చూస్తే రాధమ్మ కుర్చీలో కూర్చుని శూన్యంలోకి చూస్తోంది. ఈమధ్యకాలంలో ఆవిడను పిల్లలు అలాగ చూడలేదు. మురళి తల్లిని అలా ఉన్నావేం అని అడిగాడు. ఆవిడ మురళిని విద్య గదిలోకి తీసికెళ్ళి వాచిపోయిన బుగ్గలు చూడమంది. మురళి ఇలాగ జరుగుతుందనుకోలేదు. ఎర్రగా కమిలిపోయిన బుగ్గలూ, బుగ్గలపై ఏడుపు వలన ఏర్పడిన చారలు చూస్తే మురళికి బాధవేసింది.

తను అనాలోచితంగా చేసిన పనివలన జరిగిన విషయం ఇది. పెద్ద హీరోలాగ ముందూ, వెనుకా చూడకుండా వెళ్ళాడు. తప్పు తను చేస్తే చెల్లెలు శిక్ష అనుభవించింది. విద్య కళ్ళమ్మట నీళ్లు అతడు ఏనాడూ చూడలేదు.

అతడు మౌనంగా తల్లి తిట్టిన తిట్లన్నీ తిన్నాడు. ఏనాడూ గట్టిగా కేకలు వేయని తల్లి మందలిస్తోందంటే తను చేసిన పనివలనకదా అని అనుకొన్నాడు. మరెప్పుడూ మీకు చెప్పకుండా ఏమీ చేయనమ్మా అంటూ ఆరోజు జరిగిన విషయం చెప్పాడు. అంతా విని రాధమ్మ నిట్టూర్చింది.

ఉదయం విద్య లేచి తన మామూలు కార్యక్రమంలో పడింది. చెల్లెలి మౌనం చూస్తే మురళికి బాధ అన్పించింది. విద్య విషయం తెలిసినా, తనని నిలదీయలేదు. ఎందుకు చేయవలసివచ్చిందని దెబ్బలాడలేదు.

"నీవలన నాకు ఎలాంటి శిక్ష పడిందో చూడు'' అని దెబ్బలాడలేదు. అతడికి చెల్లెలి ఔన్నత్యం బాగా అర్థమైంది. విద్య చెంపలపై పడిన దెబ్బలు గడిచిన సంవత్సరాలలోని తన ప్రవర్తనకి గుర్తుల్లాగా అన్పించింది.

తనంటే చెల్లెలికి గల ప్రేమ ఎలాంటిదో అతడికి గుర్తుకి వచ్చింది. ఏదైనా సరే విద్య తనకి పెట్టందే తిని ఎరుగదు. ఈమధ్యకాలంలో విద్యతో తను సరదాగా గడపడమే మానేశాడు

సరదాగా ఏం ఖర్మ... అసలు మనిషిగా

ఒక అన్నగా ప్రవర్తించలేకపోయాడు. , విద్య లాంటి చదువుల సరస్వతికి ఇంజనీరింగ్ చెప్పిస్తానని ముందడుగు వేయలేకపోయాడు. ఎంతసేపూ చదువుకొంటూ హాయిగా గడపవ లసిన తను, ఉద్యోగ జీవితంలో ఇరుక్కొనిపో యానే అని బాధపడ్డాడు. కానీ ఇతరుల ఎడల కర్తవ్యం ఆలోచించలేకపోయాడు. మురళికి ఎందుకో తన ప్రవర్తనకి చాలా సిగ్గు వేసింది.

విద్య ఒక్కనాడూ తనని చదువు ఎందుకు చెప్పించవని నిలదీయలేదు. ఎవరైనా అంత బాగా చదివే అమ్మాయిని ఇలాంటి మామూ లు చదువులో చేరమంటారా? మురళికి ఒక్కొ క్కటీ గుర్తువచ్చి మరీ బాధనిపించింది. తను చేసినదానికి విద్యను క్షమించమనడానికి అత డికి మొహం చెల్లలేదు.

విద్య కాలేజీకి వచ్చి రాణికోసం చూసింది. రాణి లైబరీలో పుస్తకం చదువుకొంటోంది. విద్య అక్కడికి వెళ్ళింది. రాణి విద్యను చూసినా పలకరించలేదు.

విద్యే రాణి కూర్చున్న కుర్చీ దగ్గరకి వచ్చింది. రాణి లేచిపోబోయింది. "రాణీ! ప్లీజ్ వెళ్ళిపోకు. జరిగిన దానికి నన్ను క్షమించు. నువ్వు రెండు రకాలుగా నన్ను క్షమించాలి. ఒకటి మా అన్నయ్య చేసిన దానికి క్షమించాలి. రెండు ఒక కాలేజీ సెక్రటరీగా నా వాళ్ళను నేను కాపాడాలి. నా వాళ్ళకి జరిగిన అవమానానికి నేనీ బాధ్యత వహించాలి. కనుక నన్ను మన్నించు'' అని రాణి రెండు చేతులూ పుచ్చుకొంది. రాణి బింకంగా నిలబ డింది.

"చూడు రాణీ! నీమీద నాకు ఎప్పుడూ శతృత్వం లేదు. చదువులో, కాంపిటేష న్సులో మనం ఇద్దరం పాల్గొనడంవలన పోటీ ఏర్పడింది. అంతే... నిన్ను ఏ విషయంలోనై నా అవమానించాలనే అల్పత్వం నాలో లేదు.

"నువ్వు నా స్నేహితురాలివికదా అని నీకు కృష్ణమోహన్ గురించి చెప్పబోయాను. అదైనా ఉన్న వాస్తవాన్ని నీకు చెప్పాలని తప్ప నీకు హాని చేయాలని కాదు. నువ్వు నమ్మినా, నమ్మకపోయినా నేను నిన్ను అవమానపరచ మని మా అన్నయ్యకి చెప్పలేదు. నా ప్ర మేయం లేకపోయినా, నావాళ్ళు చేసిన తప్పు కనుక మళ్ళీ నిన్ను క్షమార్పణ అడుగుతున్నా ను'' అంటూ విద్య రాణితో చెప్పి, లైబ్రరీ నుండి ఇవతలకి వచ్చేసింది.

సమానమైన అందచందాలు, తెలివితేటలు కలిగిన ఆ ఇద్దరినీ లైబరీలో కూర్చున్న స్నేహితులు కొందరు ఆనందంగా చూశారు. లైబేరియన్ విద్యవైపు ప్రశంస నిండిన కళ్ళతో చూసింది.

ప్రిన్సిపాల్‌గారు విద్యను పిలిచారు. మురళి వచ్చి తనకి జరిగిన విషయాలు చెప్పాడని, తాను తొందరపడి విద్యను కొట్టినందుకు, బాధపడుతున్నానని అన్నారు.

తల్లిలాంటి ప్రిన్సిపాల్‌కి తమని శిక్షించే హక్కు ఎప్పుడూ ఉంటుందని విద్య విన యంగా సమాధానమిచ్చింది. రాణిని క్షమా పణ కోరిన విషయం కూడా చెప్పింది.

ఆవిడ ఏమీ మాట్లాడలేకపోయారు. విద్య వ్యక్తిత్వం ఆవిడకి బాగా అర్థమైంది.

క్లాసులు అయ్యాక వరండాలోనుండి కింది కి వస్తున్న విద్యని రాణి ఆగమని పిలిచింది. గంధపురంగు చీర, జాకట్టులలో విద్య నాజూ కుగా అన్పిస్తోంది. విశాలమైన విద్య నల్లటి సోగ కళ్ళల్లో రాణికి స్నేహభావమే కన్పించింది. విద్య ప్రవర్తనే ఆమెకి నిజమైన అందాన్నిస్తోందని గ్రహించింది.

రాణి వచ్చి విద్యతో కలిసి నడుస్తూ చె ప్పింది. "మీ మురళి అన్నయ్య వచ్చి నాకు జరిగింది తెలియచేశాడు. తను చేసిన తప్పుకి క్షమార్పణ కూడా అడిగాడు. నువ్వు కూడా జరిగిన విషయాలకి నన్ను క్షమించు ఇకపోతే కృష్ణమోహన్ విషయంలో నువ్వు విన్నవి నిజం కావచ్చును. నువ్వు చూసిందీ యదార్థ మే. నాకూ అతడి గురించి కొంత తెలుసును''

రాణి మాటలకి విద్య ఆశ్చర్యంగా చూ




సింది. విద్య ఆశ్చర్యం చూసి రాణి నవ్వింది.

"ధనవంతుల పిల్లలకు కొన్ని కొన్ని బలహీనతలు తప్పవు. ఏ బలహీనతలూ లేనివాళ్ళూ ఉంటారనుకో! అది వేరే సంగతి'' రాణి ఒక్కక్షణం ఆగింది "కృష్ణమోహన్ పెద్దవాళ్ళు నన్ను కోడలుగా చేసుకొంటామని మా వాళ్ళను అడిగారు. మా నాన్నగారు నా ఇష్టానికే వదిలేశారు. అతడి గురించి తెలుసుకోకుండా చేసుకోవడం నాకు ఇష్టంలేదు. అందుకే కాస్త క్లోజుగా ఉన్నాను. అంతే! నీకు ఈ విషయం చెప్పడానికే పిలిచాను. వాళ్ళందరినీ చూశాక మా డాక్టరు బావే నయమేమో అన్పిస్తోంది. పెళ్ళి విషయంలో బాగా ఆలోచించుకొని అడుగెయ్యాలి'' అంటూ నవ్వింది.

రాణి తను అనుకొంటున్నట్లు అమాయకురాలు కాదని విద్య గ్రహించింది. బాగా ఆలోచనలున్న మనిషి. తొందరగా బయటపడదు. ఏదిఏమైనా రాణికి తగిన వరుడు వస్తే చాలు అనుకొని తృప్తిపడింది విద్య.

విద్య ఇంటికి వెళ్ళేటప్పటికి రాజశేఖరం కూర్చుని ఉన్నాడు. పక్కన టిఫిను ప్లేటు, కాఫీ గ్లాసు ఉన్నాయి. తల్లి అప్పుడే అతడికి అతిథిమర్యాదలు చేసేసినట్లుంది.

"విద్యా! నువ్వు చూస్తే ఎప్పటికీ రావు. మరి ఏం చేయను? ఇలాగ టిఫిను తింటూ, కాఫీ త్రాగుతూ కాలం గడిపాను'' రాజశేఖరం చెప్పాడు. విద్య అతడిని కూర్చోమని, స్నానం చేయడానికి వెళ్ళింది.

సారథి మురళితో కలిసి బజారువైపు వెళుతున్నానని సౌంజ్ఞ చేశాడు. రాజశేఖరం తల ఊపాడు. అంతకుమునుపే హైదరాబాద్‌లో ఉద్యోగంలో చేరి వచ్చానని, తండ్రి పెళ్ళి విషయమై బలవంతం చేస్తున్నారని విద్య అభిప్రాయం తెలుసుకొందామనుకొంటున్నానని చెప్పాడు. సారథి సంతోషపడ్డాడు.

విద్య చిన్న చుక్కలున్న తెలుపువాయిల్ చీర, జాకెట్టు కట్టుకొనివచ్చింది. కాటుక తీర్చిదిద్దిన కళ్ళు సోయగమంతా మాలోనే ఉందని చెప్పక చెపుతున్నాయి. కంటిదగ్గర ఉన్న చిన్న పుట్టుమచ్చ అసలు ఈ అందానికి కారణం నేను అంటోంది. సంపెంగ పువ్వులాంటి నాసిక ఎక్కుపెట్టిన మన్మధుడి విల్లులాగ ఉంది. చిన్న అందమైన బుల్లి పెదవులు దొండపళ్ళలాగ మిలమిల మెరుస్తున్నాయి.

రాజశేఖరం విద్యను చూస్తూ నిట్టూర్చాడు. "విద్యా! ఇదేం బాగుండలేదు'' నిష్ఠూరంగా అన్నాడు.

"ఏదీ... ఈ చీరా... సాయంత్రం కదా అని ఇది కట్టుకొన్నాను'' విద్య తన చీరవైపు చూసుకొంటూ చెప్పింది.

"జోకులెయ్యకు. నేను ఎప్పుడైనా నీ చీర గురించి ఎత్తానా?" రాజశేఖరం సూటిగా నిలదీస్తున్నట్లు అడిగాడు. విద్య అర్థంకానట్లు తల గోక్కుంది.

"అలా అయోమయంగా చూడకు. ఇంటర్వ్యూకి హైదరాబాద్ వెళ్ళడం తెలుసును. నేను రావడం తెలుసును. ఉద్యోగం వచ్చిందని తెలుసును. చేరి వచ్చానని తెలుసును'' రాజశేఖరం మాటలు విద్యకి కొత్తగా ఉన్నాయి.

ఈమధ్య అతడు ఏకవచనప్రయోగంలోకి దిగడం తెలిసినా విద్య పట్టించుకోలేదు.

"మా నాన్నగారు పెళ్ళి విషయంలో ఒక నిర్ణయానికి రమ్మని హెచ్చరించారు నన్ను'' రాజశేఖరం చెప్పేశాడు.

అదా విషయం నాయనా! అనుకొంది విద్య.

"అయితే... ఇంకేం... ఒక నిర్ణయానికి రండి'' విద్య తేలిగ్గా అనేసింది.

రాజశేఖరం ఆమెను నమిలిమింగేసేటట్లు చూశాడు. విద్య గమనించనట్లు టి.వి.చూడ సాగింది.

"నామాటలకన్నా ఆ టి.వి. ముఖ్యమా?" అతడు ఉడుక్కొంటూ కట్టేశాడు.

"ఏం చేయను చెప్పండి. మీరు నెమ్మదిగా

మాట్లాడుతున్నారు. ఈలోపు దాన్నయినా చూద్దామని'' విద్య ఏడిపిస్తున్నట్లు అంది.

ఇంక ఈ అమ్మాయితో లాభం లేదనుకొన్నాడు రాజశేఖరం. అందుకే సూటిగా విషయంలోకి వస్తూ, "జీవితాంతం నిన్ను నేను, నన్ను నువ్వు చూసుకొనే అవకాశం కల్పించు విద్యా!" అని అడిగేశాడు.

విద్య ఒక్కక్షణం మాట్లాడలేదు. అతడికి విద్య మౌనం భయంగా ఉంది. "మాట్లాడు విద్యా! నన్ను స్వీకరించడానికి నీకు ఏమిటి అభ్యంతరం?" అతడు ఆత్రుతగా అడిగాడు.

"మీరెక్కడ, నేనెక్కడ" విద్య సాలోచనగా చూస్తూ అంది.

"నేను కుర్చీలో... నువ్వు కిటికీ దగ్గర మంచంమీద"

"జోకు లేయకండి. నేను సీరియస్‌గా ఆలోచించి చెపుతున్నాను'' విద్య గంభీరంగా అంది. "మా ఇంటి పరిస్థితులు, చదువుమీద నాకున్న ఆసక్తి అన్నీ మీకు తెలుసును. మనకి ఎలాగ పొత్తుకుదురుతుంది?"

"అలా అనకు విద్యా! మనం ఒకరికొకరం కావాలనుకొంటే ఈ విషయాలు ఏవీ అడ్డురావు. నిన్ను పెళ్ళి చేసికొని, హాయిగా జీవితం అనుభవించాలని ఉంది'' గంభీరంగా అంటున్న రాజశేఖరం మాటలకి విద్య సిగ్గుతో తలవంచుకొంది. విద్యకి రాజశేఖరం వంటి సౌజన్య మూర్తిని వదులుకోవాలనీ లేదు.

తామిద్దరిమధ్యా ఎంతో పరిచయం ఉంది. అయినా ఏనాడూ అతడు తొందరపడలేదు. సంస్కారపూరితమైన అతడి ప్రవర్తన ఒక ఎత్తు, తనయందు అతడు చూపించే ప్రేమ ఒక ఎత్తు.

అతడు పదిరోజులు కనపడకపోతే తనకి ఏమిటోలాగ ఉంటుంది. ప్రేమంటే ఇదేనేమో! విద్య మనసుని ఒకవైపు పెళ్ళి, ఒకవైపు పై చదువు లాగుతున్నాయి. పెళ్ళైతే తను జీవి




తంలో అనుకొన్నవి సాధించగలదా?

విద్య ఆలోచనలో పడటంచూసి అతడు నవ్వుకొన్నాడు. విద్య అందరిలాగ ప్రతీ విష యంలో తొందరపడదని అతడికి తెలుసును. ఆమె ఆలోచనలూ తెలుసును "విద్యా! మీవాళ్ళ కి నేను అన్ని విషయాలూ చెప్పాను. ఇంక మన పెళ్ళి గురించి నువ్వే ఒక నిర్ణయానికి రావాలి'' అని ఆగాడు.

విద్య చేతిగోళ్లను చూసుకొంటూ ఆలోచి స్తోంది. ఒక్కొక్క నిముషం గడుస్తున్నకొద్దీ అతడికి కంగారు ఎక్కువ అవుతోంది. విద్య లేకుండా తన జీవితం... అతడికి ఆ మాట అనుకోవడానికే భయంవేసింది.

"విద్యా! నామీద నమ్మకం ఉంచు. నీ భవిష్యత్తును అందంగా మలుచుకోవడానికి నాకు వీలైనంతవరకూ సహకరిస్తాను. దయ చేసి మన పెళ్ళికి అంగీకరించు. మనసులో ఏ శంకలూ పెట్టుకోకు'' రాజశేఖరం అనున యంగా అన్నాడు.

విద్య నెమ్మదిగా తల ఎత్తి అతడిని చూసి నవ్వింది.

విద్య చిరునవ్వు చూడగానే అతడికి ఎంతో సంతోషం అన్పించింది. "అయితే మన పెళ్ళి విషయాలు మాట్లాడమని, ముహూర్తం పె ట్టించమని మీ నాన్నగారితో చెపుతాను'' అత డు ఆ మాటలు అంటూ విద్య దగ్గరికి వచ్చాడు. విద్య సుకుమారమైన చేతిని పైకెత్తి నెమ్మదిగా పెదవులకు ఆన్చాడు.

"మీకంతశ్రమ అక్కరలేదు బావగారూ! మీ నాన్నగారిని సంప్రదించి, మేమే అన్ని ఏర్పాట్లూ చేస్తాము'' అంటూ నవ్వుతూ ము రళి లోపలకి వచ్చాడు.

తమను చూసి సిగ్గుపడుతున్న వారిద్దరినీ రాధమ్మ, సారధి అపురూపంగా చూశారు.



# స్పృహ పై సమీక్షలు

మే 'చతుర'లో ప్రచురితమైన వి.నాగరత్న నవల 'స్పృహ'పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా వున్న ఐదింటిని ఈ దిగువన ప్రచురిస్తున్నాం.

## స్పృహ

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

మానవ స్వభావంలోని అప్రజాస్వామికమైన ఆధిక్యతా భావం కుటుంబంలోనేకాదు, కార్యాలయాలు, రాజకీయాలు, సమస్త వృత్తిరంగాల సామాజిక సంబంధాలన్నిటిలోను పూర్తిగా జీర్ణించుకుపోయింది. దీనికి కారణాలు అనేకం, ఆత్మవిశ్వాసం లేకపోవడం, అభద్రతా భావం, వ్యక్తుల సమానత్వం మీద నమ్మకంలేకపోవడం, కొందరికన్నా తాము అధికుల మనుకోవడం, అహంభావం, ఈర్ష్య మొదలయినవి. మనుషుల మనసుల్లో అభద్రతాభావాన్ని తొలగించి, ఆత్మవిశ్వాసాన్ని సమానతాభావాన్ని కలిగించినప్పుడు మాత్రమే దీనిని కుటుంబంలోనుండయినా, సమాజంలోనుండయినా తరిమేయగలం.

ఆధిక్యతా స్వభావం యొక్క అనేక రూపాలను వి.నాగరత్నగారు తమ నవలిక 'స్పృహ'లో ఆసక్తికరంగా చిత్రించారు.

ఉద్యోగాలు చేసే స్త్రీలు 'రెండు పడవల మీద కాళ్లు పెట్టినట్లుంది' అని వాపోతుంది వర్ష. స్త్రీలు ఉద్యోగాలు చేస్తున్న ఈ కాలంలో స్త్రీ పురుషుల యొక్క రోల్స్‌కు విఘాతం కలగకుండా, కుటుంబసభ్యులమధ్య పనిభారపు పునర్వ్యవస్థీకరణ జరుగుతుందనే ఆశాభావమే ఈ నవలికలో కనిపిస్తుంది. ఈ విషయంపై చిత్ర, వర్షలమధ్య సాగిన సంభాషణ ఏకపక్షం కాకుండా చిత్రించారు రచయిత్రి. 'సమస్యని సమస్యగా చూడు, స్త్రీ పురుష భేదంవద్దు' అన్న చిత్ర మాటలు, 'సర్దుబాటుతత్వం' అవసరమని ఈశ్వరీదేవి చెప్పిన మాటలు, స్త్రీపురుష సంబంధాలలో సమతుల దృక్పథం అవసరమనే విషయాన్ని స్పష్టం చేస్తాయి.

తమమీద రుద్దబడే ఆధిక్యతను సహించేవాళ్లను తప్పుపడుతుంది వర్ష. కానీ ఆధిక్యత చూపేవాళ్లనే ముందు తప్పుపట్టాలి. ఇంటాబయటా ఆధిక్యతాభావం ప్రదర్శించినంత కాలం మనిషి అధికుడు కాలేడు, ఇది వారి అల్పత్వాన్నే సూచిస్తుందని నొక్కి చెప్పటంలో రచయిత్రి సఫలీకృతులయినారు.

-గంట రామిరెడ్డి
హనుమకొండ

## ఉత్సాహభరితం

*(రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

'స్పృహ' నవల ద్వారా నాగరత్నగారు ముగ్గురు స్నేహితులద్వారా, వారి కుటుంబ సభ్యుల వ్యక్తిగత విశ్లేషణను చేస్తూ రచన సాగించారు. అయితే ఇది ఒక నవలగాకంటే ప్రస్తుత సామాజిక దురన్యాయాలను లైట్‌గా స్పృశిస్తూ డిస్కషన్ మెథడ్‌లో సాగే ఉపన్యాసాల సంపుటిగా కొన్నిచోట్ల అనిపించింది. అయినప్పటికీ పాత్రలపరంగా సంఖ్య ఎక్కువైనప్పటికీ వారివారి సంభాషణలద్వారా సెన్సాఫ్ హ్యూమర్ అనేది వ్యక్తుల సంభాషణలలో ఉండడం ఎంత అవసరమో, అది ఎంతటి క్లిష్టపరిస్థితులనైనా ఎలాగ తేలికపరచగలదో అర్థమవుతుంది. అయితే వ్యక్తులు కుటుంబ సభ్యులుగా, తండ్రిగా, అన్నగా,





ప్రియుడిగా ఉండే మగవాడు భర్తకాగానే ఎలా మారతాడో, లేదా తల్లిగా, చెల్లిగా, ప్రేమను పంచే స్త్రీ భార్యస్థానంలోకి రాగానే స్వార్థంతో సంసారాన్ని ఎలా నరకం చేసుకుంటుందో బిందుద్వారా నిరూపించినా చిత్ర, వర్షలు ఇందుకు అతీతంగా ఉంటారని పాఠకులు ఊహించుకోవాలి. అలాగే ఆఫీసుల్లో అమ్మాయిలు ఉద్యోగాలు చేస్తే ఎదుర్కొనే బాధలే కానీ ప్రౌఢలూ, గ్లామర్ తగ్గి రిటైర్మెంట్‌కి దగ్గరగా ఉండేవాళ్లు ఎదుర్కొనే సమస్యలూ, టీజ్ చేయబడే విధానమూ ఇంకోలా ఉంటాయని వాస్తవానికి దగ్గరగా గిరిజ పాత్రద్వారా అర్థమైంది. చదువుకుని ఉద్యోగాలు చేసే అమ్మాయిల సంభాషణలు చవకబారు ఆలోచనలు లేకుండా వారి అభిరుచులూ, అలవాట్లూ కూడా వారియొక్క వ్యక్తిత్వాన్ని ప్రతిఫలింపచేస్తూ ఉంటాయని మొత్తం మీద వివిధ పాత్రల చిత్రణద్వారా సంఘంలోని వివిధ సమస్యలను చర్చించడమే కాకుండా సమస్యలపట్ల స్పృహ కలిగి ఉండడంద్వారా నవల ఆద్యంతమూ ఉత్సాహభరితంగా చదివించేటట్లు చేయడంలో నాగరత్నగారు కృతకృత్యులయ్యారు!

-సి.ఎస్.లక్ష్మి
విజయనగరం

## ఆంగ్ల వ్యామోహం

*(మూడవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

'స్పృహ' ఇతివృత్తంలేని గమనంతో సాగింది. అయినా, రచయిత్రి చక్కని శైలిలో సునిశితమైన సంభాషణలతో సున్నితమైన హాస్యంతో సాగించారీ నవలని. మూడు రకాల మనస్తత్వాలున్న ముగ్గురమ్మాయిల జీవితాల్ని ముప్పేటగా అల్లారు.

నవల ప్రారంభంలోనే తెలుగుభాషను కించపరిచే తెలుగు వాళ్లను ముఖం వాచేలా చీవాట్లు పెట్టడం, స్త్రీ పురుషవాదాలు కాదు కావల్సింది, 'మానవతావాద' మనడం బాగుంది. ఏవో కారణాలవల్ల వ్యసనాలకి బానిసయి కుటుంబ స్థితిగతులు తారుమారవుతున్నా వాటినుండి బయటకు రాలేని పరిస్థితి కొందరికి. పాపం వారికీ బాధ వుంటుంది మనసులో. కుటుంబంలోని వారిపై మమతలూ, మమకారాలూ వుంటాయి కానీ వ్యసనలోలత వాటిని మింగేస్తుంది. మామూలువాళ్లకి ఆ కారణాలు చిన్నవిగానూ హాస్యాస్పదంగానూ అన్పించవచ్చు. అయితేం అవే ఆ వ్యక్తిపై బలమైన ముద్రలు వేస్తాయి. అలాంటి వ్యక్తులే బిందు, చిత్రల తండ్రులు. మనసులో బాధపడుతున్నా బయటపడి ఆ వ్యక్తుల్ని బాధించక సున్నితంగా మసులుకోవడం చదువుకున్న బాధ్యతెరిగిన కుటుంబ వ్యక్తుల వ్యక్తిత్వాన్ని తెలియపరుస్తుంది.

ప్రేమించినవ్యక్తిని పెళ్లాడలేక బ్రహ్మచారిణిగానే ఉండిపోయిన కృష్ణవేణి, ఆమెపై క్రోధాన్ని మరొకవ్యక్తిపై ప్రేమగా మలచుకున్న మహేంద్ర తిరిగి దగ్గర కావడం అసహజంకాదు. కానీ వారి మధ్య శారీరక బంధం ఏర్పడకపోవడం అసహజంకాదు కానీ అరుదు. కృష్ణవేణి పెళ్లి ఏర్పాటు చేసి తనపై మచ్చ తొలగించుకున్నట్టుగానే, బిందు తండ్రి కూడా తాగుడు మానివేస్తే మరో సమస్య తీరేది

'స్మైల్ ఈజ్ ది సీక్రెట్‌ఆఫ్ అవర్ ఎనర్జీ' అంటూ ముగించడం మరీమరీ బాగుంది. కానీ ఆంగ్లంలో మాట్లాడవద్దు అనవసరంగా అంటూనే అనేక చోట్ల ఆంగ్లపదాలు వాడారు అతి మామూలుగా రచయిత్రి.

-మూర్తి
తణుకు

## పక్షపాతం లేదు

*(నాలుగవ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)*

ప్రాణంతో వుండటానికి శ్వాస ఎంత అవసరమో తృప్తిగా, ఆనందంగా జీవించటానికి స్వేచ్ఛ అనేది అంతే అవసరం మనిషికి. ఎన్ని సంపదలున్నా, భోగభాగ్యాలున్నా అదొక్కటీ లేనప్పుడు మిగతా వాటన్నిటి విలువ ఏదీ లేకుండాపోతుంది. స్త్రీకి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లేవు. బాధ్యతలే తప్ప విలువలేదు అనేది

నిర్వివివాదాంశం. ఎంతోమంది మహానుభావులు ఆడదాన్ని ఆ వూబిలోంచి బయటికి లాగటానికి ప్రయత్నించారు. స్త్రీ జీవనగమనంలో ఎన్నో మార్పులు వచ్చాయి. అన్ని రంగాల్లోనూ ముందడుగు వేస్తోంది ఆమె. మగవాడు ఆమెకిచ్చే విలువా పెరిగింది. అంచేత ఈనాటి స్త్రీ నాకు స్వేచ్ఛ లేదంటూ విలపించాల్సిన అవసరంలేదు. ఎటువంటి సమస్యనుంచయినా బయటపడగల అవకాశాలు ఆమెకున్నాయి.

స్త్రీవాదీ, పురుషవాదీ కావడం కాదు ముఖ్యం- మానవతావాది కావడం ముఖ్యం అని ఈశ్వరీదేవి ద్వారా రచయిత్రి అందించిన ఈ సందేశం అక్షరాలా సత్యం. ఈ నవలకి ఆయువుపట్టులాంటిది. స్త్రీలందరూ మంచివారు, మగవాళ్లందరూ చెడ్డవాళ్లు అనేందుకు వీల్లేదు. ప్రతి కుటుంబంలోనూ ఒక స్త్రీకి ఎదురయ్యే సమస్యకి పరోక్షంగా మరో స్త్రీయే ఏదో ఒకరూపంలో కారణం

మగవాడికన్న స్త్రీ కాస్త ఎక్కువగా బాధపడుతున్న మాట నిజం. కానీ అందుకు మగవాడే బాధ్యుడు కాదు. అతని వెనకాల మరో స్త్రీ కూడా వుంటుందన్న విషయం ఈ నవలలో స్పష్టంగా చెప్పారు. మొత్తానికి స్త్రీ స్వేచ్ఛ అంటూ ఊరికే గొంతులు చించుకుని ఆవేశపడేవాళ్లకి బ్రేకువేస్తూ అసలు సమస్య ఎక్కణ్ణుంచి పుడుతోంది, దాన్ని ఏ కోణంలోంచి చూడాలి అన్న విషయాన్ని నిశితంగా చర్చించారు నాగరత్నగారు.

-డియల్. అన్నపూర్ణ,
బెంగుళూరు.

## నిస్పృహల నీడలు

*(ఐదవ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)*

**మ**నిషి తన అహాన్ని సంతృప్తిపరచుకోవడానికి, ఎదుటివారి అహాన్ని ఎంతగా దెబ్బతీస్తాడో తెల్పి, దెబ్బతిన్న మనిషిలో పెరిగే నిస్పృహను కొంతవరకు చూపింది 'స్పృహ'. ఆధిపత్యానికి, అధికారానికి తలవంచాల్సిన పరిస్థితుల్లో మనసు పడే నరకయాతన మనిషిని అశాంతికి గురిచేయడమేకాక, సహనం చచ్చిన మనిషి సర్దుబాటును కోల్పోయి ఎదురుతిరిగితే మిగిలేది విరోధం, విప్లవం. దీన్ని నిరూపించాలనే రచయిత్రి ప్రయత్నం అభినందించదగ్గది.

కానీ ఈ స్పృహ నవలలాకాక అన్ని రంగాలను అంతో ఇంతో స్పృశిస్తూ సాగిన విశ్లేషణాత్మక వ్యాసంలా ఉన్నా విసుగు పుట్టకుండా చదివిస్తుందీ నవల. కారణం రచయిత్రి వాడిన చక్కని, హాస్యచతురోక్తులు. అడుగడుగునా ఆహ్లాదకరమైన జోకులతో సాగిన ముగ్గురు అమ్మాయిల మధ్య సంభాషణే అయినా ముఖ్యమైన ప్రతి విషయాన్ని పొందుపరచటానికి రచయిత్రి పడిన తాపత్రయం అర్థమవుతోంది. కానీ రచయిత్రి పరిష్కారాన్ని సూచించటంలో పూర్తి విజయాన్ని సాధించలేకపోయారని చెప్పవచ్చు. అన్ని విషయాల్ని అన్ని కోణాలనుండీ విశ్లేషించారు అంతే. వర్ష, చిత్ర, బిందు మాత్రం ప్రస్తుత యువతరం ఆలోచనలకు అద్దంపట్టారు.

ఇతివృత్తంలో బలంగానీ, బలమైన పాత్రలు కానీ లేకపోవటంతో సస్పెన్స్, సీరియస్నెస్ కొరవడ్డాయి. దాంతో పాఠకునికి పదికాలాలపాటు గుర్తించుకోవాల్సిన పాత్రలంటూ ఏమీ లేవు, చర్చలు మాత్రం ఉన్నాయి. రచయిత్రి సునిశిత దృష్టి, స్థిరమైన అభిప్రాయాలు, వినోదాత్మక వ్యాఖ్యలతో కూడకున్న 'సెన్సాఫ్ హ్యూమర్' మాత్రం మెచ్చుకోదగినది. ఏదిఏమైనా సమాజంలోకి 'నిస్పృహల నీడల్ని' చతుర పాఠకులకు చూపటానికి జరిగిన ప్రయత్నం మంచిదే.

-కె. మాధవీలత,
వెంట్రప్రగడ

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 290328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

